# మార్పు

రేడియోలో ఎవడో ఫ్రాన్స్ మీద దుమ్మెత్తి పోస్తున్నాడు. ఫ్రెంచివాళ్ళు ఎందుకూ పనికి రాని దద్దమ్మలంటున్నాడు. పిరికిపందలంటున్నాడు. పోయిన ప్రపంచయుద్ధంలో మన సైన్యం వాళ్ళ దేశాన్ని ఆదుకోకపోయినట్లయితే అసలు ఫ్రాన్స్ అనే దేశం లేకుండా పోయేదని అంటున్నాడు. ఐక్యరాజ్యసమితిలో మనకు వ్యతిరేకంగా వాదిస్తున్నందుకు ఫ్రెంచి వైనూ, ఫ్రెంచి చీజూ, అసలు ఫ్రెంచి వస్తువులేవీ వాడవద్దంటున్నాడు.



ఫ్రాన్స్‌తో అమెరికాకి విరోధం మొదలయినప్పటి నుంచి నాకు సంధ్యతో పరిచయమైనప్పటి రోజులు గుర్తొస్తున్నాయి. ఆరోజుల్లో నేను డిట్రాయట్‌లో వుంటుండేవాణ్ణి. పటేల్ బ్రదర్స్ వాళ్ళ దుకాణంలో పార్ట్‌టైమ్ క్లర్క్‌గా పనిచేస్తుండేవాణ్ణి. ఒక శుక్రవారం మధ్యాహ్నాం ఒకామె దుకాణానికొచ్చింది. దాదాపు ముప్ఫై సంవత్సరాలుంటాయి. అలాగే చూస్తూ ఉండాలనిపించేటంత అందమైన ముఖం. ప్రశాంతంగా, వెలుగు చిమ్మే ముఖం. చూడగానే ఆమెలో ఏదో ప్రత్యేకత వుందనిపించింది.

దుకాణంలోకి వచ్చి, 'హలో' అంటే సమాధానంగా చిరునవ్వు నవ్వి, షాపింగ్ కార్ట్ ఒకటి నెట్టుకుంటూ షాప్ వెనుకభాగానికి వెళ్ళింది. ఆమెను చూస్తూ కూర్చున్నాను. పప్పులు, ఒక పచ్చడి సీసా తీసుకుంది. రెండు ఇన్‌స్టెంట్ ఇడ్లీ పేకెట్లు తీసుకుంది. కూరగాయల రిఫ్రెజిరేటర్ దగ్గర ఆగింది. పుస్తకం చేతుల్లో ఉన్నా ఆమెనే చూస్తూ కూర్చున్నాను. ఇంతలో ఏదో అడగాలన్నట్లు ఇటు తిరిగిందామె. నేను వెంటనే పుస్తకంలోకి చూపు మార్చాను. ఆమె ఏమీ అడగలేదు. పది నిముషాల తర్వాత షాపింగ్ కార్ట్ నెట్టుకుంటూ కేషియర్ కౌంటర్ దగ్గరకొచ్చింది.

ఆమె తెచ్చిన సరుకులన్నీ చెకవుట్ చేస్తే 43.54 డాలర్లయింది. ఆమె చెక్కు రాసిచ్చింది. చెక్కు మీద పేరు చూసి, "మీరు తెలుగువారా?" అని అడిగాను.

"ఫరవాలేదే! ధైర్యంగానే అడిగేశారే," అంది ఆమె నవ్వుతూ. "మిమ్మల్నెప్పుడూ చూడలేదే ఇంతకుముందు. ఆ పటేల్ ఉంటుండేవాడు నేను వచ్చినప్పుడల్లా."

"అవునండీ. నేనిక్కడ చేరి మూడురోజులయింది. పార్ట్‌టైమ్ ఉద్యోగం దొరికింది. సోమవారం, శుక్రవారం ఇక్కడ పనిచేస్తాను."

"వెరీగుడ్. అయితే ప్రతివారం కనబడతారన్నమాట."

"మీరు వారం వారం ఇక్కడ షాపింగ్ చేస్తారా?"

"శుక్రవారం కూరగాయలు కొనటానికి వస్తుంటాగా."

"అలాగా. మీకు శుక్రవారం సెలవా?"

"అబ్బే, మీ పటేల్ గురువారం నాడు ఫ్రెష్‌గా కూరగాయలు తెస్తాడుగా. శుక్రవారం సాయంత్రం లోగా వస్తే మంచి సెలక్షన్ దొరుకుతుంది. నేను మధ్యాహ్నామే వస్తుంటాను. కస్టమర్స్ ఎక్కువగా వుండరు. తీరిగ్గా కూరగాయలు ఏరుకోవచ్చు."

"మంచిది. మీరు ప్రతి శుక్రవారం కనిపిస్తే బాగుంటుంది," అన్నాను అనాలోచితంగా.

సమాధానంగా చిన్నగా నవ్వి, "ఫ్రాన్స్ గురించి చదువుతున్నారు. వెకేషన్‌కి వెళ్తున్నారా?" అంది, డెస్క్ మీదున్న నా పుస్తకం వైపు చూస్తూ.

"లేదండీ... అవును... వెకేషన్‌కి వెళదామనే ఒకప్పుడు ఈ ట్రావెల్ గైడ్ కొన్నాను. పరిస్థితులు మారటం వల్ల వెకేషన్‌కి వెళ్ళలేదు. ఈమధ్య మళ్ళా చదవటం మొదలుపెట్టాను. ఊరికే."

"మంచిది, చదవండి," అని తన సామానులు రెండు చేతుల్తో తీసుకుని నడుస్తూ వెళ్ళిపోయిందామె. కారులో వచ్చిందేమో ఆమెకు ఎలాంటి కారుందో చూద్దామనుకున్నాను. కాని ఆమె కారులో వచ్చినట్లు లేదు. లేక దగ్గిర్లో ఎక్కడైనా నిలిపి వచ్చిందో.



# 2

మరుసటి శుక్రవారం ఆమె కోసం ఎదురు చూశాను. పోయిన వారం పన్నెండు గంటలకు వచ్చిన ఆమె ఆరోజు రెండు గంటలకు కూడా రాలేదు. పుస్తకం వైపు చూస్తున్నానుగాని ఏం చదువుతున్నానో గుర్తుండటం లేదు.

దాదాపు మూడు గంటలకు ఆమె వచ్చింది. ఒక్కసారి మాత్రం చూసిన ముఖం చిరకాల పరిచితంగా కనిపించింది. అదే ఉత్సాహం, అదే చిరునవ్వు.

"బాగున్నారా?"

"యస్. మీరూ?"

"ఫైన్. థాంక్యూ. ఎంతవరకొచ్చింది మీ పుస్తకం?"

"ఇది ఆ పుస్తకం కాదండీ. అది ట్రావెల్ గైడ్ కదా? దీన్ని మా లైబ్రరీలో తీసుకున్నాను. ఫ్రాన్స్ చరిత్ర గురించి."

"అలాగా! మంచిది. చదవండి."

షాపింగ్ కార్ట్ నెట్టుకుంటూ షాప్ వెనుకభాగంలో వున్న కూరగాయల రిఫ్రెజిరేటర్‌వైపు వెళ్ళిందామె. పది నిముషాలు శ్రద్ధగా బెండకాయలూ, దొండకాయలూ ఏరి ఏరి ప్లాస్టిక్‌బ్యాగుల్లో వేసుకుంది. కొతిమేర కట్ట ఒకటి తీసుకుంది. తిరిగి కౌంటర్ దగ్గిరకొస్తుంటే నేను పుస్తకంలో తలదూర్చాను.

"ఎంతవరకొచ్చిందీ ఫ్రెంచి చరిత్ర?"

"నెపోలియన్ ఇప్పుడే ఆస్ట్రియా మీద యుద్ధం ప్రకటించాడు."

"అంతవరకూ వచ్చారా! బాగుంది. అయితే ఫ్రెంచి విప్లవం గురించి మీకేమనిపించింది?"

"అదా, ఏమో. అంతా అయోమయంగా ఉండిందండీ. ఎవరు మంచివాళ్ళో, ఎవరు చెడ్డవాళ్ళో, ఎవరిది తప్పో, ఎవరిది ఒప్పో చెప్పటం చాలా కష్టం అనిపించింది."

"అరే! ఫరవాలేదే! మీ మనసింకా మూసుకుపోలేదన్నమాట. గుడ్! చదవండి. పుస్తకం పూర్తయింతర్వాత  మళ్ళా ఒకసారి 1789 విప్లవం గురించి చదవండి. ఆ తర్వాత మాట్లాడుకుందాం."

"బాగుందండీ మీ వరస. నేను మా పిల్లలకు హోమ్‌వర్క్ ఇచ్చినట్లు ఇస్తున్నారు. పైగా ఆ తర్వాత పరీక్ష కూడా పెడతామంటున్నారు."

"పరీక్ష కాదులెండి. ఊరికే మాట్లాడుకుందాం. ఎంతమంది పిల్లలు మీకు?"

"ఓ అదా! ఈ సెమెస్టర్‌కి ముప్ఫైమంది."

"అంటే మీరు టీచర్ అన్నమాట. ఎక్కడ పనిచేస్తున్నారు? ఏం చెప్తారు?"

"ఓక్‌లాండ్ కమ్యూనిటీ కాలేజీలో పార్ట్‌టైమ్ కెమిస్ట్రీ ఇన్‌స్ట్రక్టర్‌గా పనిచేస్తున్నాను. బుధవారం నా క్లాస్."

"బాగుంది."

తన కూరగాయల సంచులు కౌంటర్ మీద పెట్టిందామె. చెకవుట్ చేసి 11.53 డాలర్లయిందని చెప్పాను. చెక్కు రాసిచ్చిందామె.

"మీరూ?"

"అంటే? నా గురించి ఏం తెలుసుకోవాలనుకుంటున్నారు?"

ఏం చెప్పాలో తెలియలేదు నాకు. ఈమె సామాన్యురాలు కాదు. చాలా గడుసైన మనిషిలాగుంది.

"మీరేం చేస్తారు?"

"ఇదుగో. మంచి కూరగాయలు తీసుకెళ్తున్నానుగా. చక్కగా వంట చేస్తాను."

"మంచిది," అన్నాను. ఈమెకు తన గురించి చెప్పటం ఇష్టంలేదేమో. ఇష్టంలేని మనిషితో ఎందుకులే ఈ సంభాషణ అని మరేం అడగలేదు.

"వస్తాను. శుక్రవారం కనిపిస్తాను," అంటూ వెళ్ళిపోయిందామె.

ఈసారి కూడా నడుస్తూనే వెళ్ళింది.

## 3

మరుసటి శుక్రవారం మధ్యాన్నానికే వచ్చిందామె. మామూలుగానే చాలా ఉత్సాహంగా, వెలుగులా వచ్చేసింది.

"నాకోసం చూస్తున్నారా?"

"అబ్బే, లేదండీ... అవును...," అన్నాను తల వంచుకుని.

షాపింగ్ కార్ట్ తీసుకొని కూరగాయల రిఫ్రిజిరేటర్ వైపు వెళ్ళిందామె. పది నిముషాల్లో చిన్న వంకాయలూ, సొరకాయ, చిక్కుడుకాయలూ, ఒక పచ్చడి సీసా తీసుకువచ్చింది. నేను వాటిని చెకవుట్ చేసి 14.29 డాలర్లని చెప్పాను. చెక్కు రాసిచ్చిందామె.

"ఎలా వుంది ఫ్రెంచి విప్లవం? ఇంకా ఎవరివైపు మొగ్గటం లేదా మీరు?"

"ఇంకా ఈ పుస్తకం పూర్తికాలేదండీ. ఈ వారం అంత తీరక దొరకలేదు చదవటానికి. ఫ్రెంచి విప్లవం గురించి రెండు పుస్తకాలు తెచ్చాను లైబ్రరీ నుంచి. ఈ పుస్తకం అయిపోగానే అవి చదువుతాను. ఆ తర్వాత మీరు నాకు పరీక్ష పెట్టొచ్చు."

"సరే. త్వరగా చదవండి మరి," అని, తన వస్తువులు తీసుకొని వెళ్ళిపోయిందామె.

## 4

మరుసటి వారం కొంచెం ధైర్యం చేసి, "మీ గురించి ఏమీ చెప్పరా?" అని అన్నాను.

"ఏం తెలుసుకోవాలని వుంది మీకు?"

"మీరేం చేస్తారు?"





"చెప్పానుగా ఒకసారి. బాగా వంట చేస్తానని."

ఈమెను గురించి తెలుసుకోవాలని చాలా కుతూహలంగా వుంది. కానీ ఈమేమో ఏ ప్రశ్నకీ సూటిగా సమాధానం చెప్పే రకంగా లేదు. లేక ఈ గడుసుతనం అంతా ఏదైనా బలహీనతని కప్పిపుచ్చటానికేమో. ఛా! అలా అయి వుండదు. ఇంత అందమైన మనిషికి, ఇంత ప్రశాంతంగా వెలుతురు చిమ్ముకుంటూపోయే మనిషికి ఏం బలహీనత వుంటుంది.

ఈసారి శుక్రవారం నాడు కొంచెం ధైర్యం చేసి ఆమెను చాలా చాలా అడగాలని నిశ్చయించుకున్నాను. ముఖ్యంగా పెళ్ళి అయిందో లేదోనని. ఆమెకు దాదాపు ముప్ఫై యేళ్ళు వుండి వుంటాయి. ముప్ఫైయేళ్ళ ఆడమనిషికి పెళ్ళి కాకుండా ఎలా వుంటుందీ? అయినా ఎందుకో కాకుండా వుంటేనే బావుండు అనిపించింది.

రెండురోజుల్లోనే నా ఊహాగానానికి బ్రేక్ పడింది. ఆదివారం నాడు డిట్రాయట్ తెలుగు సంఘం వారు ఏర్పాటుచేసిన ఉగాది ప్రోగ్రాంకి వెళ్ళి అక్కడ కొందరు మిత్రులతో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా సంధ్య కనిపించింది. ఎవరితోనో మాట్లాడుతుంది. నన్ను చూసినట్లు లేదు.

నా పక్కన కూర్చుని వున్న మిత్రుణ్ణి తట్టి, "అటువైపు వాకిలికి దగ్గరగా నీలంరంగు చీర కట్టుకున్నామె వుంది చూడూ, ఆమె ఎవరో తెలుసా?" అన్నాను. వాడు తెలియదు అంటాడు. అప్పుడు నాకు బాగా తెలుసు అని చెప్పుకుందాం అనుకున్నాను.

"అరే, దాంతో నీకెందుకురా. దాన్ని పటేల్‌గాడు వుంచుకున్నాడు," అన్నాడు వాడు. ఏదో జగమెరిగిన సత్యంలా, చాలా తేలికైన విషయంలా.

"అలాగా," అన్నాను, గాలిపోయిన బెలూన్‌లా.

ఇది నిజం అయివుంటుందా? ఇదేనా ఆమె కప్పిపుచ్చటానికి ప్రయత్నిస్తున్న విషయం?

## 5

మరుసటి శుక్రవారంనాడు ఆమె కోసం ఎదురుచూడకూడదని మనసూ, చూడాలని ఆరాట పడుతున్న కళ్ళూ ఘర్షణ పడ్డాయి. ఆమె రాగానే ముఖం తిప్పేసుకోవాలనీ, ఛీ అనాలనీ, నిర్ణయించుకున్నాను.

వస్తూనే, "ఏంటీ, అలా వున్నారీరోజు?" అందామె.

"అలాగా అంటే? ఎలా వున్నాను?"

"ఏదో విచారంలో వున్నట్లు కనిపిస్తుంటేను."

"ఏం లేదులెండి."

"సరే."





అడగాలా? వద్దా? ఆమెను గమనిస్తూ కూర్చున్నాను కౌంటర్ వెనుక. పది నిముషాల్లో కావాల్సిన కూరగాయలు తీసుకొని వచ్చిందామె. నేను వాటిని చెకవుట్ చేసి ఎంతయిందో చెప్పాను. ఆమె చెక్కు రాసి ఇచ్చింది.

"మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. సూటిగా సమాధానం చెప్తారా?"

"అది అడిగిన ప్రశ్ననుబట్టీ, అడిగే తీరునుబట్టీ, అడగటం వెనుక వున్న కారణం బట్టీ వుంటుంది," అంది ఆమె మూతి బిగించి చూస్తూ. నన్నేదో ఆటలు పట్టించటానికి ప్రయత్నిస్తున్నట్లు.

"మీరేం చేస్తారు?"

"ఆ ప్రశ్న ఇదివరకే అడిగారుగా? నేను బాగా వంట చేస్తానని చెప్పాను. మీకు గుర్తులేదా? లేక నా సమాధానం మీద నమ్మకం లేదా?"

ఈమె చెప్తుంది నిజమా? లేక తను చేస్తున్న వెధవ పనికి ఇదొక ముసుగా?

"ఏంటీ ఆలోచిస్తున్నారు? మీకూ వంటమనిషి కావాల్నా?"

"లేదు. నాకు వంట చేసుకోవటం బాగానే వచ్చు."

"అయితే మంచిదే. మీ ప్రశ్నలు అయిపోయాయా? ఇక వెళ్ళవచ్చునా నేను?" అందామె నవ్వుతూ.

"మీరు..."

"ఊహూ? నేను? నేనంటే భయమా మీకు?"

"భయం ఎందుకు?"

"మరి అడగండీ అడగదల్చుకుందేంటో."

"మీరు... మా స్నేహితుడొకడు... మీరు... గుజరాతీ అతను ఒకడు మిమ్మల్ని వుంచుకున్నాడని అందరూ చెప్పుకుంటున్నారు."

"తల వంచుకుంటారెందుకూ? చెప్పదల్చుకుందేదో సూటిగా ముఖంలోకి చూసి చెప్పొచ్చుగా? నిజమే, అతను నన్ను ఉంచుకున్న మాట నిజమే."

ఇంత నిర్మోహమాటంగా, సిగ్గు లేకుండా మాట్లాడే ఆడదానితో ఇంకా ఏం మాట్లాడగలను?

"అంతేనా? ఇంకా ఏమైనా అడగాల్సింది ఉందా?"

"బ్రతకటానికి మీకు మరొక మార్గం దొరకలేదా?"

"ఎలాంటి మార్గం? మీ మార్గంలాంటి మార్గమా? మిమ్మల్ని కూడా ఒక గుజరాతీ అతను ఉంచుకున్నాడుగా?"

"నన్నా? నేనిక్కడ ఉద్యోగం చేస్తున్నాను. నన్నెవడూ ఉంచుకోలేదు."

"మీరు చేస్తే ఉద్యోగం, నేను చేస్తే ఉంచుకోవటమూనా?"

"ఈ గుజరాతీవాడికీ నాకూ శరీర సంబంధం లేదు, మీకులాగా."

"నాకు శరీర సంబంధం ఉందని చెప్పానా నేను?"



"ఇందాక చెప్పారుగా ఉంచుకున్నాడని?"

"ఫ్రెంచి విప్లవం గురించి రెండు పుస్తకాలు చదివానన్నారుగా? మీరూ, నేనూ ఇద్దరం ఉంచుకున్నవాళ్ళమే. మీ స్నేహితులు శరీర సంబంధం అంటగట్టినంతమాత్రాన నా ఉద్యోగం చెడ్డదీ, మీ ఉద్యోగం గౌరవవంతం అయిందీ అవుతుందా? ఆ ఫ్రెంచి విప్లవం గురించి మరొకసారి చదవండి. ఈసారి పిల్లలు పరీక్షలకు చదివినట్లు గాకుండా, కాస్త బుద్ధీ, జ్ఞానం ఉన్నవాళ్ళు విషయం తెలుసుకోవటానికి చదివినట్లు చదవండి. వస్తాను," చకచకా నడుస్తూ వెళ్ళిపోయిందామె.

## 6

మరుసటి శుక్రవారం నాడు ఆమె రాలేదు. ఇక రాదేమో. నేను ఇక్కడ పనిచేసినంతకాలం షాపింగ్‌కి మరోచోటికి పోతుందేమో.

ఈమె నిజంగా గుజరాతీవాళ్ళ ఇంట్లో హౌస్‌కీపర్‌గానా ఉండటం? ఆ గుజరాతీవాడితో సంబంధం ఒట్టి పుకారు మాత్రమేనా? పాపం, ఆమెను కష్టపెట్టానేమో అలాంటి ప్రశ్నలడిగి. అసలు ఆమెను అలాంటి ప్రశ్నలడిగే అధికారం నాకెక్కడిది? నన్ను నానా మాటలు అనకుండా ఓర్పుగా ఎందుకు జవాబిచ్చిందామె? నేనంటే ఆమెకు ఇష్టమేమో?

రెండు వారాల తర్వాత మళ్ళా వచ్చిందామె. ఈసారి ముఖంలో ఆ నవ్వు లేదు, ఆ వెలుతురు లేదు. కవచం విరిగిపోయిన సిపాయిలా ఉంది. ఆమెను చూడగానే నాకు జాలి వేసింది.

"బాగున్నారా?" నేను పలకరించాను.

"హూ. మీరు?"

"బాగానే వున్నాను. థాంక్యూ. మీరు పోయిన వారం రాలేదేం? నామీద కోపం వచ్చిందేమో ననుకున్నాను. సారీ."

"అంటే ఇప్పటికి కోపం దిగి ఉంటుంది. అందుకే వచ్చాననుకుంటున్నారా?" అని పెద్దగా నవ్విందిామె. ఇదివరకటి సంధ్యలాగే కనిపించింది మళ్ళా. నాకేదో పెద్ద బరువు దించినట్లనిపించింది.

"మీకోసం చూశాను. మీరు రాకపోయేసరికి నామీద కోపగించారేమో ననుకున్నాను. నేను మీతో సంస్కారం లేనివాడిలాగా మాట్లాడాను. సారీ."

"అరే! మీకు పెద్దపెద్ద మాటలు కూడా వచ్చులాగుందే!"

"మీరు మళ్ళా మునుపటిలాగా మాట్లాడుతున్నారు. నాకు చాలా సంతోషంగా వుంది."

"మీరు నిజంగా సంస్కారం ఉన్నవాళ్ళే. నేను కూరగాయలు కొనుక్కోవచ్చా? లేక ఇలాగే మాటల్లో పెట్టి నన్ను నిల్చోబెడతారా?"

"మీకు అభ్యంతరం లేకపోతే ఒక ప్రశ్న..."

"మళ్ళానా? ఈసారి నెలరోజులదాకా కనపడను!" అని తెరలు తెరలుగా నవ్విందిామె. "సరే అడగండి."

“మీకు పెళ్ళయిందా?”

“అయింది.”

“సారీ.”

“సారీ దేనికీ? పెళ్ళయినందుకా? అంత ప్రమాదమయిందా పెళ్ళి? మీరు ముందే చెప్పుంటే చేసుకోకుండా ఉండేదాన్నిగా!” అని మూతి బిగించి, కళ్ళు కొంచెం చిన్నవి చేసి నావైపు చూసిందామె. ఇంకా ఏదైనా ఉందా అడగాల్సింది అని అడుగుతున్నట్లు.

“మీరు చాలా విచిత్రంగా మాట్లాడుతారండీ. మిమ్మల్ని అర్థం చేసుకోవటం చాలా కష్టం.”

“భలేవారే మీరు. తెరచి పెట్టిన పుస్తకంలాంటిదానివి అనేది మా అక్క. మీరేమో అర్థం చేసుకోవటం కష్టం అంటున్నారు.”

“పెళ్ళి అయిన వాళ్ళయితే మీరు ఆ గుజరాతీవాళ్ళతో ఎందుకుంటున్నారు?”

“అదా? నా కథ చాలా పెద్దదిలెండి. అంతా చెప్పాలంటే చాలాసేపు పడుతుంది. ఈరోజు నేను తొందరగా వెళ్ళాలి. మరొకరోజు మాట్లాడుకుందాం,” అని షాపు వెనకాల కూరగాయల రిఫ్రిజిరేటర్ వైపు నడిచిందామె.

## 7

మా పరిచయం కొద్దికొద్దిగా పెరుగుతూ వచ్చింది. ఆమెతో సుళువుగా, భయం లేకుండా మాట్లాడగల్లంత ధైర్యం వచ్చేసింది నాకు. ఆమెకు పెళ్ళి అయిపోయి ఐదు సంవత్సరాలయింది. పెళ్ళికి ముందు ఉస్మానియాలో ఎకనామిక్స్ లెక్చరర్‌గా పనిచేసిందట. అమెరికా సంబంధం పోగొట్టుకోవటం ఇష్టంలేక తల్లిదండ్రులు చాలా ఖర్చుపెట్టి, పెద్ద కట్నం ఇచ్చి పెళ్ళి చేసి, ఇక్కడకు పంపించారు. అతనికి అంతకుముందు నుంచే ఇక్కడ ఒకామెతో సంబంధం ఉండిందట. వచ్చినప్పటి నుంచీ, తిరిగి ఇండియా పంపించాలని ప్రయత్నించాడట. చివరికి అతనితో ఉండలేక ఇక్కడ శక్తి అనే ఒక స్త్రీల సంఘం వాళ్ళ సహాయంతో అతనికి విడాకులిచ్చిందట. ఆ శక్తి వాళ్ళే తాత్కాలికంగా ఈ హౌస్ కీపర్ ఉద్యోగం చూపించారట.

నేను నా గురించి చెప్పాను ఆమెకు. ఏడు సంవత్సరాల క్రితం పెట్రోలియం కెమిస్ట్రీలో పిహెచ్‌డి చేసి అమెరికా వచ్చాను. ఇక్కడ వెయిన్ స్టేట్ యూనివర్శిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా చేరాను. కాని ఈమధ్య ఆర్థిక పరిస్థితులు బాగాలేక, నా అదృష్టం బాగాలేక, టెన్యూర్ రాలేదు. వెంటనే మరొక ఉద్యోగం దొరక్క, ఈ గుజరాతీ వాళ్ళ దుకాణంలో పార్ట్‌టైమూ, కమ్యూనిటీ కాలేజీలో పార్ట్‌టైమూ చేస్తున్నానని చెప్పాను.

ఒకరోజు ధైర్యం చేసి ఆమెను నా ఎపార్ట్‌మెంట్‌కి భోజనానికి రమ్మని ఆహ్వానించాను. ఆమె ఒప్పుకుంది.



## 8

సంధ్యని ఇంప్రెస్ చెయ్యాలని నాకు చాలా ఆరాటంగా ఉంది. మంచి వంట చెయ్యాలనుకున్నాను. కాని బ్రతుకుతెరువుకి వంట చేస్తున్న ఆమెను నా వంటతో ఇంప్రెస్ చెయ్యటం అయ్యే పని కాదని నాకు తెలుసు. అయినా నా ప్రయత్నం నేను చేశాను. గుత్తి వంకాయ కూర చేశాను, పొటాటో కర్రీ చేశాను, స్పినాచ్ పప్పు చేశాను. స్టోర్‌లో కొనుక్కొచ్చిన పెరుగు ఉంది. అదీ నా లంచ్ ప్రిపరేషన్.

సంధ్య పదకొండున్నరకు వచ్చింది. చాలా సింపుల్‌గా అలంకరించుకుని వుంది. మామూలుగా, ప్రశాంతంగా, నవ్వుతూ వచ్చింది. నాకోసం రోజాపూలు తీసుకొచ్చింది. థాంక్స్ చెప్పి వాటిని ఒక గ్లాస్‌లో వుంచాను. అప్పటిదాకా నా దగ్గర ఒక ఫ్లవర్‌వాస్ కూడా లేదని నేను గ్రహించలేదు.

నిన్ననే తీసుకొచ్చిన ఫ్రెంచి వైన్ బాటిల్ నుంచి కార్క్ తీసి ఆమెకు ఒక గ్లాస్ వైన్ అందించాను.

“సారీ, నాకు వైన్ తాగటం అలవాటు లేదండీ,” అందామె.

“అదేంటీ? ఫ్రాన్స్ మీద అంత అభిమానమున్నవారు, వైన్ తాగకపోవటమేంటీ? కొంచెం తీసుకోండి.”

“ఫ్రాన్స్ అంటే నాకు అభిమానమని నేను చెప్పానా? ఫ్రెంచి విప్లవం అంటే అభిమానం ఉన్నమాట నిజమే.”

“మీకు ఫ్రెంచి విప్లవం మీద అంత అభిమానానికి కారణం?”

“అయ్యో! మీకు తెలియక అడుగుతున్నారు. అది చాలా డేంజరస్ ప్రశ్న,” అంది ఆమె చిన్నగా నవ్వుతూ. “ఫ్రెంచి విప్లవం గురించి నేను మాట్లాడటం మొదలుపెట్టానంటే, ఈమెను ఎందుకు అడిగానురా బాబూ అనుకుంటారు మీరే!”

“ఫరవాలేదు లెండి. చెప్పండి. అసలు ఈ ఫ్రెంచి విప్లవం అంటే మీకెందుకూ అంత ఇష్టం?”

“అందులో నా ఇష్టం అయిష్టంతో సంబంధం ఉంటేగా. నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో మా అక్క ఫ్రెంచి విప్లవం మీద పిహెచ్‌డి చేసేది. ఇంట్లో మేము వింటున్నా వినకపోయినా దాని గురించి పొద్దస్తమానం ఏదో వాగుతూ వుండేది. ఇక మాకు ఫ్రెంచి విప్లవం గురించి తెలియకుండా ఎలా వుంటుందీ? మా ఇంట్లో అందరం ఫ్రెంచి విప్లవం మీద ఎక్స్‌పర్ట్‌లం అయిపోయాము,” అంది ఆమె నవ్వుతూ.

“అలాగా, రెండు పుస్తకాలు చదివానుగానీ అందులో నాకేమీ ఇంటరెస్టింగ్‌గా అనిపించలేదండీ.”

“భలేవారే మీరు. చెత్త పుస్తకాలు చదివి వుంటారు. కొందరు రచయితలు చరిత్ర అటే వాణ్ణి వీడు చంపటం, వీణ్ణి వాడు జయించటం అనుకుంటారు. అలాంటివాళ్ళు రాసిన పుస్తకాలు కాదు

మీరు చదవాల్సింది. చరిత్రలో జరిగిన సంఘటనల వెనుక కారణాలేంటో పరిశీలించే పుస్తకాలు చదవండి. అప్పుడు తెలుస్తుంది మీకు ఫ్రెంచి విప్లవం అంటే ఏంటో."

"సరే, అలాగే చదువుతాను. ప్రస్తుతానికి ఫ్రెంచి విప్లవంలో మీకు నచ్చిన విషయాలేంటో కొంచెం చెప్పండి."

"అంత సులభంగా తప్పించుకోవటానికి వీల్లేదు. మీరు చదవండి. తర్వాత మనం దాని గురించి వాదులాడుకోవచ్చు," అందామె. అదేదో చాలా ఎదురుచూడదగ్గ అవకాశం అయినట్లు.

"సరే, చదువుతాన్లెండి. కనీసం ఈ విప్లవంలో మనం తెలుసుకోవాల్సిన విషయాలేంటో చెప్పొచ్చుగా మీరు."

"చెప్పటానికి బోలెడున్నయ్. ఆ నాలుగైదు సంవత్సరాల్లో ఫ్రాన్స్‌లో ఎన్నో విప్లవాత్మకమైన పరిణామాలొచ్చాయి. కానీ, వాటిలో ఎక్కువభాగం చాలాకాలం నిలువలేదు. అయినా, అవే మార్పులు ఈ పోయిన రెండువందల సంవత్సరాల్లో చాలా దేశాల్లో వచ్చాయి. ఇక ముందు కూడా వందల సంవత్సరాలకొద్దీ వస్తుంటాయి."

"ఎలాంటి మార్పులూ?"

"ఉదాహరణకు ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులెప్పుడూ ప్రజలవైపు ఉండరు. వాళ్ళెప్పుడూ పైవాళ్ళకే సేవలు చేస్తుంటారు. దీన్ని మార్చటానికి పారిస్‌లో, ఇతర నగరాల్లో, ప్రత్యక్ష ప్రజాస్వామ్యాన్ని నడిపారు. మత నిర్మూలన చేశారు. రొట్టె, తిండి వస్తువుల ధరల మీద కంట్రోలు పెట్టారు. స్వేచ్ఛ, సమానత్వం కావాలన్నారు. స్త్రీలకు స్వాతంత్రం ఉండాలన్నారు. ధనికులూ, రాజవంశస్తులూ కూడా శిస్తులు కట్టాలన్నారు. ఏంటీ? ఇక చాలా? మీకు బోర్ కొట్టేస్తున్నాను కదూ?"

"భలేవారే! లేదు, చెప్పండి. ఇంకా ఏం జరిగింది అప్పుడు?"

"ఇంకానా, రాజుని చంపేసి రాజరికాన్ని మాపేశారు. జమీందారీనీ, బానిసత్వాన్నీ అంతం చేశారు. మామూలు ప్రజలకు మ్యూజియాల్లో, లైబ్రరీల్లో ప్రవేశం ఏర్పరిచారు. మీకు తెలుసో లేదో ఇప్పుడు ప్రపంచం అంతటా వాడుకలో ఉన్న మెట్రిక్ కొలతలను ఫ్రెంచి విప్లవంలోనే ప్రవేశపెట్టారు."

"ప్రపంచం అంతటా అనకండి. ఇక్కడ అమెరికాలో ఇంకా మెట్రిక్ పద్ధతి రాలేదు. మేము కూరగాయలమ్మేది ఇంకా పౌనుల్లోనే."

"నిజమే అనుకోండి. అయినా కొన్నాళ్ళలో మార్పు రాక తప్పదులెండి."

"అవున్లెండి. మొత్తానికి ఇవన్నీ చెప్తుంటే నాకు ఆశ్చర్యంగా ఉంది. నేను చదివిన పుస్తకాల్లో ఆ రాజుని చంపిన విషయం ఉందనుకోండి. ఒక రాణి గురించి కూడా ఉంది. బ్రెడ్ కావాలని అడుగుతున్న వారిని చూసి ఆమె బ్రెడ్ దొరక్కపోతే కేక్ తినండి అందట. ఇవన్నీ చదివానుగాని మీరు చెప్పి విషయాలు చదివినట్లు గుర్తు లేదు."

"చెప్పానుగదా. మీరు చెత్త పుస్తకాలు చదివి వుంటారని."

"నిజంగా చెత్తపుస్తకాలు లాగానే ఉన్నయ్. పోనీలెండి. ఈసారి మంచి పుస్తకమేదన్నా దొరుకుతుందేమో చూస్తాను. తర్వాత మనం మళ్ళా మాట్లాడుకుందాం. ప్రస్తుతానికి మీకొక రిక్వెస్టు."

"ఏంటి? చెప్పండి."



"మీకు ఆకలి అవుతుంటే, నా వంట ఎలా ఉందో టేస్ట్ చెయ్యొచ్చు."

"అలాగా! సరే, ఆకలి అవుతూనే వుంది," అని డైనింగ్ టేబుల్ దగ్గరకొచ్చి కూర్చుంది సంధ్య. నేను వడ్డించాను.

ముఖమాటానికి అన్నదో, లేక నిజంగా ఆమెకు నా వంట నచ్చిందోగాని, "ఫరవాలేదే, మీకు నిజంగా వంట వచ్చు. మీరు పెళ్ళి చేసుకుంటే బాగుండేది. ఒక్క అమ్మాయైనా సుఖపడేది," అంది.

ఆమె మాటల్లో నిజమెంతో, హాస్యమెంతో అర్థం చేసుకోవటం నావల్ల కాకపోయినా, ఈ మాటలు మాత్రం నిజంగా, హృదయపూర్వకంగా అందనిపించింది.

"మనం పెళ్ళి చేసుకోగూడదూ," అన్నాను ధైర్యంగా.

"ఎందుకూ?" అందామె సూటిగా చూస్తూ, నిజంగానే.

"ఎందుకేముందీ, అందరూ ఎందుకు చేసుకుంటున్నారో, అందుకే."

"ఒకసారి అలాగే చేసుకున్నాను. ఈసారి చేసుకుంటే మాత్రం దానికేదైనా బలమైన కారణం ఉండాలని నా ఉద్దేశం. మీరెందుకన్నారు పెళ్ళి చేసుకుందామని?"

"నేను కారణం గురించి ఆలోచించలేదు. మీరంటే ఎందుకో నాకు చాలా గౌరవం. అందుకే అన్నాను."

"థాంక్స్. మీరు చాలా మంచివారు."

"నాకు ముప్పై రెండు సంవత్సరాలొస్తున్నాయి. ఈమధ్య ఉద్యోగం పోయినప్పుడు మనసు బాగాలేక, ఎవరైనా తోడుంటే ఎంత బాగుండేది అనిపించింది."

"తోడు ఎంత అందమైన మాటో కదూ?"

"అవును. మీకు తోడు కావాలని అనిపించదా? పిల్లలు కావాలని లేదా?"

"ఓహో! అదా సంగతి! మీకు పిల్లలు కావాలన్నమాట. ఎందుకూ?"

"ఎందుకేముందీ? పెంచటానికి."

"మీకు పిల్లల్ని పెంచటం చాలా ఇష్టం అన్నమాట. లేక పుట్టించటం ఇష్టమా?" అంది ఆమె కంటి చివర్ల నుంచి కొంటెగా చూస్తూ.

"మీరింత వల్గర్‌గా మాట్లాడగలరని నేనెప్పుడూ అనుకోలేదండీ."

"అయామ్ సారీ. క్షమించండి. మీకు పిల్లల్ని పెంచటమే ఇష్టం. పెంచీ?"

"పెంచీ, అంటే?"

"పిల్లల్ని పెంచటం ఎందుకూ అని అడుగుతున్నాను."

"ఎందుకేముందీ, పెద్దవాళ్ళను చెయ్యటానికి."

"చేసీ?"

"చేసి, చదువు చెప్పించటానికి."

"ఎందుకూ చదువు?"

"మీరు ఇలా ఎందుకు వాదిస్తున్నారో అర్థం కావటంలేదు. సరే, కానివ్వండి. చదువు ఎందుకూ అని అడుగుతున్నారు. మంచి ఉద్యోగం రావటానికి."

"అంటే మంచి కంపెనీవాళ్ళు ఉంచుకోవటానికి. అంతేగా?"

"సరే. అలాగే అనుకోండి."

"అంటే జీవితానికి ముఖ్యమైన ఆదర్శం ఉద్యోగం అంటారు. అదేకదా మీరనేది?"

"మరి ఉద్యోగం చెయ్యకపోతే బ్రతికేదెలా?"

"మీరేం అనుకోకపోతే మిమ్మల్నో ప్రశ్న అడుగుతాను."

"అడగండి."

"మీ తాతగారు ఉద్యోగం చేశారా?"

"మా తాతా? ఆయన హయాంలో మావాళ్ళు పల్లెటూళ్ళో ఉండేవాళ్ళు. మా తాత ఎవడిదగ్గరా పని చెయ్యలేదు. ఆయన స్వతంత్రంగా బతికాడు."

"మరి ఉద్యోగం లేకపోతే బ్రతకటమెట్లా అన్నారుగా! ఆయనెట్లా బ్రతికారు?"

"అదెప్పటి విషయమో గదా. ఆయన వ్యవసాయం చేసి బ్రతికాడు."

"మరి మీరు వ్యవసాయం ఎందుకు చెయ్యలేదు?"

"ఈరోజుల్లో ఆ రెండు ఎకరాల్లో వ్యవసాయం చేసి బ్రతకటం కష్టం."

"ఎందువల్ల?"

"ఎందువల్లేముందీ? ఇప్పుడు చాలా డెవలప్‌మెంట్ వచ్చింది కదా."

"అంటే, డెవలప్‌మెంట్ లేనప్పుడు మనుషులు స్వతంత్రంగా బ్రతగ్గలరు. డెవలప్‌మెంట్ వచ్చిందంటే ఎవడి దగ్గరన్నా ఉద్యోగం చెయ్యకపోతే బ్రతకలేని పరిస్థితి వస్తుంది. అదేకదా మీరంటున్నది?"

"ఏమోనండీ. మీ ప్రశ్నకు జవాబు చెబితే ఏదో చిక్కులో పడతానని భయంగా వుంది!"

"లేదులెండి. మీరన్నదాంట్లో నిజం ఉంది. పూర్వం కూడా లేనివాళ్ళు ఉన్నవాళ్ళ దగ్గర ఉద్యోగాలు చేసేవాళ్ళే. కానీ, మీరన్నట్లు మనం అభివృద్ధి అంటామే, అది పెరిగేకొద్దీ, జనంలో ఎక్కువ భాగం ఉద్యోగులవుతారు. వీళ్ళలో కొందరికి జీతాలెక్కువ, కొందరికి తక్కువ. కాని అందరూ ఉద్యోగులే. ఉంచుకున్నవాళ్ళే. ఇంకోరకంగా చెప్పాలంటే అభివృద్ధి దీపానికి చమురులాంటివాళ్ళు."

"నేనెప్పుడూ ఇలా ఆలోచించలేదండీ. మీరు ఇట్లా ఆలోచించటానికి కారణం మీ ఎకనామిక్స్ బాక్‌గ్రౌండా? లేక దీనిక్కూడా ఫ్రెంచి విప్లవంతో ఏదైనా సంబంధం వుందా?"

"ఏమో, ఉందో లేదో ఫ్రెంచి విప్లవం గురించి ఒక మంచి పుస్తకం చదివితే మీకే తెలుస్తుంది. ఇది మీకు హోంవర్క్."

నేను డైనింగ్ టేబుల్ దగ్గర నుంచి లేచి ఆమె గ్లాసులో మరికొంచెం వైన్ పోశాను. ఆమె వద్దు అనలేదు.

నాకు మళ్ళా పెళ్లి విషయం గురించి అడగటానికి మనసొప్పలేదు. కానీ, ఇలాగే కలుస్తూ ఉంటే, కొన్నాళ్ళలో ఆమెను ఒప్పించగలననే నమ్మకం కలిగింది నాకు.

*ఆదివారం ఆంధ్రజ్యోతి, ఏప్రిల్ 2003*



# రెండు వారాల సెలవు

**చి**కాగో మార్చి 10, 1997.

ప్రియమైన నాన్నగారికి నమస్కరించి వ్రాయునది.

నాన్నా, నేను చికాగో వచ్చినప్పటి నుండి మీకు కనీసం నెలకొకసారైనా ఉత్తరం వ్రాస్తూనే ఉన్నాను. కాని మీకు బాధ కలిగించటం ఇష్టంలేక కొన్ని విషయాలు చెప్పలేదు. ఎంతో దూరాన ఉన్నారు. నాకు సహాయం చెయ్యలేకపోతున్నందుకు ఎంతగానో విచారిస్తారని తెలిసే అలా చేశాను. కాని నా ఇబ్బందులిప్పుడు తొలగిపోయాయి. నేను సుఖంగా ఉంటున్నాను. జరిగిన విషయాల గురించి వివరంగా చెప్పాలని ఈ ఉత్తరం రాస్తున్నాను.



మూడు సంవత్సరాల క్రితం నేను ఇక్కడకు చేరినప్పుడు నా అదృష్టానికి నేనెంతో సంబరపడిపోయాను. ఉత్తరాల్లో నేను వ్రాసిన విషయాల్లో ఏమీ పొల్లులేదు. శ్రీనాథ్‌గారిది మంచి ఉద్యోగం. చికాగోలో పెద్ద ఇల్లు. ఎక్కడకు పోయినా కారులో ప్రయాణం. తెలుగు అసోసియేషన్‌కు ఆయన సెక్రెటరీ. చాలామందితో స్నేహం. పార్టీలు, పిక్నిక్కులు. మన ఊరిలో కంటే పదిరెట్లు ఎక్కువగా కర్ణాటక సంగీత కచేరీలు, కూచిపూడి నృత్యాలు. శని, ఆదివారాలు ఎంతో తొందరగా గడిచిపోతుండేవి. నా జీవితం ఎంతో సుఖంగా ఉండేది. ఒక్క సంవత్సరంలో ఈ జీవితానికి అలవాటుపడ్డాను. కాని ఇంత సంపద, సుఖంలోనూ ఏదో లోటు కన్పించటం మొదలయింది. ఇంటిపక్కల కలవటానికి, మాట్లాడ్డానికి తెలుగువాళ్ళెవరూ లేరు. తెలుగువారే కాకపోయినా, అసలు పగలంతా ఆ వీధిలో ఎవ్వరూ ఇంటి దగ్గర ఉండేవారు కాదు. రోజంతా ఇంట్లోనే ఉండాలంటే నాకు కష్టం అనిపించింది. రోజంతా పనిచేసి ఇంటికి చేరే శ్రీనాథ్‌గారికి సాయంత్రం బయటకు వెళ్ళాలనిపించేది కాదు. శనివారం, ఆదివారం తప్ప ఎవ్వరితోనూ కలిసే అవకాశం ఉండేది కాదు నాకు. ఎవరింటికైనా వెళ్ళి వద్దాం అంటే తెలిసిన వాళ్ళందరూ పది ఇరవై మైళ్ళ దూరంలో ఉండేవారు. కారు లేకుండా ఎక్కడకూ వెళ్ళటం వీలుకాదు. పబ్లిక్ ట్రాన్సుపోర్టేషన్ మంచిదికాదు అనేవారు శ్రీనాథ్‌గారు.

ఏదైనా చిన్న ఉద్యోగం చేద్దామనిపించి శ్రీనాథ్‌గారిని అడిగాను.

'తెలుగులో ఎం.ఏ. చదివిందానికి ఏం ఉద్యోగం వస్తుంది?' అన్నారాయాన.

నిజమే! నా ఇంగ్లీషు కూడా అంతంత మాత్రమే. ఉద్యోగం రావటం కష్టమే.

'అయినా నీకు ఉద్యోగం చెయ్యవలసిన ఖర్మ ఏం పట్టింది?' అన్నారు. ఆయన ఉద్యోగం మంచిది. నాకు ఉద్యోగం చెయ్యవలసిన అవసరం లేదు. అయినా ఎప్పుడూ ఇంట్లో ఉండటం కంటే ఏదో ఒక పని చెయ్యాలనిపించింది.

ఉద్యోగం రాకపోతే కనీసం ఏదైనా చదువుకుందాం అనుకున్నాను. ఈ దేశంలో వయసుతో ఇబ్బంది లేకుండా ఏం చదవాలనుకున్నా చదువుకోవచ్చు. పెద్ద కాలేజీలకు పోవటానికి స్తోమత లేనివారు కమ్యూనిటీ కాలేజీలలో చేరవచ్చు. మా ఇంటికి దాదాపు అరమైలు దూరంలో అలాంటి కాలేజీ ఒకటి ఉంది. అక్కడ ఏదైనా కోర్సులో చేరదామనుకున్నాను. కాని, నాకు ఇలా చెయ్యాలనే కోరిక బలమయ్యేకొద్దీ శ్రీనాథ్‌గారికి నామీద విముఖత్వం పెరుగుతూ వచ్చింది. ఉద్యోగం సంపాదించుకోవటానికే ఈ చదువుకోవాలనే కోరిక అని ఆయన నమ్మకం.

'ఉద్యోగం చేసే భార్య కావాలనుకుంటే ఏ డాక్టర్నో, కంప్యూటర్ ఇంజినీర్‌నో చేసుకోకపోయానా, తెలుగు ఎం.ఏ.ని చేసుకోవటం ఎందుకూ?' అన్నారు. 'రెండు వారాల కంటే ఎక్కువ సెలవు దొరకలేదు. లేకపోతే మరో మంచి సంబంధం చూసుకోవటానికి వీలుండేది,' అని వాపోయారు.

నువ్వెప్పుడూ 'ఆత్మగౌరవం అన్నిటికంటే గొప్ప సంపద' అంటుండేవాడివి. 'నీ కాళ్ళ మీద నువ్వు బ్రతకగలగాలని నా ఆశ' అని చెప్పేవాడివి. తెలుగు ఎం.ఏ. చదివించావు. మనదేశంలో అయితే ఏదో ఉద్యోగం దొరికేది. నీ కోరికా, నా కోరికా రెండూ తీరేవి. కానీ సంపన్నుడనీ, అమెరికాలో మంచి ఉద్యోగం ఉన్నవాడనీ, కట్నం అడగటంలేదనీ శ్రీనాథ్‌కిచ్చి పెళ్ళి చేశావు. ఇక్కడ నా చదువు ఎందుకూ పనికిరావటం లేదు. నీ మీద నాకు అప్పుడప్పుడూ కోపం వస్తుండేది. పెదనాన్నగారి అమ్మాయిలిద్దరూ







ఏ ఇబ్బందీ లేకుండా కాపురాలు చేస్తున్నారు. వాళ్ళకు చదువులూ లేవు, ఇబ్బందులూ లేవు. ఎక్కడకు పోయినా నన్ను వెంటబెట్టుకొని పోయేవాడివి. లేనిపోని ఆలోచనలు నాకు అంటగట్టావని అనుకునేదాన్ని.

చాలా వాదోవాదాల తర్వాత నేను కమ్యూనిటీ కాలేజీలో చేరటానికి ఆయన ఒప్పుకున్నారు. కంప్యూటర్‌లతో పని చెయ్యటం నేర్పే కోర్సులో చేరాను. వర్డ్ ప్రాసెసింగ్ నేర్పారు. మొదటి కోర్సు పూర్తి అవుతుండగానే మా కాలేజీ లైబ్రరీలో స్టాక్ అటెండెంట్ ఉద్యోగం ప్రకటించారు. చాలా చిన్న ఉద్యోగం. లైబ్రరీలో పుస్తకాలు చదివి బల్లల మీద వదలేసిపోతారు. వాటిని మళ్ళా సరైనచోట పెట్టటమే ఆ ఉద్యోగంలో బాధ్యత. కాలేజీలో ఉద్యోగం చేసేవాళ్ళు అక్కడే ఉచితంగా ఏ కోర్సులైనా తీసుకోవచ్చని చెప్పారు. శ్రీనాథ్‌గారికి చెప్పకుండానే ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టాను. చెప్తే ఒప్పుకోరని నాకు తెలుసు. అక్కడే చదువుకుంటున్నదాన్ని గదా అని ఆ ఉద్యోగం నాకే ఇచ్చారు.

ఉద్యోగంలో చేరినరోజే శ్రీనాథ్‌గారితో చెప్పాను.

'ఉద్యోగం చేయాల్సిన ఖర్మ ఏం పట్టింది. ఊరికే తోచటంలేదంటే కాలేజీలో చేరటానికి ఒప్పుకున్నాను,' అన్నారాయన.

నిజమే... నా ఉద్యోగానికి సంవత్సరానికి 15,000 డాలర్ల జీతం. ఆయన జీతంలో ఆరోవంతు.

కానీ నా ఉద్యోగం నిలబెట్టుకోవాలనే కోరిక నాలో బలంగా ఉంది.

ఆయనకు మరో మార్గం తోచలేదు. చాలా గొడవ పడింతర్వాత నీ ఖర్మ అన్నారు.

నేను ఉద్యోగంలో చేరి దాదాపు పది నెల్లవుతోంది.

అనుకోకుండా మా జీవితాల్లో మరో మార్పు వచ్చింది. శ్రీనాథ్‌గారి కంపెనీని మరో పెద్ద కంపెనీ కొనివేసింది. చాలామందిని ఉద్యోగాల్లోంచి తీసివేశారు. శ్రీనాథ్‌గారినీ, మరికొందరినీ క్లీవ్‌లాండ్ అనే మరో ఊరిలో అదే ఉద్యోగంలో పని చేయగలరా? ఇక్కడే ఉండటానికి ఇష్టపడతారా? అని అడిగారు. అక్కడకు వెళ్ళడం అంటే ప్రమోషన్ కాదుగానీ, కొద్దిగా జీతం, సౌకర్యాలు పెరుగుతాయి. వెళ్ళటం తప్పనిసరికాదు. అయినా శ్రీనాథ్‌గారు వెళ్తానన్నారు. ఆ పరిస్థితుల్లో నాకేం చెయ్యాలో అర్థం కాలేదు. మంచి చదువు ఉన్నదాన్ని కాదు. మళ్ళీ ఇంకొక ఊరికి పోతే అక్కడ నాకు ఈ చదువు, ఈ ఉద్యోగం లభించడం అంత సులభం కాదు. ఇక్కడేదో అదృష్టం కలిసి వచ్చి రెండూ లభించాయి. కారు లేకపోయినా అరమైలు దూరమే గాబట్టి ఎలాగో ఇబ్బంది పడుతున్నాను. కానీ క్లీవ్‌లాండ్‌లో నాలాంటివాళ్ళకు ఏమి అవకాశాలుంటాయో తెలియదాయె.

నా సంకోచాల గురించి ఆయనకు చెప్పాను. ఆయనకు చాలా కోపం వచ్చింది. చాలా మాటలన్నారు. నా జీవితమే నాకు ముఖ్యమైనట్లు ప్రవర్తిస్తున్నాననీ, అలాంటిదాన్ని ఇండియాలోనే ఉండిపోవాల్సిందనీ అన్నారు. తనతో క్లీవ్‌లాండ్ రాకపోతే విడాకులిస్తానన్నారు.

ఏం చెయ్యాలో తోచలేదు నాకు. ఉద్యోగంలో చేరి అప్పటికి రెండు నెల్లయింది. మొదటి కోర్సు పూర్తయి ఇంకో కోర్సులో చేరాను. చదువుకోటానికి ఏ ఖర్చూ లేదు. నా చిన్న ఉనికిని వదులుకోవటం కష్టం అనిపించింది. ఏం చెయ్యాలో తెలియక ఒక్క సంవత్సరం ఆగండి, తర్వాత క్లీవ్‌లాండ్ వెళ్దాం అని చెప్పాను.





ఆయన రెచ్చిపోయారు. ఇల్లు అమ్మివేస్తాననీ, నేనీ ఊళ్ళోనే ఉండదల్చుకొంటే నా దోవ నాదే ననీ, ఎక్కడ ఉంటావో నీ యిష్టం అనీ అన్నారు.

నేను పనిచేసే కమ్యూనిటీ కాలేజీలో నాతో చదువుకుంటున్న బెంగాలీ అమ్మాయి ఒకామె ఉంది. పేరు కిరణ్మయి. వాళ్ళ ఇల్లు పెద్దదనీ, నేను వాళ్ళింట్లో ఒక గదిలో అద్దెకు ఉండవచ్చనీ చెప్పింది. వాళ్ళ ఇల్లు గూడా కమ్యూనిటీ కాలేజీకి దగ్గరే. కిరణ్మయి నాకు బాగా తెలిసిన మనిషి. అందువల్ల, మరో మార్గంలేక ఒప్పుకున్నాను. శ్రీనాథ్‌గారు క్లీవ్‌లాండ్ పోయిన రోజే నేను కిరణ్మయిగారింట్లో చేరాను. మా ఇంటిని శ్రీనాథ్‌గారు అమ్మకానికి పెట్టారు.

ఆయన వెంట క్లీవ్‌లాండ్‌కు పోనందుకు నామీద నాకే ఎంతో అసహ్యం అనిపించింది. ఆయన్ను ప్రతిరోజూ టెలిఫోన్‌లో పిలిచి మాట్లాడేదాన్ని.

తను చాలా ఇబ్బంది పడుతున్నాననీ, ప్రతిరోజూ హోటల్లో తినటం కష్టంగా ఉందనీ, నేను వెంటనే వస్తే మంచిదనీ అన్నారాయన. పదిరోజుల్లో ఏదో నిర్ణయానికి రమ్మనీ, క్లీవ్‌లాండ్ రాకపోతే నిజంగా విడాకులిస్తాననీ అన్నారు.

రెండు వారాల్లో ఆయన ధోరణి చాలా కఠినంగా మారింది. వెంటనే క్లీవ్‌లాండ్ వస్తే సరి, లేకపోతే నా కాలేజీ అధికారులకు ఉత్తరం రాస్తాననీ, విడాకులిచ్చే ప్రస్తావనే లేదనీ, చికాగో వచ్చి నన్ను చంపేస్తాననీ టెలిఫోన్‌లో రకరకాలుగా భయపెట్టారు.

అసలు ఆయన అలా మాట్లాడగలరని కూడా ఎప్పుడూ ఊహించని నేను కిరణ్మయికి ఈ విషయం చెప్పాను.

ఎందుకయినా మంచిదని పోలీసులకు ఈ విషయం చెప్పు అంది.

పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి ఆఫీసరుతో చెప్పాను.

'కేసు రాసుకోమంటావా?' అన్నారాయన.

ఆయన మీద కేసు పెట్టడానికి నాకు మనసొప్పలేదు. ఏదో కోపంలో అని ఉంటాడని చెప్పాను.

'నీ యిష్టం,' అన్నాడాయన.

వారంరోజుల తర్వాత లైబ్రరీ మేనేజర్ రాబర్ట్ తన ఆఫీసుకి పిలిచాడు.

శ్రీనాథ్‌గారు ఉత్తరం వ్రాశారట. నా గురించి ఏమేమో నీచమైన విషయాలు రాశారట. నా పరిస్థితికి తనెంతో విచారిస్తున్నాననీ, ఏదైనా సహాయం కావలిస్తే అడగమనీ అన్నాడు రాబర్ట్. ఆయన మాటలు నాకెంతో బలాన్నిచ్చాయి.

శ్రీనాథ్‌గారు దాదాపు ప్రతిరోజూ ఫోన్‌లో పిలిచి బెదిరించటం మొదలుపెట్టారు. నేను లేకపోతే కిరణ్మయినిగాని, ఆమె తల్లిదండ్రులనుగాని నానా మాటలు అనేవారు. ఇంట్లోంచి నన్ను బయటకు నెట్టేస్తే సరి, లేకపోతే తన వివాహం నాశనం కావటానికి మీరే కారణం అవుతారని బెదిరించాడు.

పోలీసులకు అన్ని విషయాలు చెప్పటం మంచిదనిపించింది. కిరణ్మయి వాళ్ళమ్మకు ఉష అనే ఆవిడ తెలుసు. ఆమె తెలుగావిడే. కుటుంబాల్లో హింసలకు గురి అవుతున్న భారతీయ మహిళలకు సహాయం చెయ్యటానికి ఆమె ఒక సంస్థ ఏర్పాటు చేసిందట. ఒకరోజు కిరణ్మయీ, నేనూ, ఆమెను చూట్టానికి వెళ్ళాం.

ఆమె నన్నెంతో ఆదరంగా చూసింది. చాలాకాలంగా పరిచయం ఉన్న స్నేహితురాలిలాగా మాట్లాడింది. 'నువ్వు ఏం చెయ్యదల్చుకున్నావో చెప్తే నీకు వీలైనంత సహాయం చేస్తా'నంది.



అన్నిటికంటే ముఖ్యమయింది భద్రత అనీ, ఆయనవల్ల నాకు ఎలాంటి హానీ జరగకుండా చూసే విధానం ఏదైనా ఉందా అని అడిగాను.

పూర్తి భద్రత ఎవ్వరూ కలుగజేయలేరనీ, కానీ పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి భద్రతా ఉత్తరువు తెచ్చుకోవచ్చనీ అన్నారు ఉషగారు. భద్రతా ఉత్తర్వు అంటే నా నుంచి దూరంగా ఉండమని ఆయనకు పోలీసు అధికారులిచ్చే నోటీసు. నాతోపాటు పోలీస్‌స్టేషన్‌కు వచ్చి అండగా నిలబడ్డారు ఉషగారు.

ఈ గండం గడిచిందనుకొంటుండగానే రెండువారాల్లో కోర్టు నుంచి నోటీసు వచ్చింది. శ్రీనాథ్‌గారు విడాకులు కావాలని కేసు పెట్టారు. అంతేకాదు. నేను అమెరికా రావటానికి పెళ్ళిని ఒక మార్గంగా ఉపయోగించానని ఆరోపిస్తూ నన్ను ఈ దేశం నుంచి బహిష్కరించాల్సిందిగా అధికారులను కోరారు.

విడాకులంటే భయంలేదుగానీ, నా మీద మోపిన అపవాదుకు నాకెంతో కోపం వచ్చింది. రెండు వారాల సెలవు మీద ఇండియా వచ్చి, అయిదుగురు ఆడపిల్లలను చూసి, అందులో నన్ను ఎన్నుకొని, రెండు రోజుల్లో ముహూర్తం పెట్టించుకుని, పెళ్ళి అయిన నాలుగోనాడే తిరిగి వెళ్ళిపోయిన మనిషి, అమెరికా రావటానికే పెళ్ళి చేసుకున్నానని నా మీద కేసు పెట్టడం ఎంతో అన్యాయం అనిపించింది.

ఎంత ఏడ్చానో!

ఒకవేళ నిజంగా కోర్టువారు ఆయనవైపే తిరిగితే, నన్ను ఇండియాకు పంపించివేస్తే, మీరు అవమానంతో కుంగిపోతారని నాకు భయం వేసింది.

ఉషగారింటికి వెళ్ళి ఆమెతో అన్ని విషయాలు చెప్పాను. ఇలాంటివి ఆమెకు కొత్త కాదులా ఉంది. చాలామంది భర్తలు ఇలాగే కేసులు పెట్టారనీ, ఏమీ భయపడవద్దనీ చెప్పింది. మరుసటిరోజు సాయంత్రం ఒక లాయరుగారి ఆఫీసుకు వెళ్ళాం. ఆమె ఒక చైనా మహిళ. పేరు మైచింగ్. ఉషకు మంచి స్నేహితురాలట. నా కేసు తనే వాదిస్తానని నాకూ ఉషకు మాటిచ్చింది. ఆమెకు ఇవ్వటానికి నా దగ్గర ఏమీ డబ్బు లేదు. నేను సంపాదించి తర్వాత తన బాకీ తీర్చుకుంటానని చెప్పాను. ఏమీ విచారించవద్దనీ, తన సంస్థ లాయరు ఫీజు చెల్లిస్తుందనీ చెప్పింది ఉష. నాకు లేని పెద్ద అక్కలాగా కన్పించిందామె నాకు. పోయిన నాలుగు నెలల్లో రెండుసార్లు కోర్టుకు వెళ్ళాను. రెండుసార్లూ ఉష నాతో వచ్చింది. గ్రీన్‌కార్డు కోసం తనను పెండ్లి చేసుకున్నానన్న శ్రీనాథ్‌గారి ఆరోపణలో ఏమాత్రం నిజం లేదని ఉష నా తరపున సాక్ష్యం చెప్పింది. శ్రీనాథ్ నన్ను చంపుతానని భయపెట్టడం, నేను పోలీసుల రక్షణ కోరటం జరిగిందని ఉష జడ్జితో చెప్పింది.

చివరకు జడ్జి మా వివాహం రద్దు చెయ్యటానికి ఒప్పుకున్నాడు.

ఇప్పుడు నేను కిరణ్మయిగారింట్లోనే ఉంటున్నాను. కమ్యూనిటీ కాలేజీలోనే పని చేస్తున్నాను. రెండు మూడు సంవత్సరాలు ఇక్కడ పనిచేసి, కొంత డబ్బు వెనకేసుకొని లా చదవాలని నా కోరిక. నీలాగే నేను కూడా లాయర్నవుతాను నాన్నా!

పెళ్ళి చేసి అమెరికా పంపించారు మీరు. నేను సుఖంగా ఉండి చక్కగా కాపురం చేస్తుంటే మీకు మనశ్శాంతిగా ఉండేది. నాకు జీవితం అంతా నాలుగ్గోడల మధ్య గడపటం ఇష్టం కాలేదు. కాపురం లేకపోయినా నేను శాంతంగా, సుఖంగా ఉంటున్నాను.

ఈ కవరు మీద ఉన్నది నా కొత్త అడ్రసు. ఇక ముందు ఉత్తరాలు ఈ అడ్రసుకే వ్రాయండి. అమ్మను అడిగానని చెప్పు. నా గురించి మీరిద్దరూ విచారించవద్దని నా ప్రార్థన.

ప్రేమతో
సుమతి

నెల్లూరు
మార్చి 26, 1997.

చిరంజీవి సుమతిని,
ఆశీర్వదించి వ్రాయునది.

నీ ఉత్తరం చదివి నేనెంతో సంతోషించాను. దాదాపు సంవత్సరంగా నీ గురించి మేము ఎంతో మథనపడుతున్నాము. మేము బాధపడతామని నీవు మా నుంచి దాచిన విషయాలు మాకు ఇదివరకే తెలిసిపోయాయి. మీ మామగారు నెల్లూరు వచ్చారు. 'మీ అమ్మాయి మావాడితో కాపురం చెయ్యటంలేదట. బుద్ధి తెచ్చుకుని జాగ్రత్తగా ప్రవర్తిస్తే సరే, లేకపోతే విడాకులిప్పించి మావాడికి మరో సంబంధం చూసుకుంటాం. మీ కూతురుకు బుద్ధి చెప్పుకోండి,' అని చెప్పటానికి వచ్చాడు.

ఆయన వెళ్ళిపోయిం తర్వాత మీ నాన్నా నేను చాలారోజులు ఈ విషయం గురించి మాట్లాడుకున్నాం. 'నా కూతురు ఎలాంటి తప్పు చెయ్యదు. ఏదో కారణం లేనిదే ఇలా చెయ్యదు సుమతి! అయినా ఇంత దూరాన ఉండి నీ జీవితం ఇలా నడుపుకో, అలా నడుపుకో అని దానికి మనం చెప్పటం ఏమీ సమంజసం కాదు,' అన్నారు నాన్న. ఈ విషయాలన్నటి గురించి నీవే వ్రాసేదాకా మేం ఏమీ అడగవద్దని నిర్ణయించుకున్నాం.

నీ ఉత్తరం నాకెంతో సంతోషం కలిగించింది. అన్నిటికంటే ముఖ్యం నీ సుఖం. నువ్వు మనశ్శాంతితో సుఖంగా ఉంటే అంతకంటే మాక్కావల్సిందేముంది. మీ నాన్న కూడా చాలా సంతోషిస్తారు, ఈ విషయాలు తెలుసుకున్న తర్వాత. ఆయన నిన్ననే హైదరాబాదు వెళ్ళారు. ఇంకా ఆ పార్టీ పిచ్చి వదల్లేదు. ఏదో మానవహక్కులు అంటూ అప్పుడప్పుడూ హైదరాబాదు వెళ్ళి వస్తుంటారు. నీకు వెంటనే ఉత్తరం వ్రాయాలనిపించి వ్రాస్తున్నాను. నాన్న కూడా రాగానే ఉత్తరం రాస్తారు.

నీకు ఉష, కిరణ్మయిల వంటి స్నేహితులు దొరకటం ఎంత అదృష్టం! వాళ్ళకు నా కృతజ్ఞతలు తెలియజెయ్యి. ఎప్పుడైనా ఇండియా వస్తే, మన ఊరు వచ్చి మన ఇంట్లో భోజనం చేసి తీరాలని కోరానని చెప్పు.

జరిగిపోయిన విషయాల గురించి ఎప్పుడూ మనసు పాడు చేసుకోకు. వారానికొకసారైనా ఉత్తరం వ్రాస్తుండు.

ఉంటాను.

ప్రేమతో
అమ్మ.

*విపుల, జులై 1997*



# మీకు మీరే

**నా**లుగు వేడివేడి ఇడ్లీలు ఆరగించి, ఇంటి ముందు వరండాలో సుఖంగా మడతకుర్చీలో చేరాడు ధర్మారావు. దాదాపు తొమ్మిదిన్నర అవు తుంది. ఇంటి ముందూ, వీధిలో అంతా ప్రశాంతంగా ఉంది. ఆకాశంలో చిన్నచిన్న తెల్లటి మేఘాలు పెళ్ళికి పోతున్నట్లు నిదానంగా ప్రయాణం చేస్తున్నాయి. ఒక చిన్న మేఘం, అచ్చం ఆనంద్‌లాగానే ఉంది, బుల్లి చేత్తో తాతయ్యా, రా అని పిలుస్తున్నట్లు కన్పించింది.



"అమ్మాయ్ కవితా," పిల్చాడు, ధర్మారావు.

"కాఫీ తెస్తున్నా, నాన్నా," అని జవాబొచ్చింది ఇంట్లోంచి.

"అది కాదమ్మా, పిల్లవాడు ఆనంద్ ఇంకా నిద్ర లేవలేదా?"

"ఇంకా లేవకపోవటమేమిటీ! వాడు ఏడుగంటలకే పక్కింటి అబ్బాయితో ఆడుకోవటానికి పోయాడు," అంటూ కాఫీ తీసుకొచ్చింది కవిత.

"అలాగా, వాడి మాటలు వినపడకపోతేను."

"వస్తాళ్ళే," అని కాఫీ కప్పు అందించి లోపలికి వెళ్ళిపోయింది ఆమె.

కుర్చీ పక్కన ఉన్న టేబుల్ మీద నుంచి నోట్‌బుక్కూ, కలమూ తీసుకున్నాడు ధర్మారావు. శ్రీరామ అని మొదట రాశాడు. తర్వాత కొంతసేపు కలం కాగితానికి దగ్గిరగా ఉంచాడేగాని ఏమి రాయలేదు. కథ అంతా తల్లో ఉంది. పాత్రలు డ్రెస్ చేసుకొని రెడీగా ఉన్నాయి. వాటిని కాగితం మీదికి దించటమే ఆలస్యం. కవిత ఇరవై ఆరేళ్ళ యువతి. ఆమెకు మంచి ఉద్యోగంలో ఉన్న భర్తా, ఆరు సంవత్సరాల కొడుకూ ఉన్నారు. భర్త పేరు రమేష్. రమేష్ కళ్ళ ముందు కన్పించాడు. అతడు అల్లుడుగా దొరకటం తన అదృష్టం. నిదానమైన మనిషి. ఎలాంటి చెడు అలవాట్లు లేనివాడు. కాని కథలో ఇలా అసలు పేర్లు కాకుండా మారు పేర్లు వాడితే బాగుంటుందేమో? లేకపోతే పత్రికలో ఈ కథ చదివిన వాళ్ళు ఏంటండీ మీ అమ్మాయి మీదే కథ రాశారు అంటారు.

కలం కింది పెదవి మీద దొర్లిస్తూ ఆకాశంవైపు దృష్టి మళ్ళించాడు ధర్మారావు. అమ్మాయికి సునీత అని పేరు పెడితే బాగుంటుంది. రమేష్ పేరు సురేష్‌గా మార్చవచ్చు.

ఎదురింటి ముందు తోటలో కొబ్బరిచెట్ల ఆకులు గాలికి ఊగుతూ ఎంతో అందంగా కన్పించాయి. వాళ్ళ తోటలో చాలా చెట్లున్నాయి. తన ఇంటి ముందు అంత చోటూ లేదు, ఉన్న నాలుగు చెట్లూ అంతగా పెరగనూ లేదు.

"అమ్మాయ్ కవితా!"

"వస్తున్నా, నాన్నా."

"మల్లెచెట్లకు ఈరోజు నీళ్ళు పోసినట్లు లేదు, ఆ ఎంకమ్మ రాలేదా ఇంకా?"

"నాకు తెలియదు నాన్నా, అమ్మ నడుగుతాను."

కాగితం మీదకి మళ్ళా దృష్టి మళ్ళించాడు ధర్మారావు. సునీత భర్త మంచి ఉద్యోగంలో ఉన్నాడు. ఆమేమో ఇల్లు చూసుకుంటూ పిల్లవాణ్ణి చదివించుకుంటూ సుఖంగా కాపురం చేస్తుంది.

ఇలాంటి కథ రాస్తే ఎవ్వరికీ నచ్చదేమో? చదివేవారికి కొందరికైనా నచ్చుతుందేమో గాని అసలు పత్రికలవాళ్ళు వేసుకుంటే గదా! వాళ్ళకు ఎప్పుడూ కష్టాలు కావాలి కథల్లో. ముఖ్య పాత్ర నానా గడ్డీ తిని, చివరకు బుద్ధి తెచ్చుకుంటేగాని కథ కాదంటారు వాళ్ళు. వెధవ పన్లు చెయ్యకుండానే బుద్ధిగా బ్రతికినవారి జీవితాలకు అర్థం లేనట్లు! మరి ఇలా రాస్తే - సునీత ఉద్యోగం చేసేది, ఒకరోజు పిల్లవాడు స్కూలు నుంచి ఇంటికి వస్తున్నప్పుడు రోడ్డు మీద చిన్న ప్రమాదం జరిగింది. దానికి భర్త



కోప్పడ్డాడు. నీ సంపాదన అవసరం లేదు, ఇంటి దగ్గరే ఉండి బిడ్డను జాగ్రత్తగా స్కూలుకు తీసుకుపోయి తీసుకొస్తూ ఉండు, చాలు అన్నాడు. అప్పటి నుంచీ సునీత సుఖంగా ఇంటి దగ్గరే ఉంటుంది. రోజంతా ఇంట్లో ఉండటం మొదట మొదట కష్టంగానే ఉండేది, కాని అలవాటయిపోయి, ఇప్పుడు సుఖంగానే ఉంటుంది. ఈ మాత్రం కష్టాలు చాలా? ఇంకా పెద్ద కష్టాలు తెచ్చిపెట్టాలా? ఉద్యోగం చేస్తున్నప్పుడు ఆమెకు ఆఫీసులో ఒకతనితో పరిచయమయ్యింది. అతనితో స్నేహం - ఛా, ఛా కథ కోసం అంత దూరం పోనవసరం లేదులే. ముఖ్యంగా ఆడవాళ్ళు ఇల్లు చూసుకుంటూ సుఖంగా ఉండటం మంచిది అని చెప్పటమే గదా ప్రధానం. దానికి ఈ ఆఫీసు లవ్వూ అవీ అనవసరం.

"ఏంటీ పిల్చారటా?" శాంతమ్మ అడిగింది వరండాలోకి వస్తూ.

"నేనా? పిల్చానా? ఆ! గుర్తొచ్చింది. అదే, మల్లెచెట్లకి నీళ్ళు పోసినట్లు లేదు, ఆ ఎంకమ్మ రాలేదా అని అడిగాను."

"అది రావటం లేదు రెండు రోజుల్నించి. పెద్ద కూతురి పెళ్ళట. చిన్న కూతుర్ని పంపుతుంది. ఆ పిల్ల ఇంకా రాలేదీ రోజు."

"పెద్ద కూతురికా పెళ్ళి? ఆ పిల్లకి ఇదివరకే పెళ్ళి అయిందిగా? దాని మొగుడు పక్కింటమ్మాయితో లేచిపోయాడన్నావుగా? ఈమధ్యే గదూ?"

"ఆ పిల్లే. ఇంకొకణ్ణి చేసుకుంటుందట," అంటూ లోపలికెళ్ళింది శాంత.

"అలాగా!"

మల్లెచెట్ల వంక చూశాడు ధర్మారావు. దాహం, దాహం అంటూ దీనంగా చూస్తున్నట్లు కన్పించాయి అవి. వీటిని కథలోకి తీసుకురావటం ఎలా అని ఆలోచించాడు ధర్మారావు. సునీతకి మల్లెపూలంటే ఇష్టం. ఉద్యోగం చేస్తున్న రోజుల్లో ఆమెకు మల్లెచెట్లకి నీళ్ళు పొయ్యటం కూడా జ్ఞాపకం ఉండేది కాదు. అవి ఆవురావురుమంటూ ఉండేవి. ఇప్పుడామె ఉద్యోగం మానేసి సుఖంగా ఇంట్లో ఉంటున్న ఫలితంగా మల్లెమొగ్గలు విరగబూస్తున్నాయి. ఇలా రాస్తే ఎలా ఉంటుంది? పెన్ను పెదవుల మీద దొర్లిస్తూ, ఎడంచేత్తో పొట్ట నిమురుకుంటూ, మబ్బుల వంక చూస్తూ ఆలోచన్లో పడ్డాడు ధర్మారావు.

"కాళ్ళు పక్కకి జరుపుకోండయ్యా."

"ఏంటీ?" ఎవరో మాట్లాడుతున్నట్లు వినిపించి కళ్ళు తెరిచి చూశాడు ధర్మారావు.

"కాళ్ళు పక్కకి జరుపుకోండయ్యాగోరూ." చీపురుకట్ట చేతిలో పట్టుకొని పక్కన నిలబడి ఉంది తొమ్మిది, పదేళ్ళ అమ్మాయి. ఎంకమ్మ కూతురు లాగుంది. తనకు కునుకు పట్టిందని గ్రహించాడు ధర్మారావు.

కాళ్ళు కుడివైపుకు పెట్టి, "అమ్మాయ్, మల్లెచెట్లకు నీళ్ళు పోశావా?" అని అడిగాడు.

"నాకు తెలియదయ్యాగోరూ."

"తెలియదంటే ఎట్లా? అవి చచ్చిపోవూ?"

"కసువు జిమ్మి గిన్నెలు కడిగి రమ్మంది అమ్మ," అంటూ మళ్ళా కసువు చిమ్మటం మొదలు పెట్టింది చిన్నక్క.

"అవుననుకో, అయినా మిగతా పనులు కూడా నేర్చుకోవాలి కదా?"

చిన్నక్క జవాబు చెప్పలేదు.

"అన్ని పన్లూ నేర్చుకోకపోతే రేపు పెద్దదానివయ్యాక ఎవరింట్లోనన్నా పని దొరకొద్దూ?"

ఈసారీ జవాబు రాలేదు.

చెమిటి పిల్లతో మాట్లాడుతున్నట్లు, "పని చెయ్యకపోతే తిండి ఎక్కణ్ణుంచొస్తుంది?" అన్నాడు ధర్మారావు.

తల వంచుకుని చకచకా కసువు చిమ్మి సమాధానం చెప్పకుండానే వెళ్ళిపోయింది చిన్నక్క.

కలం మళ్ళా కాగితం మీదికి దించాడు ధర్మారావు. కథ అంతా తల్లో ఉన్నా రాయటం ఇంత కష్టంగా ఉందేమిటి? సునీత తల్లిదండ్రులకి ఒక్కతే కూతురు. బాగా చదువుకుంది. ఈ ధర్మదేశంలో వేల సంవత్సరాలకొద్దీ ఆడవాళ్ళు ఇంటిని కాచుకుంటూ, పిల్లల్ని పెంచుతూ, భర్తని సుఖపెడుతూ వచ్చారు. తల్లిదండ్రులు సత్తా ఉన్న వారైతే కూతురుకు మంచి సంబంధం తెచ్చి పెట్టేవారు. ఇప్పుడు చదువు కూడా కావాల్సి వస్తుంది. ఉద్యోగాలు, సంపాదనా కూడా కావాలనే భ్రమతో కొందరు తమ జీవితాలనూ, కుటుంబాలనూ నాశనం చేసుకుంటున్నారు. తిరిగి మన సంస్కృతీ, సాంప్రదాయాలు ప్రచారంలోకి వస్తేగానీఈ దేశం బాగుపడే మార్గం లేదు. కాని, ఇదంతా రాస్తే ఎలా? ఇలా రాయకుండానే, చదివేవాళ్ళు ఈ విషయం గ్రహించేలా రాయాలి. మరి కథలో ఇద్దరు అమ్మాయిలు ఉంటే సరిపోతుంది. ఒక అమ్మాయి ఉద్యోగం చేస్తూ, నానా బాధలు పడుతూ, భర్తను సరిగ్గా చూడకుండా, పిల్లవాడిని పెంచటానికి సమయం లేక పతనం అయిపోతుంది. సునీత ఆ అమ్మాయికి ప్రత్యర్థి. అప్పుడు చదివేవాడికి అర్థంకాక చస్తుందా? ధర్మారావు ముఖం మల్లెమొగ్గలా వికసించింది.

ఇంటి ముందు ఆటో ఆగటం చూసి అప్పుడే దాదాపు పన్నెండు గంటలవుతుందని గ్రహించాడు ధర్మారావు. భోజనానికి పిలిచిన స్నేహితుడు వీరేశం, భార్య లక్ష్మీ ఆటోలొంచి దిగారు. ఆటోవాడికి డబ్బులిచ్చి లోపలికి వస్తూనే, "ఏంటోయ్ ధర్మం, కాగితాలూ నువ్వూ, ఇంటి దగ్గర కూడా పని తప్పటం లేదా ఏంటీ?" అన్నాడు వీరేశం పక్కనే కుర్చీలో కూర్చుంటూ. లక్ష్మి నమస్కారం అన్నట్లు చూసి మందంగా నవ్వి లోపలికి వెళ్ళింది.

"లేదులే, పనా పాటా, ఏదో కథ రాద్దామని కూర్చున్నాను."

"కథా! నువ్వు కథలు రాస్తావని తెలియదే నాకు?"

"ఇంతకు ముందెప్పుడ రాయలేదు. ఇదే ప్రథమ ప్రయత్నం."

"దేని గురించీ కథా?"

"నీకు నచ్చదులే."

"అదేంటీ! దేన్ని గురించో చెప్పకుండానే నీకు నచ్చదులే అంటే!"

"ఈమధ్య ఆడపిల్లలు ఉద్యోగాలు చెయ్యాలని ఎగబడుతున్నారు. అటు ఉద్యోగాల్లోనూ పెద్దగా పైకి రావటం లేదు, ఇటు కుటుంబాలూ పాడు చేసుకుంటున్నారు. మన సాంప్రదాయం ప్రకారం



ఆడవాళ్ళు ఇల్లు చూసుకుంటూ, పిల్లల్ని చూసుకుంటూ ఉంటే చాలు, బయట పనిచెయ్యటం మంచిది కాదు, అని చెప్పాలని రాస్తున్నాను."

"ఇందులో కొత్తేముందీ? ఇలాంటి సాంప్రదాయ వాదులు స్వతంత్రం రాక ముందునుంచే ఉండేవాళ్ళు. ఇప్పుడు ప్రపంచం మారింది కదా? ఇంకా సాంప్రదాయాలు పట్టుకోని వేలాడతామంటే ఎట్లా! ఇప్పుడు ఆడపిల్లలకు ముఖ్యంగా కావాల్సింది ఆర్థిక స్వాతంత్ర్యం. ఉద్యోగాలు చెయ్యకపోతే స్వతంత్రం ఎక్కణ్ణుంచొస్తుందీ?"

"సాంప్రదాయాన్ని నాశనం చెయ్యాలని ఏవేవో కాకమ్మ కథలు చెప్పిన ఆ కమ్యూనిస్టులకు ఏ గతి పట్టిందో నీకు తెలుసు గదా? ఇప్పుడు ఆర్థిక స్వాతంత్రం పేరుతో మన సాంప్రదాయం మీద మరొక దెబ్బ తియ్యాలని చూస్తున్నారు కొందరు. వాళ్ళకూ అదే గతి పడుతుంది. ఈ పదివేల సంవత్సరాల జీవనది అర్థాంతరంగా వచ్చే ఎండలకు ఎండిపోదు," అన్నాడు ధర్మారావు ఆవేశంగా.

"ఓహో! బాగుంది నీ ఉపన్యాసం! ఏదో విశ్వనాథ సత్యనారాయణగారి పుస్తకాలు చదివినట్లు న్నావు ఈమధ్య. లేక ఘాటైన మందేదన్నా వేసుకున్నావా?" అన్నాడు వీరేశం నవ్వుతూ.

"అన్నయ్యా, రండి లోపలికి! అదేంటండీ, ఆయన్ని బైటనే కూర్చోబెట్టి కబుర్లు చెప్తు న్నారు?" అంటూ చిన్నగా ధర్మారావుని మందలిస్తూ ప్రత్యక్షమయింది శాంత.

"మన వీరేశమేగా, ఏమన్నా కొత్తవాడా ఏంటీ?" అని, "సరే, లోపలికి పోదాం పద, భోజనం చేసే వేళ అవుతుంది," అని వీరేశంతో లోపలికి నడిచాడు ధర్మారావు శాంత వెనకాలే.

హాల్లోకి వస్తూ, "అరే! కవిత వచ్చినట్లుందే," అన్నాడు వీరేశం కవిత కనబడ్డంతోనే.

"అవునంకుల్, నాలుగు రోజులయింది."

"అల్లుడు రమేష్ ఏదో పని మీద ఢిల్లీ వెళ్ళాల్సొచ్చింది. ఎలాగూ ఇప్పుడు పిల్లవాడికి స్కూలు లేదుగదా అని, హైదరాబాదులో ఒంటరిగా ఉండటం ఎందుకులే అని వాళ్ళని ఇక్కడ వదిలేసి పోయాడు ఢిల్లీ పోతూ," అన్నాడు ధర్మారావు.

"అలాగా, బావుంది," అని వీరేశం, "మరి నీ మనుమడు ఏడీ?" అన్నాడు.

"పిల్లవాడు పక్కింటికెళ్ళాడు ఆడుకోవటానికి," అని, "అమ్మాయ్, ఆనంద్ ఇంకా రాలే దేమ్మా?"

"వాడొచ్చి తిని మళ్ళా పక్కింటికి పరుగెత్తాడు. చాలాసేపయింది. మీరు కూర్చోండి," అని ఇద్దరినీ డైనింగ్ టేబుల్ దగ్గరకు పిల్చింది కవిత.

ఇద్దరూ కూర్చున్నారు. అప్పటికే పదార్థాలన్నీ అమర్చిపెట్టి ఉన్నాయి టేబుల్ మీద.

"మీరూ రండి, అందరం కూర్చొని భోజనం చేద్దాం," అన్నాడు వీరేశం, శాంత, లక్ష్మిల వంక చూస్తూ.

"ఫరవాలేదులెండి, మీరిద్దరూ అయింతర్వాత, మేం ముగ్గురం తింటాంలెండి," అన్నది శాంత. లక్ష్మి, కవిత టేబుల్ దగ్గరే కుర్చీల్లో కూర్చున్నారు. శాంత మంచినీళ్ళు గ్లాసుల్లో పోసి, ఇద్దరికీ వడ్డించటం మొదలుపెట్టింది.

"ఏమ్మా, కవితా, హైదరాబాదులో జీవితం ఎలా ఉంది?" అడిగాడు, వీరేశం.

"బాగానే ఉంది, అంకుల్."

"ఎన్నాళ్ళుంటావమ్మా? సెలవు పెట్టొచ్చావా?"

"సెలవూ లేదూ, ఏమీ లేదు అంకుల్. నేనిప్పుడు ఉద్యోగం చెయ్యటం లేదు."

"అలాగా. ఎందుకనీ?"

"అదే వీరేశం, నీకు ఇందాక చెప్పానుగదా. ఇద్దరూ రోజంతా పరుగెత్తుతుంటే ఇంట్లో శాంతి ఉండొద్దూ? ఉద్యోగంలో పడుంటే ఇప్పుడు ఇలాగ ఇంటికి రావటం వీలయ్యేదా?" అన్నాడు ధర్మారావు.

"మీరన్నా చెప్పండి అన్నయ్యగారూ, బలవంతాన ఆ స్కూల్లో ఉద్యోగం చేయిస్తున్నారు నాచేత. రోజంతా పని చెయ్యాలి. వాళ్ళు ఇచ్చే జీతం ఆటో ఖర్చులకు కూడా చాలదు. ఎందుకొచ్చిన ఉద్యోగాలో ఏమో. ఆడవాళ్ళం ఇల్లు చూసుకుంటూ ఉంటే సరిపోదూ?" అని ఫిర్యాదు చేసింది లక్ష్మి.

"బాగుంది, ఆంటీ. మీచేత బలవంతంగా ఉద్యోగం చేయిస్తున్నారు అంకుల్. మావారేమో నన్ను బలవంతంగా ఉద్యోగం మాన్పించారు," అని నిట్టూర్చింది కవిత.

"అదేంటమ్మా! అబ్బాయి మాన్పించాడా? నువ్వే..." అన్నాడు ధర్మారావు నమ్మలేనట్లు.

కవిత ఏమీ సమాధానం చెప్పకుండా ముభావంగా ఉండిపోయింది. విషయం గమనించిన వీరేశం, "ధర్మం, నువ్వు చెప్పేది బాగానే ఉందిగాని, ప్రపంచం అంతా ముందుకు నడుస్తుంది. పూర్వకాలంలో ఆడవాళ్ళు ఉద్యోగాలు చెయ్యలేదుగదా అని అదే మంచిదంటే కుదరదు. నువ్వు ఇది చదివావో లేదో పేపర్లో ఈమధ్య, స్వీడెన్‌లో నూటికి తొంభైమంది ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారట. వాళ్ళు సుఖంగా ఉండటం లేదూ?"

"ఉన్నారో లేదో నాకేం తెలుసూ, అయినా ప్రతిదానికీ ఏ స్వీడెన్‌లోనో, ఇంగ్లాండ్‌లోనో, అమెరికాలోనో చేసినట్లే మనం కూడా చెయ్యాలని ఎక్కడుందీ?"

"ధర్మం. నువ్వు ఏ ప్రపంచంలో ఉంటున్నావోగాని, ఇప్పుడు ప్రతివాడు అమెరికాలోలాగా బ్రతకాలనే ప్రయత్నం చేస్తున్నాడు. ఈరోజుల్లో ఆడపిల్లల్ని చదివించటం ఇంట్లో కూర్చోబెట్టుకోవటానికి కాదు. అమెరికాలో ఉద్యోగం చేస్తుందనే కోరికతోనో, లేక అమెరికా అల్లుడు దొరుకుతాడనే ఆశ తోనో!"

"అదేదో కొన్నాళ్ళు అలాగే జరిగిందిలే. ఇప్పుడు పరిస్థితులు మారాయని చెప్పుకుంటున్నారుగా. అక్కడా ఉద్యోగాలు దొరకటం లేదట."

"అందుకని చదవటం, ఉద్యోగాలు చెయ్యటం మానుకుంటున్నారా? లేదు. ముందు ముందు ఇక్కడ కూడా ఆడవాళ్ళు ఉద్యోగాలు చెయ్యటం ఇంకా ఎక్కువ అవుతుంది. యూరప్‌లో అసలు ప్రతి ఆడమనిషీ ఉద్యోగం చేస్తుంది. అందువల్ల..."

"అందువల్ల ఆఫీసు లవ్వులెక్కువవుతున్నాయి. డైవోర్సులెక్కువవుతున్నాయి. ఒక్కొకామె జీవితకాలంలో ముగ్గుర్ని చేసుకుంటుందట. ఇదేగా యూరప్‌లో జరుగుతుంది?"





"ఎంతమందిని చేసుకుంటున్నారో నాకు తెలియదనుకో. అయినా ఇష్టం లేనివాణ్ణి వదిలేసి ఇష్టం ఉన్నవాణ్ణి చేసుకుంటే తప్పేముందీ?"

"చేసుకున్నాక ఇష్టం లేకపోవటం అంటే ఏమిటీ? కాపురం చేస్తున్న వాళ్ళ మధ్య ఏదో ఒక విషయంలో తేడాలు రాకుండా ఉంటాయా? ప్రతి చిన్న విషయానికి మొగుణ్ణి వదిలెయ్యటమేనా?"

"చిన్న విషయాలకే డైవోర్సులు ఇస్తున్నారని ప్రచారం చేసేది నీలాంటి సాంప్రదాయవాదులు. అసలు డైవోర్సులు లేకుండా పోవాలని నీలాంటివాళ్ళ కోరిక. అది జరిగేది కాదు. ప్రపంచం ముందుకు నడుస్తుంది, ధర్మం. ఇష్టంలేనివాడిని వదిలేసి ఇష్టం వచ్చినవాడిని చేసుకోవటం ఈనాటి ధర్మం."

"నే పోతన్నా అమ్మగోరూ," అన్నది తలుపు దగ్గర నిలబడి ఉన్న పనిపిల్ల, సంభాషణకు అంతరాయం కలిగిస్తూ.

"అప్పుడేనా? కొంచెం ఉండు," అంది శాంత.

"ఈ పిల్లనెప్పుడూ చూడలేదే, మీ పనిమనిషేమయిందీ?" అడిగింది లక్ష్మి.

"ఈ పిల్ల ఆ ఎంకమ్మ కూతురే. దాని పెద్ద కూతురికి పెళ్ళి. రేపే. రెండు మూడు రోజుల్నించీ రావటంలేదు. ఇదుగో ఈ పిల్లని పంపిస్తుంది. దీనికేమో ఏదీ చేతకాదు," అంది శాంత విసుగ్గా.

"ఆ పెద్దకూతురికి ఒకసారి పెళ్ళయింది. దాని మొగుడు ఇంకొకదానితో లేచిపోయాడు మొన్నీమధ్యనే. అదేమో ఇప్పుడు ఇంకొకడిని చేసుకుంటోంది. మీ యూరప్ కంటే ముందుకు పోతున్నారు వీళ్ళు," అన్నాడు ధర్మారావు వీరేశం వైపు చూస్తూ, చమత్కారంగా.

"పోతారు. వాళ్ళకేమన్నా అడ్డూ ఆపూ, మంచీ మర్యాదలు ఉంటేగా. మీకు గుర్తుందో లేదో, మూడు నాలుగేళ్ళ క్రితం వాళ్ళ ఊరి నుంచి ఒకమ్మాయిని తీసుకొచ్చింది లక్ష్మి. ఆ అమ్మాయి మాఇంట్లో నాలుగైదు నెలలు కూడా పనిచెయ్యలేదు. రోడ్ల పని చేసేవాడెవడినో చూసుకొని వాడితో వెళ్ళిపోయింది. అంతే, మళ్ళా కనపళ్ళా. మీ పనిమనిషి కూతురుగ్గూడా అలాంటివాడెవడో దొరికుంటాడు," అన్నాడు వీరేశం కనుబొమ్మలు ఎగరేస్తూ.

"సరేలే ఊరుకోండి," అని మందలించింది లక్ష్మి, కళ్ళు తలుపు దగ్గర కూర్చున్న అమ్మాయి వైపు తిప్పుతూ.

*

భోజనాలు అయింతర్వాత పాత్రలన్నీ వంటగదిలో సింక్‌లో పడేసింది శాంత. వాటిని కడిగేసి అమ్మగారి దగ్గర సెలవు తీసుకోని ఇంటికి చేరింది చిన్నక్క. గుడిసె ముందు కొత్తగా వేసిన తాటాకు పందిరికి రంగు కాగితాలు అంటిస్తున్నాడు పిన్నమ్మ కొడుకు. కొంచెంసేపు చూస్తూ నిలబడి గుడిసెలో కొచ్చింది చిన్నక్క.

లోపలికొస్తుండగానే, "ఇంతసేపేం జేత్తన్నవే? ఇంటికాడ ఇంత పని బెట్టుకొని?" నిలదీసింది ఎంకమ్మ.





"పోనిత్తె గదా, వోరు తిన్నాక గిన్నెలు కడిగి వత్తన్న."

"సరే, పెద్దక్క నీ కోసం జూత్తా వుండింది. ఇప్పుడే పిన్నమ్మకాడికి బోయింది. కొట్లో ఏందో గావాలంట. పోయిరా," అని పురమాయించింది ఎంకమ్మ.

"అమ్మా, పెద్దక్క తప్పుజేత్తందే?"

"ఏం తప్పూ?"

"ఏమో, శాంతమ్మగోరింట్లో అయ్యలు సెప్పుకుంటుండరు."

"ఏం జెప్పుకుంటుండరూ?"

"మొగుడుబోతే మల్ల జేసుకుంట మరేద గాదంట."

"అట్టనా! నీ ముందే అన్నరా?"

"నేనక్కడే కూసునుంటి."

"ఆ నా బట్టలకి మనబోటిగాళ్ళు గనబడతరా."

"మరి పెద్దక్క తప్పు జేత్తందా?"

"తప్పులేదు గిప్పులేదు. దానిష్టం. యిష్టముంటే చేసుకుంటతి, లేకపోతే ఊరుకుంటతి. యీళ్ళెవురూ సెప్పటానికి? సడేలే, పెద్దక్క నడుగు కొట్లో ఏంగావల్నో," అంది ఎంకమ్మ మళ్ళా పన్లో బడుతూ.

ఈమాట, మార్చి *2004*



# అవచారం

**కే**సు ఫైలు జాగ్రత్తగా చదివింది కమల. రోగి పేరు ఎమిలీ. యాభై మూడు సంవత్సరాల వయసు. హైస్కూల్ టీచర్. ఇంతకు మునుపు జబ్బేమీ ఉన్నట్టు లేదు. వారం రోజులుగా సరిగ్గా నిద్రాహారాలు లేవనీ, చాలా దీనంగా కన్పిస్తున్నదనీ భయపడి, భర్త ఆమెను డాక్టరుకు చూపించటానికి తీసుకెళ్ళాడు. ఆయన ఎమిలీకేదో మానసిక వ్యాధి అని నిర్ణయించి, హాస్పిటల్లో సైకి యాట్రీ వార్డులో చేర్పించాడు.



'హాస్పిటల్లో చేరాల్సిన అవసరం ఈ ఫైల్లో ఏమీ కన్పించటంలేదు. రోగి ఏదో దాస్తున్నట్టుంది. ఒకటి రెండు రోజుల్లో అసలు విషయం తెలుస్తుంది. బహుశ డ్రగ్స్‌కు సంబంధించిన కేసై ఉండొచ్చు' అనుకుంది కమల.

మరుసటిరోజు ఉదయం వార్డులో ఎమిలీ బెడ్ దగ్గరకొచ్చి, "హాయ్! నా పేరు కమల. నేనిక్కడ సోషల్ వర్కర్ని. రాత్రి బాగా నిద్రపట్టిందా మీకు," అని అడిగింది.

"ఊహూఁ, బాగానే పట్టింది," అంది ఎమిలీ కొంచెం అనుమానంగా చూస్తూ. ఈ అమ్మాయి కూడా ఇండియన్ లాగుంది. వీళ్ళకసలు వైద్యం తెలుసో, లేదో. ఇట్లా హాస్పిటల్ నిండా డాక్టర్లే కాకుండా, సోషల్ వర్కర్లు కూడా వీళ్ళే ఎందుకున్నారూ? తెల్లవాళ్ళంతా ఏమయ్యారూ? ఈ తక్కువ జాతి వాళ్ళకి తన గురించి చెప్పుకోవాలన్నా ఇబ్బందిగానే ఉందామెకు.

ఏమన్నా అల్పాహారం తిన్నారా అని కమల అడిగితే, దానిక్కూడా తలూపుతూనే సమాధానం చెప్పింది ఎమిలీ.

"ఈమధ్య మీకు చాలా అలసటగా ఉండిందా?" అనడిగింది కమల.

"లేదు. మామూలుగానే ఉండింది."

"ఇంటి దగ్గర పన్లెక్కువయ్యాయా?"

"లేదు."

"స్కూల్లో బాధ్యతలేమన్నా ఎక్కువయ్యాయా?"

"లేదు. నాకు స్కూలంటే చాలా ఇష్టం. స్కూల్లో ఉన్నంతసేపూ నన్ను నేను మర్చి పోతాను. కాలం ఊరికే గడిచిపోతుంది," అంది ఎమిలీ చిరునవ్వుతో.

ఇంటి గురించి క్లుప్తంగా చెప్పిన మనిషి, స్కూలు గురించి బారెడు సమాధానం చెప్పటంతో సమస్య ఇంటి దగ్గరే ఉండి ఉంటుందని గ్రహించింది కమల. కానీ, ఆమెతో స్నేహ సంబంధం ఏర్పడాలంటే కొంచెంసేపు స్కూలు గురించి మాట్లాడ్డమే మంచిదనుకుంది.

"మీరేం పాఠాలు చెప్తారు స్కూల్లో."

"ఇంగ్లీషు."

"ఎక్కడ చదివారింగ్లీషు?"

"అదెప్పుడో పాతికేళ్ళనాటి సంగతి. చికాగో యూనివర్శిటీలో ఎం.ఏ. చదివాను," అని, "నువ్వెక్కడ చదివావు," అనడిగింది ఎమిలీ.

"మిషిగన్ యూనివర్శిటీలో చదివాను," అని, "మీకు పిల్లలున్నారా?" అనడిగింది కమల.

"ఇద్దరమ్మాయిలు. మా పెద్దమ్మాయి కూడా చికాగోలోనే చదివింది," అందామె గర్వంగా. "మా చిన్నమ్మాయి నీలాగే మిషిగన్లో చదివింది." నా కూతురు కూడా అక్కడే చదివింది గాబట్టి నీ మిషిగన్ చదువు ఫరవాలేదులే అన్నట్టు చూస్తూ.





"మీరు విశ్రాంతి తీసుకోండి. సాయంత్రం గ్రూప్ థెరపీ నడిపేది నేనే. అప్పుడు మళ్ళా మాట్లాడుకుందాం" అని నవ్వుతూ తన ఆఫీసు వైపు వెళ్ళిపోయింది కమల.

* * *

గ్రూప్ థెరపీ అంటే సామూహిక వైద్యం. పదిమంది మానసిక రోగులు ఒకచోట కూర్చొని మాట్లాడుకుంటారు. ఒక్కొక్కరూ తమ జబ్బు గురించి, దానివల్ల పడుతున్న ఇబ్బందుల గురించీ చెప్పుకుంటారు. ఈ జబ్బుల గురించి కానీ, వాటిని వదిలించుకునే మార్గం గురించి కానీ ఎవరికి తోచింది వారు ఫ్రీగా చెప్తారు. తన వేదనల్ను మనసులోపెట్టుకొని కుంగిపోతున్న రోగికి ఇట్లా నలుగురితో చెప్పుకోవడం వల్ల కొంత భారం తగ్గటమే కాక, ఇలాంటి ఇబ్బందులు తనకే కాకుండా చాలామంది కుంటాయని తెలుస్తుంది. ఇలాంటి చర్చలను ఒక దోవలో నడపటం, పనికిమాలిన మాటల్తో కాలం వృథా కాకుండా చూడటం సోషల్ వర్కర్ పని. రోగుల మధ్య జరిగే సంభాషణలను గమనిస్తూ, వాళ్ళు తమ గురించి చెప్పుకునేదాన్ని బట్టి, ఇతర రోగుల విషయంలో వాళ్ళు వ్యక్తపరిచే అభిప్రాయాలను బట్టీ, వాళ్ళ జబ్బుల గురించి కొంత అవగాహన ఏర్పరచుకుంటుంది సోషల్ వర్కర్.

సాయంత్రం జరిగిన గ్రూప్ థెరపీలో ఎమిలీ మిగతావాళ్ళతో సులభంగానే కలిసి పోయింది. ఆ గ్రూపులో డ్రగ్సు వాడడంతో డిప్రెషన్లో పడిపోయిన వాళ్ళున్నారు. భార్యో, భర్తో వదిలెయ్యడం వల్ల మానసికంగా దెబ్బతిన్న వాళ్ళున్నారు. తాగుడు వల్ల ఆరోగ్యం క్షీణించిన వాళ్ళున్నారు. తన గురించి మాట్లాడుతూ, బొత్తిగా తీరిక లేకుండా ఉండడమే తన వ్యాధికి కారణం అని చెప్పింది ఎమిలీ. ఇంతకుముందు అలాంటిదేమీ లేదని కమలతో అన్నట్టు గుర్తొచ్చి, కళ్ళతోటే కమలకు క్షమాపణ చెప్పింది. "ఫరవాలేదు, మాట్లాడండి," అన్నట్టు జవాబుగా చూసింది కమల.

చిన్నప్పట్నుంచీ పెన్సిల్తో బొమ్మలు గీయటం ఇష్టం అట ఎమిలీకి. తన చిత్రాలు అప్పుడప్పుడూ మ్యూజియాల్లో కూడా ప్రదర్శించబడ్డాయట. కానీ, దాదాపు పది సంవత్సరాల్నించీ తనకు బొమ్మలు గీయడానికి సమయం దొరకడం లేదట. ఎప్పుడూ ఏవో పన్లుంటున్నాయట.

"శనాదివారాలేం జేస్తుంటావు? అప్పుడు గీసుకోరాదూ బొమ్మలు?" అందొకావిడ.

రెండు క్షణాలు మౌనంగా ఉండిపోయింది ఎమిలీ. కొంచెం తేరుకొని, "సోమవారం నుంచి శుక్రవారం దాకా చెయ్యడానికి వీలుగాని పన్లన్నీ శనాదివారాలకు నెట్టుకుంటూ వస్తాను. అందువల్ల అసలు శనివారం, ఆదివారం సెలవురోజుల్లాగా ఉండవు. పనికెళ్ళే రోజులకంటే అప్పుడే ఎక్కువ పన్లుంటయ్," అంది ఎమిలీ నిస్సహాయంగా నవ్వుతూ.

ముఖ కవళికల్ని బట్టి చూస్తుంటే ఈమెకు జబ్బుంటూ ఉన్నట్లు ఎవరికీ అనిపించలేదు. కమలక్కూడా ఈమె జబ్బుకు కారణం ఏమిటో ఇంకా అంతుబట్టలేదు.

* * *





రోగి కుటుంబంతోకలిసి మాట్లాడటం, జబ్బును గురించి వాళ్ళకేమైనా ప్రశ్నలుంటే సమాధానాలు చెప్పటం, కుటుంబ పరిస్థితుల గురించి వాళ్ళనడిగి రోగి మీద వాటి ప్రభావం గురించి ఆలోచించటం కూడా సోషల్ వర్కర్ బాధ్యతల్లో ఒకటి.

మరుసటిరోజు శనివారం. ఎమిలీ భర్త రాబర్ట్టూ, పెద్ద కూతురు మార్షా వచ్చారు. తొమ్మిది గంటలకు రావాల్సినవాళ్ళు పదిహేనునిమిషాలు ఆలస్యంగా వచ్చారు. వస్తూనే క్షమాపణలు చెప్తూ కుంటూ, తల్లి హాస్పిటల్లో ఉండటం వల్ల తనకు చాలా ఇబ్బందిగా ఉందనీ, పిల్లలను చెల్లెలి ఇంటి దగ్గర వదిలేసి తిరిగి వచ్చేటప్పుడు ట్రాఫిక్ వల్ల ఆలస్యం అయిందనీ వల్లెవేసింది మార్షా. "ఫరవాలేదు," అని, "పిల్లలు ఎంత వయసువాళ్ళు?" అని పరామర్శించింది కమల. ఇద్దరు కొడుకులనీ, వయసు మూడు సంవత్సరాలూ, ఒక సంవత్సరమూ అని చెప్పింది మార్షా. ఇంటికి దగ్గర్లో ఎవరూ బేబీ సిటర్ దొరకరా అని అడిగితే, నవ్వుతూ, పిల్లలకు అమ్మమ్మ దగ్గర బాగా అలవాటు అయిందనీ, ఇప్పుడామె హాస్పిటల్లో ఉండటం వల్ల చాలా ఇబ్బందిగా ఉందనీ చెప్పింది మార్షా.

ఇంకా తెలిసిన విషయాలేమిటంటే, మార్షా చెల్లెలు ఎలిజాక్కూడా ఒక కూతురుంది. ఆ అమ్మాయికి కూడా మూడో ఏడు. ఒక శనాదివారాలు మార్షా బిడ్డల్నీ, తర్వాత శనాదివారాల్లో ఎలిజా కూతుర్నీ చూస్తుంటుంది ఎమిలీ. ఒక్కోసారి ఇద్దరూ తమ పిల్లల్ని అమ్మ దగ్గర వదిలేసి ఏవో పన్లు చూసుకుంటుంటారు.

ఎమిలీ జబ్బుకు కారణం ఏమిటో తెలిసినట్లనిపించింది కమలకు. పాపం ఆమెకు అసలు తీరికేదీ?

"ఆరోగ్యం బాగుపడాలంటే, ఎమిలీకి విశ్రాంతి చాలా అవసరం. ప్రతి శనాదివారాలూ మనుమల్నో, మనుమరాలినో చూసుకుంటూ ఉండటంతో ఆమెకసలు తీరిక లేకుండా పోయింది," అని మార్షాతో, రాబర్టుతో నిర్మొహమాటంగా చెప్పింది కమల. మార్షా దోషిలాగా నిలబడింది. ఇంటి దగ్గరున్న ఎలిజా మీద అసూయ పొంగింది.

మరుసటి రోజు ఉదయం మళ్ళీ ఎమిలీతో మాట్లాడింది కమల. ముఖం చూస్తుంటే ఆమె రాత్రి బాగానే నిద్రపోయిందనిపించిది. బాగున్నారా అనడిగితే సౌమ్యంగా, అవును అన్నట్లు తలూపింది.

"నాకు బాగానే ఉంది. ఇక డిస్చార్జి చేయించరాదూ?" అని అడిగిందామె.

"మీరు మనోవ్యాధితో ఇక్కడకొచ్చారు. దానికి కారణం తెలియకుండానే ఇంటికి పంపిస్తే, మళ్ళా రెండురోజుల్లో తిరిగొస్తారు."

"అబ్బే, అదేంలేదు. మనోవ్యాధంటూ ఏమీలేదు. విశ్రాంతి లేక అలా అయింది. ఈ రెండురోజుల్లో చాలా విశ్రాంతి దొరికింది. మళ్ళా ఇక్కడకు రావాల్సిన అవసరం ఉండదు."



"విశ్రాంతి దొరకటానికి జీవిత విధానంలో ఎలాంటి మార్పులు తెచ్చుకోవాలో మీరు ఆలోచించారా?"

"ఏముందీ ఆలోచించటానికి? జీవిత విధానం మార్చుకోటం అంత సులభమైన పనికాదు. ఎలాగో బండినడుపుకుంటూ పోవటమే! నువ్వింకా చిన్నదానివి. జీవితం గురించి నీకంతగా తెలియదింకా."

"మార్పులు రావటం సులభం గాదు. నిజమే. కానీ, ఒక జీవిత విధానం మిమ్మల్ని రోగిగా తయారుచేసిందంటే, దాన్ని మార్చుకోలేకపోతే మీ ఆరోగ్యం చెడిపోతుంది," అని, ఈ ఘటం ఎలాగూ అసలు విషయం గురించి మాట్లాడనుకుని, "మీరసలు శనాదివారాల్లో అంతగా చేసేదేమిటి," అని అడిగింది.

"నాకు ఇల్లు శుభ్రంగా ఉంచుకోవటం ఇష్టం. పనికెళ్ళే రోజుల్లో ఇల్లు శుభ్రం చెయ్యటం వీలుపడదు. అందువల్ల వాక్యూం చెయ్యటం, వంటగది ఫ్లోర్ తుడవటం, బాత్రూమ్ శుభ్రం చెయ్యటం, బట్టలుతుక్కోవటం ఇవన్నీ శనాదివారాల్లోనే."

"నిజమే. కానీ, ఇవి అందరూ చేసుకునే పన్లే. రెండు రోజులు విరామం లేకుండా చేసుకోవటానికి సరిపడే పన్లు కాదు."

"శనివారం పదీ పదకొండు గంటలకల్లా పన్లన్నీ అయిపోవాలి. అప్పటికి మా మనవలూ, మనవరాలూ వచ్చేస్తారు. వాళ్ళొచ్చింతర్వాత పన్లు చేసుకోవటం వీలుపడదు."

"అంటే మీరు అమ్మమ్మలన్నమాట! ఆ మాట చెప్పలేదేం మరి! ఎంతమంది పిల్లలు మీ అమ్మాయిలకి? ఎన్నేళ్ళుంటాయి?"

"పెద్దమ్మాయి మార్షాకి ఇద్దరబ్బాయిలు. వాళ్ళకి వయసు మూడు సంవత్సరాలూ, ఒక సంవత్సరం. చిన్నమ్మాయి ఎలిజాకు ఒక కూతురు. దానికి మూడేళ్ళు."

"నెలకెన్నిసార్లొస్తారు పిల్లలు మిమ్మల్ని చూడ్డానికి."

"నెలకా? ప్రతి శనాదివారాలూ ఎవరో ఒకరు పిల్లల్ని నా దగ్గరొదిలేసి వెళ్తారు. ఒక్కొక్కసారి ఇద్దరికీ పన్లుంటాయి. ఇద్దరి పిల్లలూ నా దగ్గిరే ఉంటారు."

"మరి మీవారున్నారుగా. ఆయన రిటైరయ్యారు కూడా. పిల్లల్నాయన దగ్గరొదిలేసి మీరు కొంచెంసేపు విశ్రాంతి తీసుకోవచ్చుగా."

"ఆయనకు పిల్లలంటే చాలా ఇష్టం. శనివారం ఎప్పుడొస్తుందా అని చూస్తుంటాడు పిల్లలొస్తారు కదా అని. కానీ, ఆ టీవీలో ఎప్పుడూ ఏవో ఆటలొస్తూనే ఉంటాయి. వాటిని చూస్తూ పిల్లల సంగతి మర్చిపోతాడు. వాళ్ళేదో కిందకు లాగటమో, పైన పడేసుకోవటమో చేస్తుంటారు," అంది నిస్సహాయంగా ఎమిలీ.

“సరే. మీకెందుకు విశ్రాంతి లేదో మీకు బాగా తెలుసు. మరి పరిస్థితులు మారాలంటే ఏం చెయ్యాలో కూడా మీకు బాగానే తెలిసుంటుంది. కానీ, ఆ మార్పు ఎలా తీసుకురావాలా అనేదే ముఖ్యమైన విషయం.”

“చూడు కమలా, నీ పేరు కమలే కదూ! కమలా అని పిలుస్తాను నువ్వేమీ అనుకోకపోతే. తల్లులూ, కూతుళ్ళూ ఉన్నంతకాలం కూతుళ్ళు తల్లుల మీద ఆధారపడుతూనే ఉంటారు! నాకు పిల్లల్ని చూట్టం వీలుకాదు. ఎవర్నయినా బేబీ సిటర్ని చూసుకోండి అని చెప్పటం ఏం బాగుంటుంది చెప్పూ. మనవల్నీ, మనవరాళ్ళనూ గారాబం చేసి పాడు చెయ్యటం అనాదిగా వస్తున్న ఆచారం,” అంది ఎమిలీ నవ్వుతూ.

“ఎప్పుడూ కాదనటం కాదు. మీకు వీలు కానప్పుడూ, అలసటగా ఉన్నప్పుడూ, ఈరోజేదైనా బొమ్మలు  గీసుకుంటే బాగుండూ అని అనిపించినప్పుడూ వీలుకాదని చెప్పండి. మిమ్మల్నెవరూ తప్పుపట్టరు.” సలహా చెప్పింది కమల.

చూస్తాన్లే అన్నట్లు తలూపింది ఎమిలీ.

*      *      *

ఎమిలీ డిస్చార్జయి వెళ్ళిపోయిం తర్వాత కూడా ఆమె గురించి చాలాసార్లు ఆలోచించింది కమల.

ఎమిలీకి కూతుళ్ళంటే చాలా ఇష్టం. వాళ్ళకీ తల్లి మీద చాలా ప్రేమ. మరి తల్లినెందుకు వాళ్ళు అలా అనాలోచితంగా తమ అవసరాలకు వాడుకుంటున్నారు?

రాబర్టూ అనవసరంగా ఒక్కమాట కూడా మాట్లాడడు. అవసరమైతే తప్ప ఒక్కపనీ చెయ్యడు ఇంట్లో. ఎమిలీతో ఉంటున్నాడే కానీ, అతని ప్రపంచం వేరే లాగుంది. అందువల్లే ఎమిలీ పరిస్థితి విషమించేంతవరకు గుర్తించలేదు.

తాను చెయ్యలేని రోజుకూడా ఈరోజు పిల్లల్ని చూడటం నాకు వీలుకాదు అనలేదు ఎమిలీ. ఎందువల్ల? వీలు కాదంటే తాను మాతృమూర్తి స్థానం నుంచి పడిపోతుందని భయమా?

*      *      *

కొన్నాళ్ళ తరువాత ఒకరోజు కమలనూ, నారాయణనూ భోజనానికి పిల్చారు వెంకట్రామి రెడ్డి, సులక్షణలు. వాళ్ళకీమధ్య కొడుకు పుట్టాడు. అదీగాక ఇన్నాళ్ళూ ఎపార్ట్‌మెంటులోఉన్నవాళ్ళు ఈమధ్య ఒక ఇల్లు కొనుక్కున్నారు. వచ్చే ఆదివారం వాళ్లింట్లో గృహప్రవేశం జరుపుకుంటారు. సత్యనారాయణస్వామి పూజ కూడా చేస్తారు. ఈ సందర్భంగా మిత్రులందరినీ భోజనాలకు పిల్చారు.



ఆరోజు వాళ్ళింటికెళ్ళేసరికి కొంచెం ఆలస్యం అయింది వీళ్ళకు. కమల తయారయ్యేసరికి మామూలుగా ఆలస్యం అవుతూనే ఉంటుంది. తలుపు తట్టగానే అంతకుముందే వచ్చిన వాళ్ళలో ఒకతను తలుపు తీశాడు.

“నమస్కారం. రండి,” అని, “ఆడవాళ్ళంతా వంటగదిలో ఉన్నారు,” అన్నాడు కమలను చూస్తూ. నారాయణని చూస్తూ, “మగాళ్ళు కొంతమంది బేస్‌మెంటులో ఉన్నారు. కొందరిక్కడ లివింగ్ రూమ్‌లో ఉన్నారు,” అన్నాడు. నీ ఇష్టం వచ్చినచోట చతికిలపడమని ఆహ్వానిస్తూ.

లివింగ్‌రూమ్‌లో ఇంకా ఫర్నిచర్ ఏమీలేదు. మడత కుర్చీల మీద ఒక సర్కిల్లో కూర్చోనున్నారు అతిథులంతా. ఒక్కొక్కరితోచేతులుకలుపుతూ, నా పేరు నారాయణ అని చెప్తూ, అతని పేరు వింటూ, అందరితో పరిచయం చేసుకొని ఒక కుర్చీలో కూర్చున్నాడు నారాయణ. అప్పటికే సంభాషణ జోరుగా సాగుతున్నట్లుంది. నారాయణతో పరిచయాలు ముగించడమే ఆలస్యంగా మళ్ళా మొదలైంది. బాబ్రీ మసీదూ, అయోధ్య, చర్చిల మీద బాంబులూ, వీటి మీద రకరకాల సిద్ధాంతాలూ, వేడివేడి వాదోపవాదాలూ. నారాయణకు రెండు నిమిషాల్లోనే బోర్‌కొట్టింది. పొద్దుటే ఇంత లోతైన విషయాలెలా దొరుకుతాయి వీళ్ళకు? ఎవ్వరికీ ఇబ్బంది కలక్కుండా అక్కణ్ణించి లేచి మెల్లగా బేస్‌మెంట్ చేరుకున్నాడు నారాయణ. బేస్‌మెంట్ పెద్దది. ఒకవైపు టేబుళ్ళ మీద తిండి పదార్థాలన్నీ అమర్చబడి ఉన్నాయి. రెండోవైపు రెండు గ్రూపులుగా మడతకుర్చీల మీద కూర్చొని బాతాఖానీలు కొడుతున్నారు గెస్టులు. ఒక గ్రూపుకు దగ్గరగా వెళ్ళి కూర్చున్నాడు నారాయణ. పరిచయాల జోలికి పోవటం అనవసరమనుకున్నాడు. సంభాషణ ఇక్కడ కూడా జోరుగానే సాగుతోంది.

“చంద్రబాబంత గౌరవం ఉన్న ముఖ్యమంత్రి మరొకడు లేడు,” అన్నాడొకాయన.

“అసలు చంద్రబాబు సీఎం కాకముందు న్యూయార్క్ స్టాక్ మార్కెట్‌లో ఒక్క ఇండియా కంపెనీ కూడా ఉండేది కాదంట. ఇప్పుడు మనోళ్ళవి అర్ధడజను కంపెనీలున్నై,” అన్నాడింకొకతను.

“ఆసియా ఖండం మొత్తంలో నాయుడంత గొప్ప నాయకుళ్ళేడని సింగపూరు పత్రికలన్నీ రాసినయ్యంట,” అన్నాడింకొకతను.

“సింగపూరే కాదు, జపాన్‌లో, చైనాలో అందరూ చంద్రబాబు గురించేనంట మాట్లాడుకోవడం. ఆయన పుణ్యమా అని జపాన్ వాళ్ళు హైదరాబాదొస్తున్నారంట కంప్యూటర్ల గురించి నేర్చుకోవడానికి,” అన్నాడొకాయన.

“పూజ మొదలు పెడుతున్నారండీ,” అని అందరినీ ఈ లోకంలోకి తీసుకొచ్చిందొకావిడ. లేచి పైకెళ్ళటానికి సిద్ధమయ్యారంతా.

*      *      *

ఫామిలీ రూమ్‌లో పూజకు అంతా సిద్ధం చేశారు. సత్యనారాయణ పటం, దానిముందు పూజ సామాగ్రి, ఒకవైపు పూజారి, రెండోవైపు వెంకట్రామిరెడ్డి, సులక్షణ కూర్చున్నారు. వాళ్ళ ముందు నాలుగైదు వరుసల్లో ఆడవాళ్ళూ, వాళ్ళ వెనుక కొందరు నేలమీద, కొందరు మడత కుర్చీల మీద మగవాళ్ళూ కూర్చున్నారు. పూజ పదకొండు గంటలకు మొదలయింది. పూజారి అతివేగంగా మంత్రాలు చదివాడు. అప్పుడప్పుడూ తాను చదివిన మాటలను వెంకట్రామిరెడ్డినీ, సులక్షణనూ పలకమన్నాడు. కానీ, వాళ్ళా మాటల్ని అనడానికి సరైన వ్యవధి ఇవ్వకుండానే తర్వాతి మాటల కెళ్ళాడు. మధ్యమధ్యలో ఒక నడివయసులో ఉన్నామెను ఏవేవో తీసుకురమ్మని పురమాయించాడు. ఆమె వంటగదిలోకెళ్ళి అడిగిన వస్తువులు తెచ్చిచ్చింది. ఆమె వెంకట్రామిరెడ్డి తల్లో, సులక్షణ తల్లో అయుంటుందనుకున్నాడు నారాయణ.

పూజ జరుగుతుంటే వెనుక చేరి మగవాళ్ళు ఏవేవో సంభాషణలు సాగిస్తూనే వచ్చారు. అప్పుడప్పుడూ పూజారి వారిని, 'కొంచెం చిన్నగా మాట్లాడుకోండి బాబూ,' అన్నట్లు చూశాడు. దాదాపు పన్నెండున్నరకు పూజ అయిపోయింది. ముందు వరుసలో కూర్చున్న ఒకామెకు సత్య నారాయణ వ్రతకథ చదవమని పుస్తకమొకటిచ్చాడు పూజారి. కొంతసేపు ఆమె చదివి, రెండో కథను చదవమని పక్కావిడకిచ్చింది.

"అసలు ముందు కథ చదివి, తర్వాత పూజ చేస్తే మంచిదండీ. పూజను శ్రద్ధగా చూడ కుండా కబుర్లు చెప్పుకునేవాళ్ళను దేవుడు ఎలుకలుగానో, పిల్లులుగానో, కందగడ్డలుగానో చేసి పారేస్తాడని కథ చెప్పి, తరువాత పూజ మొదలుపెడితే అందరూ గప్‌చుప్‌గా ఉంటారు," అన్నాడు పక్కన కూర్చున్నాయన, తన తెలివితేటలకు తానే మురిసిపోతూ. "ఔను," అన్నాడు నారాయణ.

కథా పారాయణం జరుగుతుండగానే కొందరు ఆడవాళ్ళు బేస్‌మెంట్‌లో కెళ్ళి భోజనాలు ప్లాస్టిక్ ప్లేట్లలో పెట్టటం మొదలుపెట్టారు. కొందరు మగవాళ్ళు ప్లేట్ల కోసం లైన్లో నిలబడ్డారు. అప్పటికే లైను పొడుగ్గా ఉండటం చూసి నారాయణ ఒక కుర్చీలో కూలబడ్డాడు.

ఇంతలో నారాయణను వెతుక్కుంటూ వచ్చింది కమల. "వాళ్ళబ్బాయిని చూశావా?" అని అడిగి, లేదని అతను తలూపితే, "మరి చూద్దాం రా," అని అతన్ని పైకి లాక్కెళ్లింది.

వెంకట్రామిరెడ్డి తల్లి కాబోలు, పిల్లాణ్ణి చేతుల్లో పెట్టుకొని ఉయ్యాల్లా ఊపుతోంది. ఆమె దగ్గరికెళ్ళి "నమస్కారం" అన్నారు వీళ్ళిద్దరూ. పిల్లాణ్ణి చూడ్డానికొచ్చారని గుర్తించి, "రండి, ఇప్పుడే నిద్రపోయాడు," అంటూ, కొంచెం పక్కకి తిరిగింది పిల్లాడి ముఖం వాళ్ళకు కనిపించే టట్టు.

"అంతా వాళ్ళ నాన్నలాగే ఉంది కదూ ముఖం?" అందామె.

"అవునండీ. మీరు వెంకట్రామిరెడ్డి తల్లిగారు కదూ?" అనడిగాడు నారాయణ.





"కాదు బాబూ. సులక్షణ వాళ్ళమ్మని."

"అలాగా, మీ అమ్మాయి చేత పూజ బాగా చేయించారండీ," అంది కమల.

సంతోషంతో, అభినందనలు అలవాటు లేక వచ్చిన సిగ్గుతో తలొంచుకుందావిడ. "ఏదో లేమ్మా. మీలాంటి వాళ్ళు అండగా ఉంటే, వాళ్ళు బాగానే ఉంటారు."

కట్టూ బొట్టూతో పాటు ఆమె మాటలు కూడా నిరాడంబరమైన పల్లెటూరి మనిషని చెప్తున్నాయి. ఇండియాలో తనవారంతా గుర్తుకొచ్చారు నారాయణకు.

"మీరొచ్చి ఎన్నాళ్ళయిందండీ?"

"రెండు నెల్లు దాటీ ఆర్రోజులయిందయ్యా," రోజుల్లెక్కబెట్టుకుంటోందని చెప్పనవసరం లేకుండానే చెప్పిందామె.

"ఈ ఊరు నచ్చిందా మీకు."

"బాగానే ఉందయ్యా. అంతకుముందున్న గదిలో ఇరుగ్గా ఉండేది. ఈ ఇంట్లోకొచ్చి పన్నెండురోజులయింది. ఇక్కడ చానా స్తళం ఉంది. పిల్లోడు అటూ ఇటూ తిరిగే వయసొచ్చేట ప్పటికి ఇక్కడ బాగుండిద్ది."

"ఇల్లు కాదండీ. ఈ ఊరు మీకు నచ్చిందో లేదో అని."

"ఊరి సంగతి నాకేం తెలుసయ్యా," అందామె.

"మీ ఊళ్ళో ఏం చేస్తుంటారీ రోజుల్లో?"

"ఏముందయ్యా, మామూలు పన్లే. చేలల్లో పన్లెప్పుడూ ఉండేయే. పొగాకూ, పత్తీ, వొరీ ఏస్తారు మా ఊళ్ళో. ఆ పత్తికెప్పుడూ ఏదో సేవజేస్తూనే ఉండాల. రోజు మార్చి రోజు ఏవేవో మందులు గొడ్తుండాల. అంతా జేస్తే అందులోంచి వొచ్చేదీ లేదు పెట్టేదీ లేదు. ఈయనేమో పొద్దస్తమానం ఆ పొలం కాడే బడుంటాడు."

ఆమె మనసెక్కడుందో అర్థమయింది నారాయణకు. ఇంతలో ఇంకెవర్నో తీసుకొచ్చింది సులక్షణ, పిల్లాణ్ణి చూట్టానికి. ఆమెవైపు తిరిగి, "ఊరికి పంపించేలోగా మీ అమ్మగార్ని మా ఇంటి కొకసారి తీసుకురండి," అన్నాడు నారాయణ.

"అలాగేనండి. ఉంటుందిలెండి రెండు మూణ్ణెల్లు. మొన్ననేగా వొచ్చింది," అంది సులక్షణ.

*   *   *

భోజనాలయింతర్వాత తిరిగి ఇంటికెళ్ళేటప్పుడు సులక్షణ వాళ్ళమ్మ గురించి ఆలోచిస్తూ కూర్చుంది కమల. పాపం ఆమె మనసు ఇండియాలోనే ఉంది. తన పనులు, ఇష్టాయిష్టాలు వదిలేసి, కూతురు అడిగితే కాదనలేక అమెరికా వచ్చుంటుందామె. పొలం పన్లున్నయ్. సహాయంగా ఉంటావు, నాలుగు నెల్లు ఇండియా రమ్మని కూతుర్నడుగుతుందా ఆమె? అడగదు. కానీ కూతురు




అడగ్గానే వచ్చుంటుంది. నాకు వీలుగాదు అని చెప్పగలదా ఆమె? చెప్పలేదు. 'అమ్మ' అంటేనే ఇవ్వటం అని అర్థం. తీసుకోవటం కాదు.

ఎమిలీ గుర్తొచ్చింది కమలకి. దేశం, జాతి, మతం, భాష, వేషం – దేంట్లోనూ కలవని ఎమిలీ, సులక్షణ వాళ్ళమ్మ పిల్లల విషయంలో మాత్రం ఒకే విధంగా ప్రవర్తిస్తారు. కారణం?

"ఏంటి ఆలోచిస్తున్నావు?" డ్రైవ్ చేస్తున్న నారాయణ అడిగాడు.

"సులక్షణ వాళ్ళమ్మను ఇక్కడకు తీసుకురావటం బాగాలేదు కదూ?" అంది కమల.

"ఏం?"

"ఆమె భర్త ఇంటి దగ్గర పొలం పనుల్లో మునిగున్నాడు. ఆమె మనసక్కడే ఉంది."

"అవుననుకో. వీళ్ళకు ఇల్లు కొనుక్కోవటం, డెలివరీ అన్నీ ఒకేసారి రావటం వల్ల సులక్షణ ఇండియా పోలేక, వాళ్ళమ్మనే ఇక్కడకు తీసుకొచ్చుకుంది. ఇది మామూలేగా?"

"ఏది మామూలు?"

"డెలివరీకి అమ్మగారింటికి పోవటం, లేక అమ్మను అమెరికా తీసుకొచ్చుకోవటం. నువ్వు మాత్రం చెయ్యవూ అట్లా?"

"చెయ్యను. మా అమ్మే రావాలని ఏముంది? మీ అమ్మగారెందుకు రాగూడదూ? అసలు వాళ్ళెందుకూ రావటం? నువ్వే ఎందుకు సహాయం చెయ్యగూడదూ?"

"చెయ్యొచ్చు. కానీ, అన్నిరోజులు సెలవు దొరకద్దూ?"

"అంటే కనటానికి నాకు సెలవు దొరుకుతుంది గానీ, కొన్నాళ్ళపాటు సహాయం చెయ్యటానికి నీకు సెలవు దొరకదంటావు? లేక ఇట్లాంటి పన్లు చెయ్యటానికి సెలవు తీసుకోవటం దండగ అనా?"

"ఇప్పుడిదంతా మనకెందుకు? ప్రస్తుతం పిల్లలొద్దనుకున్నాంగా మనం."

"ఇప్పుడయినా, నాలుగేళ్ళ తర్వాతైనా పన్లు చేసిపెట్టటానికి మా అమ్మను తీసుకొద్దాం అంటే నేనొప్పుకోను."

"సరే నీ ఇష్టం. కానీ, ఇలాంటి మాటలు నేనెప్పుడూ విన్లేదు."

"ఎలాంటి మాటలు?"

"కాన్పుకు తల్లిని సహాయంగా తీసుకొచ్చుకోవటం ఆడవాళ్ళందరూ చేసేదే. అది తప్పని నువ్వెందుకనుకుంటున్నావో నా కర్థంగావటంలా."

"అమెరికా చూపించటానికి ఆమెను తీసుకొద్దాం అంటే నాకేమీ అభ్యంతరం లేదు. కానీ, నీకు ఇంట్లో పన్లు చెయ్యటం ఇష్టంలేక ఆమెను తీసుకొద్దాం అంటే మాత్రం నేనొప్పుకోనంటున్నాను."

"పోన్లే. మా అమ్మ వొస్తుందేమో?"



"మా అమ్మైనా, మీ అమ్మైనా ఒకటేనన్నాను కదూ? వాళ్ళెందుకు రావటం?"

"నువ్వెందుకిలా తలతిక్కగా మాట్లాడుతున్నావీ రోజు? తల్లి కూతురుకు సహాయం చెయ్యటం తరతరాలుగా వస్తున్న ఆచారం."

"అవచారం."

"అంటే?"

"అవసరాలు తీర్చుకోవటానికి చేసిన ఏర్పాటు. ఆడవాళ్ళ చేత పన్లు చేయించుకోవటానికి కనిపెట్టిన గొప్ప పవిత్ర సంబంధం."

"కమలా, నువ్వేదో స్త్రీవాదం గొడవలో పడ్డట్టున్నావు."

"అవును. కడుపులు చెయ్యటం పురుషవాదం గొడవ, పురుళ్ళు పొయ్యటం స్త్రీవాదం గొడవ."

ఈ సంభాషణ శ్రుతి మించింది. మరేదైనా విషయం గురించి మాట్లాడుకుంటే బాగుంటుందనిపించింది నారాయణకు.

హైవే నుంచి బయటికొచ్చేసి ఒక చిన్న వీధిగుండాపోతోంది కారు. రెండువైపులా పెద్దపెద్ద ఇళ్ళూ, వాటి ముందు చక్కగా తీర్చిదిద్దినట్లు పూలవనాల్లా ఉన్న లాన్లూ చూస్తూ, "ఇళ్ళు ఎంత బాగున్నాయో చూడు కమలా," అన్నాడు నారాయణ.

"ఈ ఇళ్ళవాళ్ళు బైట పని చెయ్యరు. ఆ మెక్సికో వాళ్ళున్నారుగా వీళ్ళకు పన్లు చెయ్యటానికి. వాళ్ళు లేకపోతే ఇంత అందంగా ఉండవు వీళ్ళ ఇళ్ళూ, లాన్లూ," అంది కమల.

"మెక్సికో వాళ్ళు ఊరికే వొచ్చి పనిచెయ్యటం లేదుకదా కమలా. వీళ్ళు ఖర్చులు పెట్టి, వీసాలూ అవీ తెప్పించి తీసుకొస్తేనే గదా వాళ్ళు రాగలిగింది."

"అవును. వెంకట్రామిరెడ్డి వాళ్ళత్తను తీసుకొచ్చినట్లు."

"కమలా, ఇండియా నుంచి వాళ్ళను తీసుకురావటం, మెక్సికో నుంచి పన్లు చేసేవాళ్ళను తీసుకురావటం రెండూ సమానం అంటున్నావా?"

"నువ్వు కాదంటావా?"

"అవును."

"ఏంటీ తేడా?"

"మెక్సికో నుంచి వచ్చేవాళ్ళు అక్కడ పన్లు దొరక్క వస్తున్నారు. సులక్షణ వాళ్ళమ్మ కూతురి మీద ప్రేమకొద్దీ వచ్చింది."

"ఆమె రావటానికి కారణం ప్రేమ కావచ్చు. ఆమెను తీసుకురావటానికి కారణం మాత్రం ప్రేమ కాదు. బేబీ సిటర్ దొరక్కపోటం. సులక్షణకు ఉద్యోగం వదులుకోవటం ఇష్టం లేకపోవటం.

వెంకట్రామిరెడ్డికి కొన్నాళ్ళు సెలవు తీసుకొని ఇంట్లో సహాయం చెయ్యటానికి ఇష్టం లేక పోవటం.''

''నిజం చెప్పనా కమలా? అందమైన తల్లీబిడ్డల సంబంధంలో లేనిపోని లోపాలు చూపించటానికి ప్రయత్నం చేస్తున్నావు నువ్వు. ఎందుకు అలా చేస్తున్నావో నాకర్థంగావటంలా?''

''ఒక్కొక్కసారి ఈ అందమైన సంబంధాల వెనుక వినపడని, కనపడని బాధలుంటై,'' అంది కమల. ఎమిలీ తలపుకొచ్చి, మౌనంగా ఉండిపోయింది.

*ఇండియా టుడే వారపత్రిక - 2 జనవరి, 2001*

*కథ 2001, కథావార్షిక 2001*



# థాంక్స్...మామ్!

**''మా**మ్!'' ఇంట్లోకొస్తూనే అమ్మను పిలిచాడు డేవిడ్.

''యా...'' అంది శ్రీదేవి వంటగది లోంచి.

''మామ్! ఆకలవుతోంది,'' అంటూ వంటగదిలోకి వచ్చి గిన్నెల మూతలు తీసి తింటానికి ఏముందోనని చూశాడు డేవిడ్.

''రెండు నిమిషాల్లో రైస్ రెడీ అవు తుంది, సరే గానీ ఎక్కడికెళ్ళావు పొద్దుటే?'' అని అడిగింది శ్రీదేవి.

''ఆఫీసులో కొంచెం పనుండి వెళ్ళాను,'' అని ఓ క్షణం ఆగి,''మామ్! నేనూ, నా ఫ్రెండు జెర్రీ మూవీ కెళ్తున్నాం,'' అన్నాడు డేవిడ్.



"ఈ జెర్రీ ఎవరూ?"

"పేరు రాజేశ్వరి. అందరూ జెర్రీ అంటారు."

పాపం అంత మంచి పేరును చంపేశారనుకుంది శ్రీదేవి.

"మామ్, జెర్రీని డిన్నర్‌కి రమ్మని అడగనా?" అని సమాధానం రాకముందే "నీకు జెర్రీ తప్పకుండా నచ్చుతుందిలే," అంటూ ముఖం చూపించకుండానే తన గదివైపు వెళ్ళిపోయాడు డేవిడ్.

నాకు నచ్చటం మంచిదనే వరకూ వచ్చిందన్నమాట కథ అనుకుంది శ్రీదేవి.

ముప్ఫై సంవత్సరాల క్రితం, 'టోనీ నీకు తప్పకుండా నచ్చుతాడు,' అని తను తల్లితో అనటం గుర్తొచ్చింది.

శ్రీదేవి గాంధీ మెడికల్ కాలేజీలో మూడో సంవత్సరం చదువుతున్న రోజులవి. కాలేజీవాళ్ళు ప్రతి సంవత్సరం హైదరాబాదు చుట్టూ ఉన్న ఊళ్ళల్లో ఉచితంగా చికిత్స చేయటానికి కాంపులు నడిపేవారు. ఆ సంవత్సరం కాంపులో పీస్‌కోర్ వాలంటీర్‌గా పనిచేస్తున్న టోనీతో పరిచయమయింది శ్రీదేవికి.

టోనీ పొడుగ్గా, అందంగా, చురుగ్గా ఉండేవాడు. మాటకారి, తెలివైనవాడు. భారతదేశం అంటే ఎంతో అభిమానం. శ్రీదేవికి అతనితో కాలం గడపటం, అతను న్యూయార్కు గురించి, అమెరికా గురించీ చెప్తుంటే వినటం, అతనితో సినిమాలకూ, షికార్లకూ వెళ్ళటం మహా సంతోషం కలిగించేవి. టోనీ కూడా శ్రీదేవితో స్నేహం కలపాలని తనలో కలిగిన కోరికను దాచుకోలేదు.

ఒకరోజు తల్లితో శ్రీదేవి, "అమ్మా, టోనీ అని ఒక అమెరికా అతను ఇక్కడ పని చేస్తున్నాడు. ఈమధ్యే పరిచయమయింది. మనింటికి భోజనానికి రమ్మని పిలవనా?" అంది.

రెండు క్షణాల తర్వాత, "టోనీ నీకు తప్పకుండా నచ్చుతాడు," అని కూడా అంది.

దూర ప్రాంతాల విషయాలు తెలుసుకోవటంలో ఆసక్తి గల వసంత, "సరే," అంది.

టోనీతో ఆరోజు చాలాసేపు మాట్లాడింది వసంత. న్యూయార్కులో చదువుకుంటున్నప్పటి సంగతులూ, కనెక్టికట్‌లో ఉంటున్న తన తల్లిదండ్రుల గురించీ, ఇంకా ఎన్నెన్నో విషయాల గురించీ మాట్లాడాడు టోనీ.

వీలైతే మరోసారి భోజనానికి రమ్మంది వసంత.

రెండు నెలలు తిరక్కుండానే మరోసారి టోనీని ఇంటికి తీసుకొచ్చింది శ్రీదేవి.

ఈసారి భోజనాలవుతూనే, "మీరు అనుమతిస్తే శ్రీదేవిని పెళ్ళి చేసుకుంటాను," అని నెమ్మదిగా వసంతతో అన్నాడు టోనీ.

"మరి చదువో?" విభ్రాంతి చెందిన ఆ స్కూలు టీచర్ కూతుర్ని చూస్తూ అడిగింది.

"న్యూయార్కులో చదువుకోవచ్చుగా," అంది శ్రీదేవి.

మనసులో ఎన్నో ప్రశ్నలున్నా ఇంకేమీ అడగలేకపోయింది వసంత.



భర్త చనిపోయినప్పటి నుంచీ పంతులమ్మగా పనిచేస్తూ కూతురికి ఏ లోటూ రాకుండా పెంచిన వసంతకు కూతురు దూరమైపోతున్నట్లనిపించింది. ఆరోజు నుంచీ ప్రసన్నంగా ఉండే ఆమె ముఖంలో గంభీరత గూడు కట్టుకుంది.

టోనీ శ్రీదేవిల పెళ్ళి ఏ లోటూ లేకుండా జరిపింది వసంత. వాళ్ళు అమెరికా వెళ్ళినరోజు మద్రాసుదాకా తోడుగా పోయి సాగనంపింది.

"నువ్వు కూడా రారాదా అమ్మా?" అంది శ్రీదేవి ఏర్‌పోర్ట్‌లో.

"నా బరువు కూడా ఎందుకు టోనీకి," అంది ఉలిక్కిపడిన వసంత నిర్లిప్తంగా.

న్యూయార్కులో జీవితం సుఖంగానే గడిచిపోయింది శ్రీదేవికి. రెండు సంవత్సరాలు చదువు మానేసింది. తిరిగి చదువుకోవాలనిపించినప్పుడు ఎం.బి.బి.ఎస్. పూర్తిచెయ్యటం వీలుగాదని తెల్సింది. కొలంబియా యూనివర్శిటీలో ఫార్మకాలజీ పి.హెచ్‌డి. ప్రోగ్రామ్‌లో చేరింది.

న్యూయార్కు వచ్చినప్పటి నుంచీ తల్లి మీద, హైదరాబాదు మీద ప్రేమాభిమానాలు పెరిగాయి శ్రీదేవికి. మొదట మొదట రెండుమూడు వారాలకొకసారి ఉత్తరాలు రాసింది తల్లికి. కాని జవాబులు రావటం అరుదు. తల్లికి తీరుబడిలేక రాయలేదేమో అనుకునేది శ్రీదేవి. కాని తర్వాత్తర్వాత తల్లికీ తనకు మధ్య ఉన్న బాంధవ్యం సన్నగిల్లుతోందన్న అవగాహనకు వచ్చాక, అది బాధ కలిగిస్తూనే వచ్చింది.

పి.హెచ్.డి. డిగ్రీ రావటం, డేవిడ్ పుట్టటం ఒకే సంవత్సరంలో జరిగాయి. అప్పుడు తల్లిని అమెరికా రమ్మని గట్టిగా అడుగుతూ ఉత్తరం రాసింది శ్రీదేవి. కాని జవాబు రాలేదు. డేవిడ్‌కి ఒక సంవత్సరం దాటింతర్వాత తల్లిని చూడాలని ఎంతో కోరికగా ఉంటే తన ఉత్తరానికి జవాబు రాకపోయినా, డేవిడ్‌ని తీసుకొని హైదరాబాదు బయలుదేరింది శ్రీదేవి. మనవణ్ణి చూసింతర్వాత అమ్మ కొంత మారుతుందనీ, మళ్ళా తల్లీ కూతుళ్ళ మధ్య సంబంధం మెరుగుపడుతుందనీ ఆశించింది శ్రీదేవి.

కాని వసంత హైదరాబాదులో ఉండటంలేదు. రిటైరైంతర్వాత ఏ వూళ్ళో స్థిరపడిందో ఎవరికీ తెలియదు. ఇంటిని బంధువులెవరో ఆక్రమించుకున్నారు. నిరాశతో ఇదంతా తన తప్పేనేమో అనుకొంటూ తిరిగి న్యూయార్కు చేరింది శ్రీదేవి.

అమ్మను గురించి ఆలోచిస్తూ సతమతమౌతున్న శ్రీదేవికి మరొక దెబ్బ తగిలింది.

కారు ఏక్సిడెంట్‌లో టోనీ చనిపోయాడు. అటు ఇండియా, ఇటు అమెరికా రెండూ పోయినట్లనిపించింది శ్రీదేవికి.

ఆర్థికంగా లోటు లేకపోయినా ఎమొరీ యూనివర్శిటీలో ఉద్యోగం రాగానే అట్లాంటా చేరుకుంది శ్రీదేవి. గత ఇరవై సంవత్సరాలుగా ఇక్కడే ఉంది. డేవిడ్ ఇక్కడే బియ్యే చదివి, ఒక ఇంజనీరింగ్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. జీవితం సాఫీగానే సాగిపోతోంది శ్రీదేవికి.

తల్లితో సంబంధం తెగిపోవటం, భర్త చనిపోవటం తనను ఏకాకిని చేశాయి. డేవిడ్ తప్ప తనకు ప్రపంచంతో మరొక సంబంధం ఉన్నట్లే లేదు. తల్లి జీవితం గూడా ఇలాగే ఉండేది కదూ?

ఎంతో ప్రేమతో పెంచిన తల్లిని, తనతో తప్ప మరెవరితోనూ సన్నిహిత సంబంధం లేని తల్లిని, అనాలోచితంగా విడిచిపెట్టేసింది తను. మరి డేవిడ్‌కి ఇష్టమైన అమ్మాయి తనకిష్టం గాకపోతే? తనేం చేస్తుంది? సంబంధం తెంచుకుని, వాణ్ణి ఒంటరిని చేసి, తను ఒంటరౌతుందా? అలా చేస్తే దానివల్ల ప్రయోజనమేమిటి?

"మామ్! ఏంటాలోచిస్తున్నావ్?" అన్నాడు ఎదురుగా కూర్చొని భోజనం చేస్తున్న డేవిడ్.

ఆలోచనల్లోంచి బయటపడింది శ్రీదేవి. "ఏం లేదు. మనసు హైదరాబాదు మీదికి పోయింది," అంది శ్రీదేవి నవ్వుతూ.

డేవిడ్ కూడా నవ్వాడు.

భోజనం ముగించి బట్టలు మార్చుకొని బయటకు వెళ్ళటానికి సిద్ధంగా ఉన్న డేవిడ్‌ని చూసి, "మూవీ అయింతర్వాత రాజేశ్వరిని డిన్నర్‌కు తీసుకురా," అంది శ్రీదేవి.

డేవిడ్ ముఖం విప్పారింది.

"థాంక్స్ మామ్!" అని చాలా హుషారుగా బయటికెళ్ళాడు డేవిడ్.

*విపుల, నవంబర్ 1998*



# దూరపు కొండలు

డేనియల్ రాసిన ఉత్తరం మరోసారి చదివాడు వపులా. అంత దూరంపోయిన కొడుకు తిరిగి ఇంటికొచ్చి తనలాగే బతుకుతాడనే ఆలోచన వపులాకు ఎప్పుడూ లేదు. కానీ, ఎంత దూరానున్నా, లూహ్యా జాతి మనిషిగా, తమ ఆచారాలను పాటించేవాడిగా బతుకుతాడనే అనుకున్నాడు. ఇప్పుడు మాత్రం విచారించాల్సిందేముంది కనుక? ఇండియా అమ్మాయిని చేసుకుంటే మాత్రం లూహ్యా మనిషి కాకపోతాడా? ఎవర్ని చేసుకున్నా తన కొడుకేగా. ఏమో, చెయ్యగలిగిందేమీ లేక తననుతానే ఓదార్చుకుంటున్నాడేమో?



అయినా, ఇండియా అమ్మాయి తన కొడుకును మనిషిగా గుర్తిస్తుందా? తన కొడుకుతో ఒకే ఇంట్లో ఉంటుందా? కాపురం చేస్తుందా?... ఏమో! ఒక దూకా వాళ్ళ అమ్మాయి తన కొడుకుతో అలా జీవించటం తాను ఊహించలేడు. కానీ, ఇండియా వాళ్ళంతా చెడ్డవాళ్ళేలా అవుతారు? కెన్యాలో బతకటానికొచ్చినవాళ్ళ కంటే ఇండియాలో ఉండిపోయినవాళ్ళు మంచివాళ్ళేమో?

రిటైర్ కాకముందు నైరోబీలో పోలీసుగా పనిచేస్తున్న రోజుల్లో చాలామంది దూకావాళ్ళను చూశాడు వపులా. కానీ, ఇరవై సంవత్సరాల సర్వీసులో ఒక్క దూకావాడితో గూడా మాట్లాడలేదు. అసలు వాళ్ళుండేదే వేరేచోట. వాళ్ళ ఇళ్ళూ, గుళ్ళూ, స్కూళ్ళూ - దేంట్లోనూ కెన్యా వాళ్ళతో కలిసేవాళ్ళు గాదు. ఏదైనా కొనుక్కోవటానికి వాళ్ళ దూకాకెళ్తే తననూ, తన స్నేహితులను జంతువులను చూసినట్లు చూసేవాళ్ళు. మనదేశం వచ్చి మనల్నే ఇట్లా అవమానించేంత అహంకారం వీళ్ళకెట్లా వచ్చిందో?

అలాంటివాళ్ళ కూతురు తన కొడుకుతో కాపురం చేస్తుందా? ఏమో, తాను మళ్ళా అదే తప్పు చేస్తున్నాడేమో? ఇక్కడ బతుకుతున్న దూకావాళ్ళకూ, ఇండియాలో ఉండేవాళ్ళకూ అసలు సంబంధమే లేదేమో? ఇండియాలో ఉండిపోయినవాళ్ళు మంచివాళ్ళయి ఉండవచ్చు.

ఎవరో పిలిచినట్లు అనిపిస్తే చుట్టూ చూశాడు వపులా. జాన్. చిన్నప్పుడు డేనియల్‌తోపాటు సెకండరీ స్కూల్లో చదువుకున్నాడు. వాళ్ల ఊరివాడే. పోస్టాఫీస్‌కొచ్చినప్పుడల్లా కనిపిస్తుంటాడు.

"పాపా డేనియల్, ఉదయం ఉత్తరాలు డబ్బాల్లో వేసింది నేనే. డేనియల్ దగ్గర్నుంచి మీకు ఉత్తరం వచ్చింది. చూశాను. చదివినట్లున్నారు. ఏం రాశాడు? క్రిస్మస్ సెలవలకొస్తున్నాడంటనా?"

ఉత్తరం మడిచి జేబులో పెట్టుకున్నాడు వపులా.

"వస్తాడంట."

తన కొడుకు కూడా పోస్టాఫీస్‌లోనో, ఇంకొకదాంట్లోనో దగ్గర్లో ఉద్యోగం చేస్తున్నట్లయితే దూకా వాళ్ళమ్మాయిని చేసుకుంటాననేవాడా? మంచి లూహ్యా అమ్మాయిని చేసుకొని సుఖంగా బతికేవాడు గదూ?

"పాపా డేనియల్, ఏంటి అట్లా చూస్తున్నారు నన్ను? డేనియల్ బాగున్నాడా?"

"వాడికేం బాగానే ఉన్నాడు. ఎప్పుడొస్తున్నాడో తెలిసింతర్వాత చెప్తాలే. నేనిప్పుడు మన ఊరికి పోతున్నా. మీ అమ్మకేమన్నా చెప్పమంటావా?"

"లేదు పాపా డేనియల్. ఏముంది చెప్పటానికి? కనపడితే బాగానే ఉన్నానని చెప్పండి."

"సరే."

## 2

మరోసారి ఉత్తరం చదివాడు గోవిందాచారి. ఇంటికొచ్చి, ఇలా పెళ్ళి చేసుకోదల్చుకున్నాను అని చెప్తే మీరు అసలు ఒప్పుకోరని ఇలా ఉత్తరం రాస్తున్నానని రాసింది శాంతి.



కన్నీళ్ళు ఆపుకోలేకపోయాడు గోవిందాచారి. చదువుకోసం అంత దూరం పంపకపోతే బాగుండేదేమో? నాలుగైదు సంవత్సరాల నుంచీ ఏదో ఉపద్రవం వస్తుందనే అనుమానం ఉంది తనకు. కానీ, ఏమీ చెయ్యలేకపోయాడు.

ఇరవై సంవత్సరాల క్రితం సుభద్రనూ, రెండు సంవత్సరాల శాంతినీ తీసుకొని న్యూ ఆర్లియన్స్ వచ్చాడు గోవిందాచారి. దాదాపు పది సంవత్సరాలు ఇక్కడ తెలుగువాళ్ళు ముఖ్య పాత్ర వహించి కట్టించిన దేవాలయంలో పూజారిగా పనిచేశాడు. కానీ, రానురానూ తన మంచితనమే తనకు కష్టాలు తెచ్చిపెట్టింది. నగరంలో తెలుగువాళ్ళే కాకుండా మిగతా భారతీయులు కూడా తమ స్వగృహాల్లో వ్రతాలూ, పూజలూ చేయించటానికి పిలవటం మొదలుపెట్టారు. అడిగినవాళ్ళతో వీలుకాదని గానీ, టైము లేదనిగానీ ఎప్పుడూ అనలేదు గోవిందాచారి. ఎలాగూ దేవాలయం వాళ్ళు పూజారికి ఇచ్చే జీతం చాలా తక్కువ. పైగా అద్దె లేకుండా ఇల్లు ఏర్పాటు చేస్తామన్నారేగానీ, తీరా ఈ దేశం వచ్చాక అలాంటిదేమీ లేదన్నారు. మరి బైట పూజలు చేయించి నాలుగు రాళ్ళు సంపాదించుకుంటే తప్పేముందీ అనుకున్నాడు గోవిందాచారి. కానీ, కొన్నాళ్ళు పోయిన తరువాత ఊపిరి పీల్చుకోవటానిక్కూడా సమయం దొరక్కుండా పోయింది. దేవాలయం పని శ్రద్ధగా చేయటంలేదని నిందించారు ట్రస్టీలు. ఇక మరో మార్గంలేక ఎలాగైనా బయటి సంపాదనే ఎక్కువగా ఉండటం వల్ల దేవాలయం ఉద్యోగం మానేశాడు. ఆ తర్వాత ఒకటి రెండు సంవత్సరాలు బాగానే గడిచిపోయాయి గానీ, రానురానూ అసలు తీరికే లేకుండాపోయింది. ఒక్కోసారి...

"తొందరగా కానివ్వండి. అప్పుడే పదిన్నరయింది," అంటూ గదిలోకొచ్చిన సుభద్ర ఆచారి ముఖం చూసి భయపడింది. "ఏమయిందీ? ఎందుకూ అలా ఉన్నారు? ఎవరిదీ ఉత్తరం?"

కళ్ళ వెంట బొటబొటా నీళ్ళొచ్చాయి ఆచారికి. "ఏమవుతుందీ. నీకూ, దానికీ క్షణం పడక పోవటం వల్లే కదూ అంత దూరం పంపించాం దాన్ని చదువుకు?"

"అవున్లేండీ. కూతుళ్ళను పెంచటం మీకు చాతయ్యిందీ, నాకు చేతగాలా. ఇప్పుడేమయింది మరి?"

"ఏమవుతుందీ, పెళ్ళి చేసుకుంటుందట... ఒక నల్లవాణ్ణి."

"అయ్యో రామా, మనమేం తప్పు చేశాం. మనకెందుకూ భగవంతుడిలాంటి పరీక్ష పెడుతున్నాడు?" పమిట చెంగు నోటికి అడ్డంగా పెట్టుకొని పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నం చేస్తోంది సుభద్ర.

రెండు క్షణాలు మౌనంగా ఉండిపోయాడు గోవిందాచారి. ఏదో సంపన్నమైన దేశం గదా, ఆ శ్రీమన్నారాయణుడి సేవ చేసుకుంటూ నాలుగురాళ్ళు సంపాదించుకోవచ్చు అనుకొని ఇంతదూరం వచ్చాడుగానీ, తరతరాలుగా మర్యాదగా, గౌరవంగా నిలబడ్డ వంశం ఇలా నాశనమైపోతుందని ఎప్పుడూ అనుకోలేదు. ఈ పెళ్ళి జరిగిపోతే దేవుడిపాలెంలో తమ కుటుంబం గురించి ఏం చెప్పుకుంటారో? 'కులం భ్రష్టు పట్టించుకోవడానికి అంతదూరం పోవటం ఎందుకూ? దరిద్రపు పన్లు చెయ్యటానికి

ఇక్కడ మార్గాలు లేకనా?' అంటారేమో? ఇక్కడి తెలుగువారు తనను మునుపటిలాగే గౌరవంగా చూస్తారా? పెళ్ళిళ్ళకూ, పూజలకూ సలహాలు అడగటానికి వస్తారా? 'నీ కూతురే నల్లోణ్ణి చేసుకుంది. ఇక మాకేం సలహాలిస్తారులే' అంటారా? సాటి తెలుగువారికి ముఖం చూపించటం ఎట్లా?

"ఏంటీ మాట్లాడరూ? డిట్రాయట్ పోయి దాన్ని తీసుకురండి. ఇంతవరకు వెలగబెట్టిన చదువు చాలని చెప్పండి. పెళ్లి చేసుకోవటం అంతా దాని ఇష్టమేనా ఏంటి?"

"రాను ఫో అంటే ఏం చేస్తాం? ఆ నల్లవాడితో సంబంధం ఎంతవరకొచ్చిందో. విషయం చేతులు దాటిపోయిందేమో. మన వంశం అప్పుడే మట్టిలో కలిసిపోయిందేమో," కళ్ళు తుడుచుకున్నాడు గోవిందాచారి.

"చిన్నప్పట్నుంచీ దాన్ని ఆడపిల్లగా పెంచండీ అని నేను నెత్తిన నోరు పెట్టుకొని అరుస్తూ వచ్చానా, లేదా? మీరేమో ఎప్పుడూ దాన్ని వెనకేసుకుంటూ వస్తిరి మరి. ఇప్పుడు విచారించి ప్రయోజనం ఏముందీ! అయినా ఫోను చేసి మాట్లాడరాదూ? విషయం పూర్తిగా తెలియకుండానే కొంప మునిగిందనుకోవటమెందుకూ?"

"మాట్లాడే సమయం దాటిపోయిందనుకుంటా. ఆ అబ్బాయిది కెన్యా దేశం అట. ఈమధ్యే చదువు పూర్తయి ఉద్యోగంలో చేరాడట. ఎవరికి ఇష్టం అయినా కాకపోయినా స్నేహితుల సాక్షిగా వచ్చే నెల పదో తారీఖున రిజిస్టర్ మానేజ్ చేసుకుంటారట. ఇంకా ఏముందీ ఫోన్లో మాట్లాడి తెలుసుకోవాల్సింది?"

"అయ్యో, అంత దూరం వచ్చిందా? నాకు చిన్నప్పట్నుంచీ తెలుసు. ఇది మన కుటుంబాన్ని నాశనం చేస్తుందని. నా మాట మీరెప్పుడన్నా వింటేగదూ. ఎప్పుడూ దాన్ని వెనకేసుకుంటూ వస్తిరి. ఇప్పుడు అనుభవించండి," రుసరుసలాడుతూ గదిలోంచి వెళ్ళిపోయింది సుభద్ర.

ఏం చెయ్యాలో తెలియటం లేదు ఆచారికి. ఫోన్ చేసి 'ఈ పెళ్ళి నాకు ఇష్టమే,' అని చెప్పాల్నా? తాను అబద్ధం ఆడుతున్నాడని శాంతికి వెంటనే తెలిసిపోదూ? 'ఈ పెళ్ళి నాకు ఇష్టం లేదు. నువ్వు ఆ నల్లవాణ్ణి చేసుకోవటానికి వీల్లేదు' అని చెప్తే? ఇష్టం ఉన్నా లేకపోయినా తాను తప్పకుండా ఈ పెళ్ళి చేసుకుంటుందని అప్పుడే రాసిందిగా. మరి పెళ్ళిని వ్యతిరేకించి ప్రయోజనం?

ఒకసారి డిట్రాయట్ పోయి ఆ అబ్బాయిని చూసొస్తే బాగుంటుందేమో? ఎట్లా ఉంటాడో? మరీ ఆఫ్రికా నల్లవాడట. తనకు అసలు ఇక్కడి నల్లవాళ్ళే తెలియరు. ఒక్కడితో గూడా పరిచయం లేదు. పక్క వీధిలో కూరగాయలు కొనుక్కోవటానికెళ్ళే సూపర్ మార్కెట్లో కొందరు నల్లవాళ్ళు కనిపిస్తుంటారు. లావుగా, ఎత్తుగా ధ్వజస్తంభాల్లాగా ఉంటారు. ఆముదం రాసుకుంటారేమో తలకి. జిడ్డు జిడ్డుగా ఉంటాయి తలలు. పైగా పూసలూ అవీ వేసుకొని లంబాడీల్లాగా ఉంటారు. ఈ కేన్యా అబ్బాయి కూడా వీళ్ళలాగే కదూ ఉండేది. పైగా అతని మాటలు తనకు అర్థమవుతాయో లేదో? ఎప్పుడన్నా కార్ రిపేర్‌కి ఆ హోండా డీలర్‌షిప్‌కెళ్తే అక్కడి నల్ల మెకానిక్ భాషే అర్థంగాదు తనకు. వాడి ఇంగ్లీషేంటో, వాడేంటో భగవంతుడికే తెలియాలి. ఇక అల్లుడి - ఆ నల్లపిల్లాడి భాష తనకు అర్థమవుతుందా?



"ఏంటీ ఇంకా అలాగే కూర్చున్నారు? శ్రీనివాసరావుగారింట్లో పూజ చేయిస్తానన్నారుగా," అంటూ గదిలోకొచ్చింది సుభద్ర.

"అవును. తయారవుతాను. తప్పేదేముంది," జాబు మడిచి జేబులో పెట్టుకున్నాడు ఆచారి.

# 3

వపులా బుంగోమా నుంచి బస్సులో ఊరు చేరేసరికి దాదాపు రెండు గంటలయింది.

ఇంట్లోకి రావడంతోనే "ఉత్తరాలేమైనా వచ్చాయా?" అని అడిగింది నెకెశా. సోమవారం పొద్దుటే బుంగోమా వెళ్ళి కొడుకుల దగ్గర నుంచి ఉత్తరాలేమైనా వచ్చాయేమోనని చూడటం ఇప్పుడు మామూలైంది.  చెప్పకుండా వెళ్ళినా పోస్టాఫీసుకే పోయుంటాడులే అనుకుంది నెకెశా.

"నీ కొడుకు దగ్గర్నుంచొకటొచ్చింది."

"చిన్నపిల్లకి జ్వరం తగ్గిందటనా?" రెండు రోజులు ఇంటి దగ్గరుండి మొన్ననే కొడుకు పీటరూ, కోడలు ఏంజెలా, మనుమరాలు జెన్నీ తిరిగి నైరోబీ వెళ్ళారు. పీటర్ అక్కడ పోలీసు ఉద్యోగం చేస్తున్నాడు. ఒకప్పుడు వపులా పనిచేసిన  పోలీస్‌స్టేషన్లోనే.

"పీటర్ దగ్గర్నుంచి కాదు. డేనియల్ దగ్గర్నుంచి."

లోలోపలే నవ్వుకుంది నెకెశా. చదువు మాని పోలీసు ఉద్యోగంలో చేరినప్పటి నుంచి పీటర్ని నీ కొడుకు అంటూ వచ్చాడు వపులా. చదువుకుంటానని ఏదో స్కాలర్‌షిప్ సంపాదించుకొని అమెరికా వెళ్ళిన డేనియల్ మాత్రం తన కొడుకు. ఇప్పుడు డేనియల్ ఏదో ఇష్టం కాని పని చేసినట్లున్నాడు. అందుకే నీ కొడుకు అంటున్నాడు

"ఏం జేశాడు డేనియల్? సెలవలకొస్తున్నాడంటనా?"

"వస్తాడంట. డిట్రాయట్లో ఇండియా అమ్మాయెవరో తెలుసంట. ఆ అమ్మాయిని చేసుకుంటాడంట."

"అయ్యో, ఆ దూకావాళ్ళకు లూహ్యా రాదుగా! నేనెట్లా మాట్లాడతానా పిల్లతో?" కొడుకు తన పరిధిలోంచి దూకి బైటకు పరిగెత్తిపోయినట్లనిపించింది నెకెశాకు.

"అసలు ఇక్కడికొస్తుందో లేదో ఆ అమ్మాయి. ఇక్కడ కొస్తేనే గదా నీతో మాట్లాట్టం, మాట్లాడక పోవటం."

"మరి డేనియల్ని చేసుకుంటే ఇక్కడికి రాకుండా ఇంకెక్కడికి పోతుందా పిల్ల?"

"డేనియలొస్తే గదూ ఆ పిల్ల రావటానికి. అక్కడే ఒక పెద్ద చదువు చెప్పేచోట ఉద్యోగం ఇస్తావన్నారంట."

"అయితే, ఆ పిల్ల మనకు కనబడను గూడా కనబడదన్నమాట?"

"ఇందాక మాట్లాడాలన్నావు. ఇప్పుడు కనబడితే చాలు అంటున్నట్లున్నావు?" అన్నాడు వపులా చిరునవ్వొకటి విసిరేస్తూ.

“కనబడితే ఎంత, కనపడకపోతే ఎంత? నాకసలు ఆ దూకావాళ్ళంటేనే ఇష్టం లేదు. శుభ్రంగా నసియెండాకొచ్చి లూహ్యే పిల్ల నొకదాన్ని చేసుకొని సుఖంగా ఉంటే మంచిదని రాయి.”

“తెలివితేటలు సంపాయించుకొని ఎదిగిపోయినవాణ్ణి మాకు తెలిసిన ప్రపంచంలోనే నువ్వు కూడా బతకాల్సిందేనంటే ఎట్లా? వాడి బతుకు వాణ్ణి బతకనివ్వాలి కదూ?”

“నువ్వు చెప్పేది బాగానే వుంది! ఆ దూకావాళ్ళ పిల్ల మనోణ్ణి మనిషిగా బతకనిచ్చుద్దా? వాళ్ళు మనల్ని మనుషుల్లాగా చూస్తన్నారా? ఎప్పుడన్నా దూకా కెళ్ళి సరుకులు కొనుక్కురా నీకే తెలుసుద్ది.”

“ఈ పిల్ల దూకావాళ్ళ పిల్ల కాదు. అసలు ఈ దేశమెప్పుడూ చూడను గూడా చూడలేదంట. తల్లిదండ్రుల్తో ఇండియా నుంచి నేరుగా అమెరికా వచ్చిందంట.”

“అయితే మాత్రం. ఈ దూకావాళ్ళు కూడా నేరుగా ఇండియా నుంచేగా వచ్చారు. వాళ్ళ బుద్ధే అంత. తెల్లోళ్ళ బూట్లు తుడిసి ఇక్కడకు చేరుకున్నారు. మనల్ని మాత్రం అసలు మనుషులను కోరు.”

“ఇక్కడి వాళ్లు ఎట్లాంటివాళ్ళయినా ఆ పిల్లకు మనవాడు ఇష్టమయితేనేగా చేసుకునేది. ఇష్టం లేకపోతే ఎందుకు చేసుకుంటుంది? వాళ్ళకు ఇష్టమయిన తర్వాత మనం కాదంటే ఎట్లా?”

“ఏమో,” తన ప్రపంచం చాలా చిన్నదయిపోయినట్లనిపించింది నెకెశాకి.

## 4

శ్రీనివాసరావుగారింట్లో పూజ జరిపించి తిరిగి వచ్చేసరికి దాదాపు మూడుగంటలైంది. దోవలో గోవిందాచారి ఆలోచనలన్నీ గాయత్రి మీద ఉండిపోయాయి. శాంతి గురించి ఇక చేసేదేమీ లేదు. కనీసం గాయత్రి విషయంలోనైనా జాగ్రత్తపడాలి. తొందరగా ఏదైనా సంబంధం చూడాలి.

ఇంట్లోకొస్తూనే, “ఇదుగో గాయత్రి వచ్చిందా కాలేజీ నుంచి?” అని అరిచాడు ఆచారి. సుభద్ర ఎదురుగా లేకపోయినా.

ఎదురొచ్చి మంచినీళ్ళ గ్లాసు చేతికిస్తూ, “వచ్చింది,” అంది సుభద్ర.

“తన రూమ్‌లో ఉందా?”

“లేదు. భోజనం చేసి ఎవరో స్నేహితురాలి ఇంటికి వెళ్ళొస్తానని పోయింది,” అని సమాధానం చెప్పి, “పూజ బాగా జరిగిందా,” అని అడిగింది సుభద్ర.

“బాగానే జరిగింది. శాంతి సంగతి చెప్పావా గాయత్రికి?”

“దానికి చెప్పాల్సిన అవసరం ఏముందీ. మనకంటే ముందే అన్ని విషయాలు తెలుసు లాగుంది. గంటల తరబడీ ఆ ఫోన్‌లో మాట్లాడుతూ ఉంటుందిగా అక్కతో. దానికి తెలియకుండా ఉంటుందా మన పిచ్చిగానీ.”



“మరి మనతో ఒక్క మాటన్నా చెప్పలేదేం? ముందే తెలిస్తే ఇంత దూరం రాకముందే ఆపగలిగే వాళ్ళమేమో?”

“మీకేదో పిచ్చిగానీ, వాళ్ళ రహస్యాలు మనకు చెప్తారా వాళ్ళు. ఏ ప్రపంచంలో ఉంటున్నారు మీరు? అది సరే. కొంచెం కాఫీ తీసుకురానా?”

“ఇప్పుడే వాళ్ళింట్లో తాగొచ్చాన్లే. మరి అక్క ఆ నల్లవాణ్ణి చేసుకోవటం గాయత్రికి ఇష్టమేనా మరి?”

“ఇష్టమో, కాదో నాకెందుకు చెప్తుందీ? ఆ పిల్ల ఒకటి రెండుసార్లు ఆ అబ్బాయితో ఫోన్లో మాట్లాడిందట. అబ్బాయి పేరు డేనియల్ అట. చాలా మంచివాడు అంటుంది. పైగా మీరూ నేనూ రేసిస్టులమట. ఆ పిల్లవాడు తెల్లవాడయితే మీరు ఇంతగా ఏడుపు ముఖాలు పెట్టేవాళ్ళేనా అని అడుగుతుంది.”

“తల్లిదండ్రులతో గౌరవంగా మాట్లాడటం కూడా చేతగాదు ఈ కాలం పిల్లలకు. ఆ కాలేజీలో ఏం నేర్పుతున్నారో ఏమో,” అని గొణుక్కున్నాడు ఆచారి. కానీ, గాయత్రి మాటల్లో కొంత నిజం లేక పోలేదు. అబ్బాయి తెల్లవాడయితే ఇంత ఇబ్బందిగా ఉండేది కాదు. తెల్లవాళ్ళకు ఎట్లా లేదన్నాకొంచెం సంస్కారం, పరువు ప్రతిష్ఠలుంటాయి.

బట్టలు మార్చుకొని వంటగదిలోకి వచ్చాడు ఆచారి. “సుభద్రా! శ్రీనివాసరావుగారింట్లో ఒకాయన తో పరిచయమైంది. ఆయన కార్డు కూడా ఇచ్చాడు. వాళ్ళింట్లో సత్యనారాయణ వ్రతం చేయిస్తానన్నాడు. వాళ్ళబ్బాయికి హైదరాబాద్‌లో ఎక్కడో ఎన్.ఆర్.ఐ. కోటాలో మెడిసిన్లో సీటొచ్చిందట. నాకొక ఆలోచ నొచ్చింది. ఏదో దూరపు కొండలు తెలుపని అంటారు. ఆశపడి మన ఖర్మకొద్దీ ఇంత దూరం వచ్చాం. ఒక కూతుర్ని ఎలాగూ ఈ దేశానికి అర్పించాం అనుకుందాం. గాయత్రి విషయంలోనైనా జాగ్రత్తపడితే బాగుంటుంది. మీ అన్నయ్యకు హైదరాబాద్‌లో మంచి పలుకుబడి ఉంది. ఏదో ఆయనను బతిమాలు కొని గాయత్రికి ఎన్.ఆర్.ఐ. కోటాలో ఏదో మెడికల్ కాలేజీలో ఒక సీటు సంపాదించుకుంటే పుణ్యం, పురుషార్థం రెండూ కలిసొస్తాయి. అక్కడే ఏదో ఒక మంచి సంబంధం చూసి కల్యాణం జరిపిస్తే మన బాధ్యత తీరిపోతుంది. ఏమంటావు? మీ అన్నయ్యగారితో ఒకసారి ఫోన్ చేసి మాట్లాడరాదూ?”

“మీ తెలివితేటలకు అసలు అంతున్నట్లు లేదు! ఇక్కడ పుట్టి పెరిగిన అమ్మాయి ఇండియా వెళ్తుందా చదువుకోవటానికి?”

“ఎందుకు వెళ్ళగూడదూ? ఏం తక్కువ ఇండియాలో? అక్కడ చదువుకొని వచ్చినవాళ్ళకు ఇక్కడ గొప్ప గొప్ప ఉద్యోగాలు రావటంలా?”

“ఉద్యోగాలు రావనిగాదు. ఇక్కడి పద్ధతులు వేరు. అక్కడి పద్ధతులు వేరు. ఇక్కడ పెరిగిన పిల్లలకు ఇండియాలో పద్ధతులకు అలవాటుపడటం కష్టం.”

“అక్కడ పుట్టి పెరిగినవాళ్ళు ఇక్కడి పద్ధతులకు అలవాటుపడటంలా? ఎవరి సంగతో ఎందుకు. మనం అలవాటుపళ్ళా?”

"మనమా? ఏం అలవాటుపడ్డాం మనం? పూజలూ, పునస్కారాలూ తప్ప మీకు వేరే ప్రపంచం తెలియదు. బావిలో కప్పలాగా ఈ ఇల్లూ, ఆ సూపర్‌మార్కెట్టూ తప్ప నాకు మాత్రం ఏం తెలుసు. ఇక్కడుంటున్నామేగానీ, దేవుడిపాలేనికీ, ఇక్కడికీ ఏంటి తేడా?"

"నువ్వనేది నాకు అర్థం కావటంలా. దేశం కాని దేశం వచ్చి కూడా మన ఊరిలోలాగే బతకటం అంటే గొప్ప కదూ? మరి అలవాటుపడటం అంటే ఏంటనీ నీ ఉద్దేశం? ఇక్కడివాళ్ళలాగా బతకటమా?"

"ఏమో? ఇక్కడివాళ్ళ సంగతి నాకు మాత్రం ఏం తెలుసూ? వాళ్ళ పిల్లల్ని ఎట్లా పెంచుతారో ఏమో. నేనేమో దేవుడిపాలెంలోలాగానే పిల్లల్ని పెంచాలని చూశాను. అందుకేనేమో ఒక కూతుర్ని పోగొట్టుకున్నాం. రెండోదాన్ని కూడా దూరం చేసుకుంటామేమోనని నా భయం," దుఃఖం పొంగుకొచ్చింది సుభద్రకు.

"నేను అంటుంది గూడా అదే సుభద్రా. ఏదో దూరపు కొండలు తెలుపంటారని..."

"మీకు ఈ తెలుపు చాదస్తం ఎక్కువవుతోంది రోజురోజుకూ. దూరపు కొండలు తెలుపు అనరు, నునుపు అంటారు."

"ఏదో అంటారులే. ఏమంటే ఏంగానీ, ఎటూ శాంతి మన చేతులు దాటిపోయింది. కనీసం గాయత్రికయినా ఇండియాలో ఎన్.ఆర్.ఐ. కోటాలో..."

"అవును. ఎన్.ఆర్.ఐ. కోటాలో సీటొచ్చి అక్కడ దానికి ఇష్టం వచ్చిన కులం తక్కువవాడిని ఎవర్నన్నా చేసుకుంటే మన జీవితాలు ధన్యం అవుతాయి."

విస్తుపోయి నోరు తెరుచుకున్నాడు ఆచారి. ఈమెను అర్థం చేసుకోవటం ఎలా? "సరే నీ ఇష్టం. ఒక బిడ్డను ఎటూ ఈ దేశానికి అర్పించాం. ఏదో మనదేశంలోనే మామయ్యగారింట్లో ఉండి చదువుకుంటే, అక్కడే ఏదన్నా సంబంధం కుదిరితే ఒక్క బిడ్డ అయినా మనకు దక్కుతుంది అనుకున్నాను. ఇక నువ్వే కాదంటే నేనేం చేస్తాను?"

"కాదు అనటంలా నేను. మీకు ఇక్కడున్నప్పుడు అక్కడి కొండలు నునుపూ, అక్కడున్నప్పుడు ఇక్కడి కొండలు నునుపూ అంటున్నాను."

"సరే నీ ఇష్టం," అని తలవంచుకుని కూర్చున్నాడు ఆచారి. ఒక్కరోజులో సుభద్ర ఆలోచనల్లో ఎంత మార్పు!

"మరి శాంతి విషయంలో ఆ నల్లవాడితో పెళ్ళికి ఒప్పుకుందామంటావా?"

"ఒప్పుకోక ఏం చేస్తాం? కూతుర్ని పోగొట్టుకుంటామా?"

కూతుర్ని దూరం చేసుకోవటం కష్టమా? నల్లవాణ్ణి అల్లుడుగా స్వీకరించటం కష్టమా? ఆలోచించసాగాడు ఆచారి.

*ఇండియా టుడే, నవంబర్ 2002*



# ముసుగు లోంచి...

కిటికీలోంచి ముఖం మీద పడుతున్న వెచ్చటి వెలుతురు రామారావుని నిద్ర లేపింది. టేబుల్ మీద ఉన్న గడియారం వైపు చూసాడు. అప్పటికే తొమ్మిది దాటింది. ఉదయ్‌ని చడీ చప్పుడు చెయ్యకుండా సిద్ధం చేసి స్కూలుకు పంపి ఉంటుంది రాధ. లేచి వంటగదిలో కెళ్ళి కూరగాయలు తరగుతున్న భార్య చుట్టూ చేతులు బిగించాడు రామారావు. బాగా నిద్ర పట్టిందా అని అడిగిందామె. ఆమె మెడ మీద తల ఆనించి ఊ అన్నాడు అతను. ముఖం కడుక్కోని రా కాఫీ కలుపుతాను అని అతన్ని బాత్‌రూంకి సాగనంపిందామె.



కాఫీ తాగుతూ బ్రేక్‌ఫాస్ట్ టేబుల్ దగ్గర కూర్చున్నాడు రామారావు. బయట సైరన్లమోత వినిపిస్తుంది. కిటికీ దగ్గరకెళ్ళి చూశాడు. వీధిలో అంతా మామూలుగానే ఉంది. కానీ దూరాన సైరన్ల మోత ఎక్కువవుతుంది. ఎక్కడో పెద్ద ఏక్సిడెంట్ జరిగి ఉంటుంది. లేకపోతే ఏదో పెద్ద బిల్డింగులో నిప్పు పడి ఉంటుంది. వార్తల్లో ఏమైనా చూపిస్తున్నారేమోనని టివి పెట్టాడు రామారావు. మామూలుగా చూసే ఏబిసి స్టేషన్‌లో వార్తలు చదివే పీటర్ జెన్నింగ్స్ ఇంత ఘోరమైన పని ఎవరు చేసి ఉంటారు? అని ఎవర్నో అడుగుతున్నాడు. వారి వెనుక వరల్డ్ ట్రేడ్‌సెంటర్ కాలిపోతోంది. రెండు విమానాలొచ్చి రెండు భవనాలను గుద్దినట్లూ, విమానాల్లోని ప్రయాణీకులూ, ఆ భవనాల్లో పనిచేస్తున్న ఉద్యోగులూ, చుట్టుపక్కల పెద్దపెద్ద భవనాల్లో పనిచేస్తున్న వారిలో కొందరూ, ఈ టెర్రరిస్ట్ ఘాతుకంలో మరణించారని చెప్తున్నాడు జెన్నింగ్స్. ఎవరు చేసి ఉంటారు ఈ ఘాతుకం? ఎవరో ఇంకా తెలియదు కాని, విమానాలు మామూలు పాసెంజర్ జెట్స్ అనీ, వాటిని హైజాక్ చేసి ట్రేడ్‌సెంటర్‌ని గుద్దారనీ చెప్తున్నాడు. ఈ దాడిలో చనిపోయినవారి సంఖ్య వేలలో ఉండవచ్చు అంటున్నాడు. రాధను వెంటనే టివి దగ్గరకు రమ్మని పిలిచాడు రామారావు. ఇద్దరూ మంత్రజాలంలో పడిపోయినవాళ్ళలాగా టీవీ చూస్తూ నోటి మీద చెయ్యి పెట్టుకుని అలాగే నిలబడ్డారు. అంతలో పరుగెత్తి రెండో అంతస్తులో ఉన్న బెడ్‌రూమ్‌లోకి పోయి కిటికీ గుండా మన్‌హటన్ వైపు చూశాడు రామారావు. దాదాపు ఇరవై మైళ్ళ దూరాన ఉన్న ట్రేడ్ సెంటర్ నుంచి పొగ ఆకాశాన్ని అంటుతుంది. చుట్టుపక్కల అంతా పొగలో మునిగిపోయినట్లు కనిపిస్తుంది. అమెరికా వచ్చిన తొలిరోజుల్లో ఒకసారి తనూ, రాధా ట్రేడ్ సెంటర్ చివరి అంతస్తు దాకా వెళ్ళి చుట్టూ ఉన్న న్యూయార్కు నగరాన్ని చూశారు. తన చుట్టూ మంటలు రేగుతున్నట్లనిపించింది రామారావుకి. ఏం చెయ్యాలో తెలియక మళ్ళా కిందికొచ్చి టీవీ చూస్తూ రాధ పక్కన నుంచున్నాడు.

విమానాలను హైజాక్ చేసిందెవరో ఇంకా తెలియదని అంటున్నాడు జెన్నింగ్స్. అరబ్ దేశాల వాళ్ళు కావచ్చు. కాని, ఇంతకుముందు ఓక్లహోమాలో జరిగిన ఘాతుకానికి కారణం వాళ్ళేనని అందరూ ముందుగానే అనుకున్నారు. తర్వాత విచారణలో అమెరికా తెల్లవాడే ఒకడు దానికి కారణం అని తేలింది. కాబట్టి ప్రస్తుత ఘాతుకం వెనుక ఉన్నవారెవరో ఖచ్చితంగా తెలిసిందాకా అరబ్ దేశాల వారి మీద నేరం మోపటం మంచిది కాదు అంటున్నాడు. కారణం ఎవరైనా ఇంత ఘోరమైన టెర్రరిస్ట్ చర్యకు ఇంత దగ్గరగా ఉండటం రామారావుకి భయం కలిగించింది. ట్రేడ్ సెంటర్ మీదే కాక వాషింగ్‌టన్‌లో పెంటగాన్ మీదా, పెన్సిల్వేనియాలో మరోచోటా కూడా విమానాలు గుద్ది చాలామందిని చంపారట. ఇంకా ఎన్ని విమానాలు హైజాక్ చేశారో? ఇంకా ఎంతమందిని చంపుతారో? ఒకవేళ వైట్‌హౌస్ మీద దాడి చేస్తారేమోనన్న భయంతో ప్రెసిడెంట్ బుష్‌ని ఎక్కడకో ఒక రహస్యస్థలానికి తీసుకెళ్ళారట.



"రామూ, స్కూలుకెళ్ళి ఉదయ్‌ని తీసుకొద్దామా?" అని అడిగింది రాధ, పిల్లవాడెలా ఉన్నాడో, ఆ స్కూల్లో ఎంత గందరగోళం జరుగుతుందోనన్న ఆదుర్దాతో. స్కూలుకు ఫోన్ చేశాడు రామారావు. కాని ఫోన్ పనిచేస్తున్నట్లు లేదు. తన ఆఫీసుకి ఫోన్ చెయ్యటానికి ప్రయత్నం చేశాడు. అక్కడ కూడా ఫోన్ మోగటం లేదు. ఏం జరుగుతుందో అర్థం కాలేదు రామారావుకి. పైకెళ్ళి రెండు నిమిషాల్లో డ్రెస్ చేసుకుని వచ్చాడు. స్కూలుకెళ్ళి ఉదయ్‌ని తీసుకొద్దామని ఇద్దరూ బయల్దేరారు కారులో.

అప్పటికే వీధుల నిండా కార్లు నిండిపోయాయి. మైలు దూరంలో ఉన్న ఎలిమెంటరీ స్కూలు చేరటానికి దాదాపు గంటన్నర పట్టింది. అప్పటికే చాలామంది తల్లిదండ్రులు వాళ్ళ పిల్లల కోసం వచ్చారు. ఉదయ్‌ని తీసుకుని ఇంటి ముఖం పట్టారు రామారావు, రాధ.

కారు రేడియోలో ఎవరో టెక్సాస్ యూనివర్సిటీలో ప్రొఫెసరట, మాట్లాడుతున్నాడు. మనం ప్రపంచం అంతటా నాటిన విత్తనాలు మొక్కలై, చెట్లై, ఫలితాలను మనకే అందిస్తున్నాయి అంటున్నాడు. ఇతర దేశాల్లో మనం ఇష్టమొచ్చినట్లు ప్రభుత్వాలను పడగొట్టటం, లక్షలమందిని చంపటం ఇన్నాళ్ళూ చేస్తూ వచ్చామే, వాళ్ళ కుటుంబాలకు ఎంత బాధ కలిగి ఉంటుందో ఇప్పుడు మనకు అర్థం అయితే ఈ ఘాతుకం వల్ల కొంతైనా మంచి జరుగుతుంది అంటున్నాడు.

"నిజమే గదా? వీళ్ళు వియత్నాంలో, కొరియాలో, చిలిలో, ఇండొనేషియాలో అంతమందిని చంపారు గదా, మరి ఆ దేశాలవాళ్ళకు కోపం రాదా? ఎప్పుడూ ఇతర దేశాల్లో యుద్ధాలు చేసేవాళ్ళకి, యుద్ధం ఇంటిదాకా వస్తేగాని దాని బీభత్సం అర్థం కాదు," అంది రాధ అకస్మాత్తుగా. నమ్మలేకపోయాడు రామారావు. ఎంత ధైర్యంగా మాట్లాడుతుంది రాధ! తన అభిప్రాయం కూడా అదే. పరాయివాళ్ళు ఎవరూ లేకపోయినా, తలుపులు మూసి ఉన్న తన కారులోనే అయినా, అంత బాహాటంగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసే ధైర్యం తనకు లేదు.

రామారావు, రాధా ఇద్దరూ వామపక్ష భావాలున్న కుటుంబాల నుంచి వచ్చినవారే. కాకపోతే రాధ తండ్రి వ్యవసాయం చేసుకునేవాడు. ఉన్నది ఉన్నట్లు కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడే స్వభావం ఆయనది. రాధకు వాళ్ళ నాన్న అలవాట్లూ, మాట్లాడే తీరూ వచ్చాయి. రామారావు తండ్రి ఒక దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేసేవాడు.

## 2

సెప్టెంబర్ పదకొండు తర్వాత కొద్దిరోజుల్లోనే ఆనాటి భయంకరమైన దాడులు అరబ్బు దేశాల వారే చేశారని నిర్ధారణ జరిగింది. టీవీలో, వార్తాపత్రికల్లో, రేడియోలో అరబ్బుల గురించి తీవ్రమైన చర్చ జరిగింది. ఈదేశ సంపద, ఇక్కడి ప్రజల స్వేచ్ఛ, ఇక్కడి స్త్రీలకు ఉన్న స్వతంత్ర జీవితాలు అరబ్బులకు కడుపుమంట, అసూయ కలిగిస్తున్నాయనీ, సెప్టెంబరు పదకొండున జరిగిన దాడులకు అవే కారణాలు అనీ తేల్చారు టీవీ మేధావులు.

ఒకరోజు రామారావు ఆఫీసు నుంచి ఇంటికి వచ్చి కారు దిగుతుండగానే పక్కింటి అతను పలకరించాడు. ఉభయకుశలోపరి తర్వాత మీకూ మాకూ విరోధం ఒక గుంపుతోనే అన్నాడు. అర్థం కాలేదు రామారావుకి. ఏం జరిగిందని విచారిస్తే, ఇంతకు ముందే వార్తలు విన్నాననీ, కాశ్మీరులో ముస్లిం టెర్రరిస్టులు హిందువులను చంపారనీ చెప్పాడు. అదేదో కొత్త వార్తలాగా అనిపించలేదు రామారావుకి. 'అలాగా?' అన్నాడు విచారం వ్యక్తపరుస్తూ. 'వాళ్ళకు అసలు మానవత్వం లేదు. ఉంటే ప్రపంచానికంతటికీ తిండి పెడతూ ఇంత ఉదారంగా సహాయం చేసే మా దేశం మీదనే దెబ్బ తీస్తారా?' అన్నాడతను. ప్రపంచానికంతటికీ నిజంగా ఎలాంటి సహాయం చేస్తున్నారో చెప్పాలనిపించింది రామారావుకి. కాని ధైర్యం చాల్లేదు. మేం చేసే పన్లంటే ఇష్టంలేని వాడివి ఇక్కడ ఎందుకుంటున్నావు? తిరిగి మీ దేశం పోవచ్చుగా అంటే? ఇంతవరకూ అమెరికన్లతో ఎవరితోనూ రామారావు నిర్మొహమాటంగా రాజకీయాల గురించి మాట్లాడనూ లేదు, వాళ్ళు అతన్ని తిరిగి ఇండియా పొమ్మని అననూ లేదు. కాని, తెలుగువారి ఇళ్ళలో జరిగిన పార్టీలలో అప్పుడప్పుడూ తను రాజకీయ వాదనల్లో దిగటం, అమెరికా అంటే ఇష్టంలేని వాడివి నువ్వు ఇక్కడికెందుకొచ్చావు, ఇండియా తిరిగిపోవచ్చు గదా, అని సాటి తెలుగువారే అడగటం కొన్నిసార్లు జరిగింది.

ఇండియా నుంచి వచ్చిన కొత్తల్లో కొన్ని సంవత్సరాలు ఇక్కడ ఉండి తిరిగి వెళ్ళిపోదామనే అనుకున్నాడు రామారావు. కాని, రానురానూ ఆ ఆలోచన మరుగున పడిపోయింది. అమెరికా వచ్చిన ఆరు సంవత్సరాలకు ఇండియా పౌరసత్వం వదిలేసి అమెరికా పౌరసత్వం తీసుకున్నాడు. ఈ దేశం మీద ప్రేమ ఉండీ కాదు, ఆ దేశం మీద ప్రేమ లేకా కాదు. పౌరసత్వం లేనివారికి ఆఫీసులో కొన్ని కాంట్రాక్టుల మీద పని చెయ్యటం నిషేధం. అందువల్ల మంచి అవకాశాలు జారిపోతున్నాయి. ఎటూ ఇక్కడే ఉంటున్నాం కదా, ఈ అవకాశాలు పోగొట్టుకోవటం ఎందుకూ అని పౌరసత్వం తీసుకున్నాడు రామారావు. రాధకు ఇండియాతో సంబంధం తెంచుకోవటం ఇష్టం లేకపోయింది. ఆమె ఇండియా పౌరసత్వం వదల్లేదు. అదీ మంచిదే. ఒకవేళ తిరిగి ఇండియా వెళ్ళాలని అనిపిస్తే కనీసం ఒక్కరైనా భారత పౌరులుగా ఉండటం మంచిదని సరిపెట్టుకున్నాడు రామారావు. పౌరసత్వం తీసుకున్నప్పుడు ఇండియాలో తన స్నేహితులు హేళనగా మాట్లాడారు. తనను కపటి అనీ, అవకాశవాది అనీ అన్నారు. ఆత్మను అమ్ముకున్నావు అన్నారు. కాదని రామారావు వాదించలేదు. లోలోపల తనూ అలాగే భావించాడు. ఇక వాదించటానికేముందీ?

ఇప్పుడు ఆ స్నేహితులే కొందరు బిన్‌లాడెన్‌ను కీర్తిస్తున్నారు. అమెరికా మీద దెబ్బ తీసినందుకు అతడిని పొగిడేస్తున్నారు. అమెరికా చెడ్డ పనులు చేసింది కదా అని బిన్‌లాడెన్‌ని పొగడటం రామారావుకి నచ్చలేదు. నిర్దోషులను ఎవరు చంపినా తప్పేగదా? కానీ, ఇండియాలో ఉండి ఉంటే తను ఇలా ఆలోచించేవాడా? బిన్‌లాడెన్‌నే సమర్థించేవాడా? తనలో వచ్చిన మార్పుకు నిజానిజాల గుర్తింపు ఎంతవరకు కారణమో, పిరికితనం ఎంతవరకు కారణమో నిర్ణయించుకోలేకపోయాడు రామారావు.



# 3

ఆఫ్ఘనిస్తాన్‌లో బిన్‌లాడెన్ మీద యుద్ధం జరిపిన తర్వాత ఇరాక్‌లో సద్దాం హుస్సేన్ మీద యుద్ధానికి సన్నాహాలు జరుగుతున్న రోజులవి. ప్రపంచాన్ని మార్చాలనీ, ఆ ప్రయత్నంలో ఇరాక్ మొదటిమెట్టు మాత్రమేననీ, సిరియా ఇరాన్ దేశాలకు కూడా త్వరలోనే బుద్ధి చెప్తాననీ అంటున్నాడు ప్రెసిడెంట్ బుష్. ఒకరోజు ఆఫీసులో ఒక మరాఠీ సహోద్యోగి యుద్ధవ్యతిరేకంగా ఒక ప్రదర్శన జరుగబోతోంది. వస్తావా అని అడిగాడు. తనకు రాజకీయాల మీద అంత ఆసక్తి లేదని చెప్పేశాడు రామారావు. నిజానికి అసలు రాజకీయాల గురించి మాట్లాడే ధైర్యమే లేకపోతే ఇక ప్రదర్శనకు వెళ్ళటం ఎక్కడ?

ఇతర దేశాల వాళ్ళను భార్యాబిడ్డలకు కూడా తెలియకుండా అరెస్టు చేసి తీసుకెళ్ళి, వాళ్ళ మీద నేరం కూడా మోపకుండానే ఎన్నాళ్ళైనా జైల్లో పెట్టవచ్చని ప్రభుత్వం చెప్తుంది. ముస్లింలను చాలామందిని అలాగే అరెస్టు చేశారని పేపర్లో, టీవీలో వార్తలొస్తున్నాయి. అనుమానం ఉంటే చాలట, ఎవరినైనా టెర్రరిస్టుల జాబితాలో వెయ్యొచ్చుట. యుద్ధ వ్యతిరేక ప్రదర్శనకు వెళ్తే తెల్లవాళ్ళను క్షమిస్తారేమోగాని, తనలాంటివారిని ఎందుకు వదిలేస్తారు? జాగ్రత్తగా ఉండటమే మంచిది అనుకున్నాడు రామారావు.

ఒకరోజు సయ్యద్ అంకుల్ వాళ్ళింటికి ఫోన్ చేస్తే వాళ్ళను జస్టిస్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు ఇంటర్వ్యూకు రమ్మన్నారని తెలిసింది. సయ్యద్ అంకుల్ తమకు ఎంతో సహాయం చేశాడు. వాళ్ళదీ నెల్లూరే. మొదట న్యూజెర్సీ వచ్చినప్పుడు అపార్ట్‌మెంట్ దొరికిందాకా రామారావూ, రాధ వాళ్ళింట్లోనే ఉన్నారు. వాళ్ళ పెద్దబ్బాయి రట్‌గర్స్ యూనివర్సిటీ ఫిజిక్సు డిపార్టుమెంటులో రాకెట్ ఇంధనాల మీద పిహెచ్‌డీ చేస్తున్నాడు. ఇంటర్వ్యూకి అతన్ని కూడా తీసుకురమ్మన్నారట జస్టిస్ డిపార్టుమెంట్ వారు. దాదాపు ముప్ఫై సంవత్సరాలుగా ఈ దేశంలో ఉంటున్న సయ్యద్ అంకుల్ కుటుంబం మీదనే ఈ దేశానికి నమ్మకం లేకపోతే, ఇక ఈమధ్య వచ్చిన తనలాంటి వాడి మీద ఎందుకు నమ్మకం ఉంటుంది?

తిరిగి ఇండియా వెళ్ళిపోదామని అప్పుడప్పుడూ ఆలోచించేవాడు రామారావు. ఉద్యోగం బాగానే సాగుతుంది గాని, ఈ దేశంలో ఉండటం రోజురోజుకూ మానసికంగా కష్టం అవుతుంది. పూర్వం జమీందారుల పరిపాలనలో ఇలాగే జరిగేదట. జమీందారు కింద పనిచేసే వాళ్ళు కూర్చోమంటే కూర్చునేవారట, నుంచోమంటే నుంచునేవారట. తనూ అలాంటివాడేనని ఘోషిస్తుంది మనసు. ఇదంతా పట్టించుకోకుండా తన ఉద్యోగం తను చేసుకుంటూ బండి నడుపుకు పొమ్మంటుంది బుద్ధి. తిరిగి ఇండియా పోవటం రాధకు ఇష్టం లేదు. కావాలంటే ప్రదర్శనకు వెళ్దాం అంటుంది. ఇండియా పంపిస్తే

ఫరవాలేదు పోదాం అంటుంది. ఈమధ్య రాధను అర్థం చేసుకోవటం కొంచెం కష్టంగానే ఉంది. ఇండియా మీద ప్రేమ. పౌరసత్వం వదిలెయ్యలేదు. కాని తిరిగి ఇండియా వెళ్ళటం అంటే ఇష్టం లేదు. ఇక్కడి ప్రభుత్వం మీద సదభిప్రాయం లేదు. మరి తిరిగి వెళ్ళిపోవటం మీద ఎందుకు విముఖత్వం?

"ఇక్కడ యుద్ధోన్మాదం. అక్కడ మతోన్మాదం. కలరాతో చస్తావా, మలేరియాతో చస్తావా అని అడగలేదూ అతనెవరో?" అంది రాధ.

"మరేం చేద్దామంటావు?"

"ఏముందీ చెయ్యటానికి? అప్పుడేమో కాలేజీ రాజకీయాల్లో ఇమడలేక ఇక్కడకొద్దాం అన్నావు. ఇప్పుడు ఇక్కడ ఇష్టం లేక తిరిగి అక్కడికెళ్దాం అంటున్నావు. అక్కడ మళ్ళా నువ్వు శాంతంగా ఉండలేవు. అప్పుడేం చేద్దాం?"

ఏమీ సమాధానం చెప్పకుండా మన్‌హాటన్‌వైపు చూస్తూ కూర్చున్నాడు రామారావు.

"పారిపోవటం మానేసి మనం మనతో బ్రతకగలగటం నేర్చుకోవాలి. ఈ యుద్ధోన్మాదం నీకు పిచ్చి పట్టిస్తుంటే దానికి వ్యతిరేకంగా మాట్లాడు. ఉద్యోగం ఊడబీకి నిన్ను ఇండియా పంపిస్తారని భయమా? పంపిస్తే పోదాం."

మరుసటిరోజు ఖండేల్కర్‌తో మాట్లాడాడు రామారావు. తను కూడా యుద్ధానికి వ్యతిరేకం అనీ, ఈసారి ప్రదర్శనగానీ, మీటింగుగానీ ఉన్నప్పుడు చెప్తే తను కూడా వస్తానని అన్నాడు. ఖండేల్కర్ చాలా సంతోషంగా చేతులు కలిపాడు. తప్పకుండా చెప్తానన్నాడు.

కానీ రెండు రోజుల తర్వాత సాయంత్రం టీవీలో వార్తలు వింటుంటే మళ్ళా భయం వేసింది రామారావుకి. శాన్‌ఫ్రాన్సిస్కోలో యుద్ధ వ్యతిరేక ప్రదర్శన జరుగుతుంటే జస్టిస్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు దాన్ని వీడియో తీశారట. దేశాన్ని టెర్రరిస్టుల నుంచి రక్షించాలంటే దేశవ్యతిరేక ప్రదర్శనల్లో ఎవరు పాల్గొంటున్నారో గమనించటం అవసరం అని విలేఖరులతో చెప్పాడు అటార్నీ జనరల్. ప్రదర్శనకు వెళ్ళినప్పుడు తన ఫోటో తీస్తే! తనను టెర్రరిస్టు అని పేరు పెట్టి జైల్లో వేస్తే!

## 4

పదిరోజుల తర్వాత ఖండేల్కర్ ఒక కరపత్రం ఇచ్చాడు. ఆదివారం నాడు మెథడిస్ట్ చర్చిలో ఒక మీటింగు జరగబోతుంది. ఇరాక్ పర్యటన చేసి వచ్చిన కొందరు పాత్రికేయులు, మెథడిస్టు చర్చి సభ్యులు అక్కడ మాట్లాడతారు. తప్పకుండా రమ్మని అడిగాడు. కొంచెం తటపటాయించాడు రామారావు. తనకు సహోద్యోగులతో యుద్ధాన్ని గురించి మాట్లాడటానికే ధైర్యం లేదు. ఇక యుద్ధ వ్యతిరేక మీటింగుకి పోతే తను ఎటువైపో అందరికీ తెలిసిపోతుంది. దాని పర్యవసానం ఎలా ఉంటుందో? తనకు మతాల





మీద నమ్మకం లేదనీ, ఎప్పుడూ గుళ్ళకూ, చర్చీలకూ వెళ్ళలేదనీ నసిగాడు రామారావు. ఖండేల్కర్ నవ్వాడు. తనకూ చర్చికీ ఎలాంటి సంబంధం లేదనీ, ఈ యుద్ధానికి వ్యతిరేకంగా ఉన్న వారిలో రకరకాలవాళ్ళు ఉన్నారనీ, ఈ మీటింగు కోసం చర్చికి వెళ్ళినంత మాత్రాన నీకూ చర్చికి ఎలాంటి సంబంధం ఉండనవసరం లేదనీ అన్నాడు. ఆలోచించి మరుసటిరోజు సమాధానం చెప్తానన్నాడు రామారావు.

"మనం గుడికే పోము. ఇక చర్చికి పోవటంలో అర్థం లేదు." ఆ సాయంత్రం రాధతో తన మనసులో జరుగుతున్న ఘర్షణ బయటపెట్టాడు రామారావు.

"గుళ్ళో యుద్ధానికి వ్యతిరేకంగా మీటింగు పెట్టేదాకా ఆగుదామంటే, అదేదో అంటారే, పుణ్యకాలం కాస్తా దాటిపోతుందేమో."

"అంటే చర్చికి పోదామంటావా?"

"చూడు రామూ, మీటింగుకు పోవటానికి ధైర్యం లేక నువ్వు చర్చీ మీద వంక పెడుతున్నావు. పోవటం ఇష్టం లేకపోతే వదిలేసెయ్. ఇప్పుడు నిన్నెవరూ బలవంతం చెయ్యటం లేదుకదా?" అంది రాధ.

కొంచెంసేపు ముభావంగా ఉండిపోయాడు రామారావు. "నిజమే. ఇలాంటి మీటింగుకు పోవటం అంటే భయంగానే ఉంది. అక్కడ ఎఫ్.బి.ఐ వాళ్ళు ఉండొచ్చు. మన మీద లేనిపోనివన్నీ రాసుకోవచ్చు. నా ఉద్యోగం పోవచ్చు. అప్పుడేం చేద్దాం?" రెండు నిముషాలు అలాగే ఆలోచిస్తూ కూర్చుని, మళ్ళా అన్నాడు, "ఏం చెయ్యాలో తెలియటం లేదు. నేనేదో గొప్ప అభ్యుదయవాదిని అనుకునేవాణ్ణి. యుద్ధానికి వ్యతిరేకంగా మాట్లాడటానికి ధైర్యం లేక నోరు మూసుకుని జాగర్త పడుతున్నాను. ఆ మతాల వాళ్ళు బొత్తిగా ఛాదస్తులూ, మూర్ఖులూ అనుకుంటూ ఉండేవాణ్ణి. కానీ, ఈ మెథడిస్టు చర్చి ఉందే, ఆదివారం నాడు మీటింగు పెడుతున్న చర్చి, దాని మినిస్టరు స్వయంగా యుద్ధానికి వ్యతిరేకి అట. ధైర్యంగా నిలబడి మాట్లాడుతున్నాడు. మీటింగు పెడుతున్నాడు," చేతులు నలుపుకుంటూ, రాధవైపు చూశాడు రామారావు.

"అంటే మతం మీద నమ్మకం ఉన్నవారిలో కూడా మంచివారు ఉంటారన్నమాట. మంచిదేగదా మరి. రామూ, అన్ని విషయాల్లో మనతో ఒప్పుకునే వారితోనే చేతులు కలుపుదాం అని కూర్చుంటే, ఇక మనిద్దరమే కలపాలి చేతులు. అదీ అనుమానమే నాకు. నీతో అన్ని విషయాల్లో ఒప్పుకోవటం నాక్కూడా చేతకాదు!" అని, ఏమంటావ్ అన్నట్లు చూసి చిన్నగా నవ్వింది రాధ.

"సరే అలాగే పోదాం. ఈ ఆదివారమే. రెండున్నరకట. ఉదయ్‌ని సయ్యద్ అంకుల్ వాళ్ళింట్లో వదిలేసిపోదాం. ఒకవైపేమో నాకు ఈ మెథడిస్టు మినిస్టరు మీద కొంత గౌరవం ఏర్పడింది. మరోవైపేమో




అనుమానం. ఈ మెథడిస్టు వాళ్ళు నిజంగా యుద్ధానికి వ్యతిరేకంగా బజార్లలోకి వస్తారంటావా? ఇలాంటి వాళ్ళ వల్ల యుద్ధం ఆగుతుందని నాకు నమ్మకం కుదరటం లేదు."

"నా అభిప్రాయం చెప్పనా? వాళ్ళయినా, మనం అయినా, చెయ్యగలిగిందేదో చెయ్యటం ముఖ్యం. దానివల్ల యుద్ధం ఆగుతుందో లేదో ఎవరు చూసొచ్చారు? మనం ఈ మీటింగుకో, ఇంకొక దానికో పోవటం ముఖ్యంగా మనకోసం. పోకపోతే మనమీద మనకే గౌరవం ఉండదు. అందుకే పోవటం. ఎవర్నీ ఉద్ధరించటానికి కాదు."

మరుసటిరోజు, ఆదివారంనాడు, రామారావూ రాధా రెండున్నరకి చర్చికి వెళ్ళారు.



# కొత్త ఊపిరి

కమలను చూసి చానాళ్ళయింది. ఎలాగూ డిట్రాయిట్ వచ్చాను కదా తిరిగి వెళ్ళేలోగా ఒకసారి చూసిపోదామని ఫోన్ చేశాను. నా గొంతు వినగానే ఎగిరి గంతేస్తుందను కున్నాను. కానీ, అంత ఉత్సాహం వినపడ లేదు దాని గొంతులో. వెయిన్ స్టేట్ యూని వర్సిటీలో సెమినార్ ఇవ్వటానికి శుక్రవారం నాడు వచ్చాను, ఈరోజు సాయంత్రం తిరిగి వెళ్ళిపోతున్నాను, పోయేలోగా చూసి పోదా మని ఫోన్ చేస్తున్నాను అని చెప్పాను. సరే, వస్తానంటే రా, అన్నట్లు వినిపించింది దాని గొంతు.



కమలా, నేను చీరాల కాలేజీలో బియ్యే చదువుతున్నప్పుడు క్లాస్‌మేట్సుమి. డేవిడ్‌తో పెళ్ళయిం తర్వాత, ఎనభైయ్యయిదులో ననుకుంటా, అది డిట్రాయిట్ వెళ్ళింది. మావారికి చికాగోలో ఉద్యోగం వచ్చి మేము కూడా అమెరికా వచ్చిం తర్వాత అప్పుడప్పుడూ వాళ్ళు మమ్మల్ని చూట్టానికి చికాగో వచ్చేవారు, మేము వాళ్ళను చూట్టానికి డిట్రాయిట్ వచ్చేవాళ్ళం. ఈమధ్య రాకపోకలు కొంత తగ్గిన మాట నిజమే. అయినా కనిపించినప్పుడల్లా కాలం చాలా ఉత్సాహంగా గడిచిపోయేది. ఈసారి దాని గొంతులో వినిపించిన ముభావం నాకు కొంచెం బాధ కలిగించింది. నేనేమన్నా కష్టం కలిగించే మాట అన్నానా? అన్నట్లు నాకు గుర్తు లేదు.

ట్రాయ్‌లో వాళ్ళ ఇల్లు చాలా పెద్దది. చికాగోలో మా ఇంటి కంటే రెండింతలుంటుంది. ఆదివారం కావటం వల్ల చాలామంది చర్చికి వెళ్ళుంటారు. వాళ్ళ వీధి చాలా ప్రశాంతంగా ఉంది. అయినా ఇంత పెద్ద ఇళ్ళు ఉండే వీధుల్లో ఉండేదే కొద్దిమంది.

కమలా, డేవిడ్ నన్ను సాదరంగానే ఆహ్వానించారు. శేఖర్ గురించీ, పిల్లల గురించీ అడిగారు. ముగ్గురం వంటగదిలో బ్రేక్‌ఫాస్ట్ టేబుల్ చుట్టూ కూర్చున్నాం. ఇల్లు చాలా ప్రశాంతంగా ఉంది. ఉదయం పదకొండు గంటలప్పుడు ఇద్దరు పిల్లలున్న ఇల్లు గజిబిజిగా ఉండాలి కదా, అలా లేదు. నాకోసం ఎదురుచూస్తూ వాళ్ళింకా బ్రేక్‌ఫాస్ట్ చెయ్యలేదు. కమల ముగ్గురికీ ఇడ్లీలు సర్వ్ చేసింది. ముగ్గురం తినటం మొదలుపెట్టాం.

నాకు తెలిసిన కమల గలగలా మాట్లాడే మనిషి. ఈరోజు ఎందుకోమరి ఇలా మౌనంగా ఉంది. డేవిడ్ మామూలుగానే కొంచెం నెమ్మదైన మనిషి. కానీ అతను కూడా ఇంత ముభావంగా ఉండటం నేనెప్పుడూ చూళ్ళేదు. పిలవని పేరంటానికి వచ్చానేమో అనిపించింది నాకు.

పిల్లలు ఇంకా నిద్రపోతున్నారా అని అడిగాను. ఏదో సంభాషణ మొదలుపెడదామని. లేదు, ఇద్దరూ టెన్నిస్ ఆడటానికి వెళ్ళారు, మూడు గంటలకు వెళ్ళి పికప్ చెయ్యాలి, అంది కమల. స్నేహితుల్తో ఆడుతున్నారా? లేక వర్సిటీ టీమ్‌లో ఉన్నారా? అని అడిగాను. స్నేహితుల్తో ఆడుతున్నారంది. అంతే, ఇదివరలో పిల్లలను గురించి అడిగితే చాలు, సంభాషణ గంటలు గంటలు సాగేది. ఇప్పుడు పిల్లల గురించి మాట్లాడటంలో కూడా ఉత్సాహం కన్పించటంలేదు.

ఈ వాతావరణం నాకు చాలా దుర్భరంగా ఉంది. ఏమయింది వీళ్ళకు? నాకు తెలిసిన కమలా, డేవిడేనా వీళ్ళు? మరో విధంగా సున్నితంగా అడిగే ఓపిక లేక నేను నిర్మొహమాటంగానే అడిగాను. ఏమయింది మీకు? ఇంత క్వయట్‌గా ఉన్నారెందుకూ? ఏమైనా జరిగిందా! అని.

"కమలకు ఆరోగ్యం బాగాలేదు, సరిగ్గా నిద్రపోయి రెండు మూడు రోజులవుతుంది. చాలా డిప్రెస్డ్‌గా ఉంటుంది," అన్నాడు డేవిడ్ తల వంచుకునే.

"ఎందుకే? ఏమయిందీ? డాక్టరుకి చూపించుకున్నావా?"

"డాక్టరేం చేస్తుంది?"

"నిద్రపట్టటం లేదంటే ఏదో కారణం ఉండాలి కదా? కనీసం నిద్ర పట్టటానికి ఏదైనా స్క్రిప్ట్ అయినా ఇస్తుంది కదా?"

"అవును, అడుగుతాను," అని చేతులు నలుపుకుంటూ కూర్చుంది కమల.

"అసలేం జరిగింది? ఇండియాలో అందరూ బాగున్నారా? లేక నాకు చెప్పటం ఇష్టం లేదా?" అని ఇబ్బందిగానే అడిగాను.



కమలా, డేవిడ్ ఒకరినొకరు చూసుకున్నారు. ఇద్దరూ తలలు వంచుకున్నారు. కుర్చీలోంచి లేచి, కాఫీ కలుపుకొచ్చి మా ఇద్దరికీ ఇచ్చి, తనొక కప్పు తెచ్చుకుని మళ్ళా కూర్చున్నాడు డేవిడ్.

"కమల డివోర్స్ కావాలంటుంది," అన్నాడు మెల్లగా.

"వాట్? డివోర్సా? నిజంగా? ఎందుకూ? ఎందుకే? ఏమయిందీ?" నాకు ఇది నిజం అని నమ్మకం కలగలేదు. వాళ్ళ ముఖాలు చూస్తుంటే ఇది అబద్ధం అని కూడా అనిపించటం లేదు.

"నిజమే. అడిగాను. పాపం, అప్పట్నించీ డేవిడ్ పిచ్చివాడిలా తయారయ్యాడు. ఈ రెండు రోజులూ నిద్రపోలేదు," అంది కమల, అతనివైపు చాలా ప్రేమగా, దయగా చూస్తూ, కళ్ళ వెంట వస్తున్న నీళ్ళు తుడుచుకుంటూ.

నాకు తల తిరిగింది. ఇదేంటి? డివోర్స్ కావాలని అడగటం ఏంటీ, మళ్ళా అతనికి నిద్ర రాకపోతే ఈమెకు కళ్ళ వెంట నీళ్ళు రావటం ఏంటీ?

"దేవుడు నన్ను క్షమించడు," అంది కమల. దాని నోట దేవుడి ప్రస్తావన వినటం ఇదే మొదటిసారి.

"అసలేం జరిగిందీ? మీకేమయిందిప్పుడు?" అని అడిగాను. అడిగానే కాని, కారణం నాకు ముందుగానే గోచరించింది. డేవిడ్ ఎవరితోనో సంబంధం పెట్టుకొని ఉంటాడు. అంతకంటే ఇంకా ఏం కారణాలుంటాయి.

"కమలకు బెంగుళూరులో ఒక ఫ్రండ్ ఉన్నాడు. పోయి అతనితో ఉంటుందట." డేవిడ్ లేచి అటూ ఇటూ నడుస్తూ అన్నాడు.

నాకు నమ్మశక్యం కాలేదు. కమలకు ఫ్రండ్ ఉండటం ఏంటీ? "నిజమేనా కమలా?"

కమల ఏమీ జవాబు చెప్పలేదు. అంటే నిజమేనన్నమాట! డేవిడ్‌కి ఈ విషయం తెలుసన్న మాట. నాకు గనక ఎవరితోనన్నా సంబంధం ఉందని తెలిస్తే శేఖర్ ఈపాటికి నన్ను తన్ని ఉండేవాడు. సంబంధం అటుంచి ఎప్పుడైనా పరాయి మగవాడితో మాట్లాడితే చాలు, ఎవరతను? దేని గురించీ? ఏం మాట్లాడుకున్నారు? అని అన్ని వివరాలూ అడుగుతాడు.

డేవిడ్ వంటగది లివింగ్ రూమ్‌ల మధ్య అటూ ఇటూ నడుస్తున్నాడు. కమల అతనివైపు దిగులుగా చూస్తూ కూర్చుంది. వీళ్ళను చూస్తుంటే నాకు ఏదో సర్రియల్ సినిమా చూస్తున్నట్లనిపించింది.

"పోయిన సంవత్సరం మేం ఆరునెల్లపాటు బెంగుళూరులో ఉన్నాం. నీకు తెలుసుగదా? డైమ్లర్ వాళ్ళు అక్కడ ప్లాంట్ ఒకటి తెరవటానికి వీలుంటుందేమో చూడమని డేవిడ్‌ని పంపించారు," అంది కమల.

అంటే అప్పుడు పరిచయం అయ్యాడన్నమాట అతను. అంటే ఇదంతా నిజమేనన్నమాట.

"అతను చీరాలవాడట. మీ క్లాస్‌మేటే. ఇప్పుడు బెంగుళూరు యూనివర్సిటీలో పని చేస్తున్నాడు," అన్నాడు డేవిడ్.

"మన క్లాస్‌మేటా? ఎవరే అతను?"

"క్లాస్‌మేటంటే మన సెక్షన్ కాదు, ఇంకొక సెక్షన్‌లో ఉండేవాడు."

"ఇప్పుడు బెంగుళూరులో ఉంటున్నాడా?"

డేవిడ్ ఇంతలోనే సడెన్‌గా ఆగి, "కమలా, నువ్వూ కరుణా మాట్లాడుకుంటూ ఉండండి. నేను కొంచెంసేపు ఆఫీసుకి వెళ్ళొస్తాను. వచ్చేటప్పుడు పిల్లల్ని పికప్ చేసుకొస్తాను," అన్నాడు చేతి గడియారం చూసుకుంటూ.

"ఆదివారం కదా, ఈరోజు పోకపోతే ఏం? మళ్ళీ నువ్వొచ్చేసరికి లంచ్‌కి ఆలస్యం అవుతుంది," అంది కమల.

"మీరు లంచ్ చెయ్యండి. నాకోసం ఉండొద్దు," అన్నాడు డేవిడ్.

అప్పటికే పన్నెండు దాటింది. "డేవిడ్, నేను మీరు తిరిగొచ్చిందాకా ఉండను. నాకు ఐదు గంటల డ్రైవ్ ఉంది కదా. తొందరగా ఇంటికి చేరాలి. రేపు మళ్ళా యూనివర్సిటీ కెళ్ళాలిగదా?" అన్నాను.

"సరే, శేఖర్ని అడిగానని చెప్పండి," అని అతను వెళ్ళిపోయాడు.

నేనూ, కమలా మిగిలిపోయాం. వీళ్ళ డివోర్స్‌కి కారణం ఏమిటో నాకు ఇంతవరకూ ఏమీ గోచరించలేదు.

"ఎవరే అతను? బెంగుళూరులో ఏం చేస్తుంటాడు?"

"పేరు వెంకట్. యూనివర్సిటీలో లెక్చరరుగా పనిచేస్తున్నాడు."

"ఇన్నాళ్ళూ నీకు అతనితో కాంటాక్ట్ ఉందన్నమాట?"

"లేదు. కాలేజీ తర్వాత అతన్ని చూళ్ళేదు. పోయిన సంవత్సరం మేం బెంగుళూరులో ఉన్నప్పుడు మళ్ళా కలిసాడు."

"కమలా, నువ్వేదో మిడ్‌లైఫ్ క్రైసిస్‌లో ఉన్నావనిపిస్తుంది నాకు. ఇట్లాంటి పరిచయం కోసం ఇరవై సంవత్సరాల కాపురాన్ని నాశనం చేసుకుంటావా? ఇప్పుడు డేవిడ్ నీకేం తక్కువ చేశాడని?"

"డేవిడ్ మంచివాడే. కాని, ఇప్పుడు నువ్వే చూశావు గదా, ఆదివారం, పైగా చాన్నాళ్ళ తర్వాత నువ్వు కన్పించావు. ఇప్పుడు ఆఫీసుకెళ్ళటం ఎందుకు చెప్పూ?"

నాకేం చెప్పాలో తోచలేదు. ఈ డివోర్స్ విషయం మేమిద్దరం మాట్లాడుకోవటం వీలుగా ఉంటుందని తను కొంచెంసేపు బైటకు వెళ్ళాడని అనుకున్నాను నేను.

"డేవిడ్‌కి ఎప్పుడూ నిర్దిష్టమైన లక్ష్యం ఉంటుంది. దాన్ని సాధించిందాకా నిద్రపోడు. అదీ డేవిడ్ స్వభావం. ఇరవైయ్యేళ్ళ క్రితం నేను అతని లక్ష్యం. మా నాన్నను ఒప్పించి నన్ను చేసుకున్నాడు, కొన్నాళ్ళు చాలా హాయిగా ఉన్నాం. తర్వాత అమెరికా రావాలనుకున్నాడు. అదీ సాధించాడు. ఇప్పుడు డైమ్లర్ వాళ్ళ డిజైన్ సెక్షన్‌కి వైస్ ప్రెసిడెంట్ అయిందాకా రాత్రింబవళ్ళు పనిచేస్తాడు. అది ప్రస్తుత లక్ష్యం. ఇంతకు ముందు గెల్చుకున్న ప్రైజులకు ఇప్పుడు విలువ లేదు."

"అందులో తప్పేముంది కమలా? అందరూ ఇలాగే ఉంటారు. ఏదో లక్ష్యం లేకుండా ముందుకుపోవటం కష్టం. డేవిడ్‌కి గోల్స్ ఉండటం తప్పు ఎలా అవుతుందీ? అతను ఏం చేసినా నీకోసం, పిల్లల కోసమే కదా?"

"కాదు. డేవిడ్ చేసేది ఏదైనా తన కోసమే. నాకు అందులో భాగం లేదు. నేను ఇల్లు చూసుకుంటూ, పిల్లల్ని పెంచుతూ వస్తే, ఇంట్లో అతనికి ఎలాంటి బాధ్యతా లేకుండా నడుపుకొస్తే, అతనికి తన లక్ష్యం సాధించటం సులభం అవుతుంది. అంతవరకే నా బాధ్యత. అదే నా పాత్ర," అని



కళ్ళు తుడుచుకుని, "మా సంబంధం ఎండిపోయింది కరుణా, మా బ్రతుకులు యాంత్రికంగా తయారయ్యాయి," అంది కమల.

"ఈ దేశంలో అందరి జీవితాలూ అలాగే ఉంటాయి కమలా. నీకు ఇంట్లో చాలా బోర్ కొడుతున్నట్లుంది. ఏదో దగ్గర్లో ఉన్న యూనివర్సిటీలోనో, కమ్యూనిటీ కాలేజీలోనో ఏదైనా కోర్సు తీసుకోవచ్చు కదా? లేకపోతే నువ్వూ నీకిష్టమైన పనేదైనా చెయ్యటం మొదలుపెట్టు."

"బెంగుళూరు పోవటం అందుకే."

"దానికి డేవిడ్‌ని వదిలెయ్యటం, బెంగుళూరు దాకా పోవటం ఎందుకూ? చేసేదేదో ఇక్కడే చెయ్యొచ్చు గదా?"

"ఇక్కడ ఉండాలని లేదు నాకు. బెంగుళూరులో ఆర్ట్ స్టూడియో పెట్టుకోవాలని ఉంది. వెంకట్ నాకు సహాయం చేస్తానన్నాడు."

"నువ్వు నాకసలు అర్థం కావటంలేదు. ఆర్ట్ స్టూడియో ఇక్కడే పెట్టుకోవచ్చుగా? బెంగుళూరు దాకా ఎందుకూ? లేక ఆర్ట్ స్టూడియో ఒక వంక మాత్రమేనా? అసలు విషయం నీకు అతని మీద ఉంది మనసు."

"నిజమే. కాని నేను వెంకట్ మీద ఆధారపడి ఉండను. ఆర్ట్ స్టూడియో పెట్టుకుని నా కాళ్ళ మీద నేను నిలబడతాను."

"కానీ, డేవిడ్‌తో అసలు మాట్లాడావా? నీ మనసులో ఉన్నదేదో చెప్తే అతను మారతాడేమో?"

"డేవిడ్‌ని బలవంతంగా మార్చటం నాకు ఇష్టంలేదు. అతనికిష్టమైన మార్గాన అతన్ని నడవనియ్యటమే న్యాయం. ఇద్దరికీ మనశ్శాంతి లేకుండా చెయ్యటం ఎందుకూ? నాకు డేవిడ్‌తో ఏదో విరోధం ఉందనో, మేం తగవులాడుకున్నామనో అనుకుంటావేమో, అదేంలేదు. చాలాకాలంగా మా మార్గాలు వేరవుతూ వచ్చాయి. అంతే. ఈ వాతావరణం చాలా నిర్జీవంగా తయారయింది నాకు."

"సరే, నువ్వు బెంగుళూరు వెళ్తావు, ఆర్ట్ స్టూడియో పెట్టుకుంటావు, అది సాగకపోతే? ఈ వెంకట్ మీద పిచ్చి ఐదారు సంవత్సరాల తర్వాత దిగిపోతే? అతనికి భార్యా, పిల్లలూ లేరా?"

"లేరు. అయినా ఐదారు సంవత్సరాల దాకా ఎందుకూ, ఒక సంవత్సరంలోనే తేడాలు రావచ్చు. కాని, కనీసం ఆ ఒక్క సంవత్సరం పాటైనా నిండుగా జీవిస్తాను కదా?"

"నిన్ను తప్పకుండా సైకియాట్రిస్ట్ దగ్గరకు తీసుకెళ్ళమని చెప్పాలి డేవిడ్‌కి. నువ్వు ఈ వయసులో టీనేజర్‌లాగా ప్రవర్తిస్తున్నావు. ఇలాంటి పన్లు చేస్తే పిల్లలేమవుతారు? నువ్వు ఇంత స్వార్థంగా ఆలోచించటం ఆశ్చర్యంగా ఉంది నాకు."

కమల ఏమీ జవాబు చెప్పలేదు. ఆలోచిస్తూ దూరంగా చూస్తూ కూర్చుంది. డేవిడ్‌ని వదిలెయ్యటం సులభం కావచ్చు, కాని పిల్లల్ని వదిలెయ్యటం అంత సులభం కాదు.

"కమలా, డేవిడ్‌లాంటి మంచివాడిని వదిలెయ్యటం చాదస్తం. పిల్లల్ని అతనికి వదిలేసి వెళ్ళిపోగలవా?"

"పిల్లలు ఇప్పుడు హైస్కూల్లో ఉన్నారు. రెండు మూడేళ్ళలో వాళ్ళూ ఇల్లు వదిలేసి వెళ్ళిపోతారు. వాళ్ళని ఇప్పుడు ఇండియా తీసుకెళ్ళటం వాళ్ళ చదువుకు మంచిది కాదు. అదీగాక రావటం వాళ్ళకు

ఇష్టం లేకపోవచ్చు. ఇక్కడ పెరిగిన పిల్లలు కదా! అయినా డేవిడ్ వాళ్ళను బాగానే చూసుకోగలడని నాకు నమ్మకం ఉంది."

"డేవిడ్ ఏమంటున్నాడు? డివోర్స్‌కి ఒప్పుకున్నాడా?"

"ఇంకా చెప్పలేదు. పాపం, రెండు రోజుల నుంచి నిద్రపోలేదు. చాలా ఏంక్షస్‌గా ఉన్నాడు. కాని, డేవిడ్ కోలుకుంటాడు. నాకు తెలుసు. డేవిడ్ చాలా గట్టి మనిషి."

"డివోర్స్ ఇస్తాడంటావా?"

"ఇస్తాడు. డేవిడ్ ఎవ్వరికీ హాని కలిగించే మనిషి కాదు. ఎవ్వరి దోవకూ అడ్డంగా నిలబడే మనస్తత్వం లేదు డేవిడ్‌కి."

నాకు కమల మాటలు వింటుంటే తలనొప్పొచ్చింది. డేవిడ్ మంచివాడు. కాని, డేవిడ్‌ని ఈమె వదిలేస్తుంది. కారణం ఏదో ఇన్ఫాచువేషన్‌లాగుంది. దానికి డేవిడ్ అడ్డం రాడు. ఈమె నాలుగైదు సంవత్సరాల తర్వాత ఆ వెంకట్ మీద మోజు తీరగానే, లేక అతనికి ఈమె మీద మోజు తీరగానే, రోడ్డు మీద పడుతుంది. అప్పుడు ఈమె బ్రతుకేమవుతుందీ?

"డేవిడ్‌లో లేంది వెంకట్‌లో ఏం కనిపిస్తుంది నీకు?"

"కరుణా, డేవిడ్‌తో పది నిమిషాలు మాట్లాడి చూడు. ఆ డైమ్లర్ కార్లూ, కొత్త మోడల్సూ, డిజైన్లూ, ఇంటర్నేషనల్ కాంపిటీషనూ, డెవలపింగ్ మార్కెట్లలో ప్లాంట్లు తెరవటం ఇవి తప్ప మరో విషయం మీద నీతో రెండు నిముషాలు కూడా మాట్లాడలేడు. డేవిడ్‌కి ప్రైవేట్ లైఫ్ అంటే ఏమిటో కూడా తెలియదు."

"వెంకట్ మాటకారి అయ్యుంటాడు. నువ్వు అతని వల్లో పడ్డావని అనిపిస్తుంది నాకు."

"కావచ్చు. కాని, నేను అంత తెలివితక్కువదాన్ని కాదని నా నమ్మకం. వెంకట్ చాలా సాధారణ మైన మనిషి. అయినా అతనికి మాట్లాడటమే కాదు, వినటం కూడా చేతనవును. అతను కోరుకుంటుందీ, నాక్కావల్సిందీ స్నేహం, తోడు, ఒక జీవం ఉన్న సంబంధం. అంతే. వల్లో పడ్డాననుకోవటానికి అతనికి డేవిడ్‌కి ఉన్నంత డబ్బూ లేదు, ఇంత పెద్ద ఇల్లూ లేదు. కాని అతనికి ప్రపంచంతో సంబంధం ఉంది. ఉదయం ఉంది. సాయంత్రం ఉంది. కష్టం ఉంది. సుఖం ఉంది. ఇబ్బందులున్నై. వెంకట్‌కి మనుషులు లక్ష్యం సాధించటానికి ఉపయోగపడే సాధనాలు కారు. సహచరులు, తోటి మనుషులు." చాలా ఉద్రేకంగా మాట్లాడింది కమల.

ఇంతవరకూ అర్థంకాని విషయం ఇప్పుడు కొంచెం కొంచెం అర్థం అవుతుందనిపించింది నాకు. కమలకి డేవిడ్‌తో ఎలాంటి విరోధం లేదు. అతని మీద ద్వేషం లేదు. కానీ, ఇద్దరికీ సంసారం అంటే వేరే అర్థాలున్నాయి. ఇద్దరూ మానసికంగా చాలా దూరం అయ్యారు. ఒకే ఇంట్లో అపరిచితుల్లా జీవిస్తున్నారు. జీవితాంతం కమల ఇలాగే గడపాల్నా?... ఇప్పటిదాకా కమల చెయ్యబోతుంది దుస్సాహసం అనిపించింది. ఇప్పుడు అది తప్పు కూడా కాదేమో అనిపిస్తుంది.

*భూమిక, మార్చి 2004*



# సావాసం - సహవాసం

స్కూల్లో చదువుకునే రోజుల్లో "అబ్బాయ్! నీ సావాసగాళ్ళొచ్చార్రా!" అని కేకేసేది మా అమ్మ.

వాళ్ళూ, నేనూ కలిసి ఊరి బైటున్న చింతతోపు వైపెళ్ళేవాళ్ళం. ఊరి పిల్లలందరం అక్కడ చేరి సాయంత్రం చెడుగుడు, ఉప్పాట ఆడుకునేవాళ్ళం. అప్పటికి నా వయసు ఎనిమిదో, తొమ్మిదో సంవత్సరాలు.



కాలేజీకి పోయే రోజుల్లో సెలవుల్లో ఇంటికొచ్చినప్పుడల్లా సావాసగాళ్ళూ, నేనూ, పంటపొలాల మీదుగా ఊరికి దగ్గర్లో ఉన్న కొండవైపు షికార్లకెళ్ళేవాళ్ళం. గంటల తరబడి కాలేజీ జీవితం గురించి, తెలుగు నవలల గురించి, ముఖ్యంగా అమ్మాయిల గురించీ మాట్లాడుకునేవాళ్ళం.

ఇంతకీ చెప్పొచ్చేదేంటంటే 'సావాసం' నాకు తెలిసిన మాటే. అందమైన, హాయైన మాట. 'సహవాసం' అన్న మాట మా వూళ్ళో ఎప్పుడూ విన్లా. కాలేజీలో లెక్చరర్లు 'సహవాస దోషం' అని అప్పుడప్పుడూ అంటుంటే విన్నాను. చెడ్డ సావాసాన్ని సహవాసం అంటారేమోననుకుంటుండేవాణ్ణి. ఈమధ్య ఒక పార్టీలో సంస్కృతం తెలిసిన స్నేహితుడ్నొకణ్ణడిగితే, "సహవాసం అనటం చేతగాని నీలాంటి పల్లెటూరివాళ్ళు దాన్ని సావాసం అంటారు," అన్నాడు.

మాతోనే కూర్చొని ఉన్న సుజాత మాత్రం, "సావాసం, సహవాసం వేర్వేరు మాటలు. వాటికసలు సంబంధమే లేదు. సావాసం అంటే స్నేహం. సహవాసం అంటే కలిసుండటం. సావాసం చేసేవాళ్ళు కలిసుండకపోవచ్చు. సహవాసం చేసేవాళ్ళల్లో సావాసం ఉండటం చాలా అరుదు," అంది. అంతటితో ఆగలా. "సావాసం అంటే ప్రేమ, సహవాసం అంటే పెళ్ళి అని కూడా చెప్పొచ్చు," అని ఒక బాంబు వేసింది. ఆమె మాటలు నాకంతగా నచ్చలా. సుజాతతో వాదించాలంటే భయం వేసి ఊరుకున్నాను. ఆమెది మా వూరే. నాకంటే రెండు మూడేళ్ళు పెద్దది. సుజాతతో వాదించి గెల్చినవాళ్ళను నేనెప్పుడూ చూళ్ళేదు.

ఆ తర్వాత కొద్దిరోజుల్లోనే ఒకసారి వాళ్ళింటికి భోజనానికి పిల్చింది సుజాత. తన సావాసగాడు సుబ్బారావుతో పరిచయం చేసింది. సుజాతకు రామారావుతో పెళ్ళి గావటం, అమెరికా పోవటం నాకు తెలిసిన విషయాలే. మరి ఆ రామారావేమయ్యాడో, ఈ సుబ్బారావెవ్వరో అని తెలుసుకోవాలనిపించినా అడగటానికి ధైర్యం లేక ఊరుకున్నా. నా మనసులో ఉన్న మాట ఎలా తెలిసిందోగాని, "ఈ సుబ్బారావెవరో అని అనుకుంటున్నావు గదూ?" అంది సుజాత.

ఏమనాలో తెలియక, "మీరు పెళ్ళి చేసుకున్నారు," అన్నా. అంతమాత్రం తెలుసుకోలేనను కున్నావా అన్న ధీమాతో.

"లేదు. మేం సావాసగాళ్ళం. సహవాసులంగాదు," అంది సుజాత. "ఏం? పెళ్ళి చేసుకోకపోతే సావాసం చెయ్యటం తప్పా?" అని తిరుగు ప్రశ్న వేసింది.

సుజాతతో ఎప్పుడూ ఇదే గొడవ. అడిగిన ప్రశ్నలకు సరిగ్గా సమాధానం చెప్పకుండా ఎదురు ప్రశ్నలేస్తుంటుంది.

"తప్పు గదూ మరి. ఒక ఆడది, ఒక మగవాడు కలిసి ఉంటే దాన్ని సంసారం అంటారు. సావాసం అనరు. సంసారబంధం ఒక పవిత్రమైన సంబంధం. మన సాంప్రదాయం ప్రకారం..."

"పవిత్రం అంటే ఏంటో నీకసలు తెలుసా? వీసా కోసం చేసుకునే పెళ్ళి పవిత్రమైందా? ఆస్తుల కోసం, కట్నాల కోసం, చావబోతున్న అమ్మమ్మ ఆత్మశాంతి కోసం చేసుకునే పెళ్ళిళ్ళు పవిత్ర మైనవా? నాకు యాభైవేలు జీతంతెచ్చే భార్య కావాలనటంలో పవిత్రతుందా? ముక్కూ మొఖం తెలియని



వాడిచేత కూతురి మెళ్ళో తాడు గట్టించి ఇక్కడకు పంపించటంలో పవిత్రతుందా? ఇండియా నుంచి అమ్మాయిని తీసుకొచ్చి రెండు నెల్లు వాడుకొని బజార్లో పారెయ్యటంలో పవిత్రతుందా? ఎట్లాగో సర్దుకోమ్మా అని ఇండియా నుంచి ఆ బుద్ధిలేని తల్లిదండ్రులు టెలిఫోన్లు చెయ్యటంలో పవిత్రతుందా?" సుజాత శివతాండవం చెయ్యటానికి రెడీగా ఉంది!!

విస్తుపోయి చూస్తున్న నన్ను చూసి, అంత కోపం ప్రదర్శించినందుకు సిగ్గుపడ్డదో ఏమో మరి, "ఎక్స్యూజ్మీ," అని లేచి వంటగదిలోకి పోయింది. నిజమే. ఇండియా వెళ్ళి పెళ్ళి చేసుకొని రావటం, తీసుకొచ్చిన అమ్మాయిని ఇక్కడ వొదిలెయ్యటం, ఆ అమ్మాయి ఇక్కడ నానా అగచాట్లు పడటం, ఇలాంటి కేసులు ఈమధ్య చాలా ఎక్కువగానే కనబడుతున్నయ్. ఇట్లాంటి ఇబ్బందుల్లో ఉన్న ఆడవాళ్ళకు సుజాత సహాయం చేస్తుంటుందని నాకు తెలుసు.

కాని, అందరూ అలా చెయ్యటం లేదుగదా? కొందరు తప్పు చేశారని పెళ్ళి చేసుకునే వాళ్ళం దరినీ హీనంగా చూస్తే ఎలా? అయినా సుజాత చాలా కోపంగా ఉండటం వల్ల ఈ విషయం గురించి ఇక మాట్లాడొద్దులే అనుకున్నా.

కానీ భోజనాలయింతర్వాత కొంచెం ధైర్యం తెచ్చుకుని, "మరి మీ పద్ధతి మంచి దంటారా?" అన్నాను.

"అనే నా ఉద్దేశం. నీకు తెలుసో లేదోగాని, ఈ దేశంలో పుట్టి పెరిగిన అమ్మాయిల్లో సగంమంది సావాసాలు చేస్తున్నారు. పవిత్రమైన పెళ్ళిళ్ళు చేసుకోవటంలా," అంది సుజాత.

ఇంతలో సుజాతకూ, నాకూ మంచినీళ్ళు తెచ్చిచ్చాడు సుబ్బారావు. "థాంక్స్," అంది సుజాత. భర్త భార్యకు మంచినీళ్ళు తెచ్చివ్వటం ఇంతకుముందు నేనెప్పుడూ చూళ్ళేదు. వీళ్ళ సంబంధం కొంచెం విచిత్రంగానే వుంది.

"ఒక మగాడూ, ఒక ఆడది కలిసుండాలంటే దానికొక బలమైన కారణం ఉండాలి. ఆ ఇద్దరికీ ఒకరి మీద ఒకరికి గౌరవం ఉండాలి. అభిమానం ఉండాలి. భావైక్యతుండాలి. అంటే వాళ్ళు సావాసగాళ్ళు కావాలన్నమాట. సావాసగాళ్ళు కలిసుండదల్చుకుంటే దానికి ముహూర్తాలూ, పార్టీలూ, రాద్ధాంతాలూ అవసరం లేదు." సుజాత ఉవాచ.

రెండు క్షణాలాగి, "అంటే లవ్‌మేరేజ్‌లు మాత్రమే మంచివంటావా నువ్వు?" అనడిగాను.

"నేను చెప్పేది నీకసలు అర్థమవుతున్నట్లు లేదు. లవ్‌మేరేజ్ లేదూ, గాడిదగుడ్డూ లేదు. లవ్వుంటే ఇంకా మేరేజెందుకు? లవ్వు మీద నమ్మకం లేకనేగదూ ఆ తాడు గట్టటం," అని, మళ్ళా మొదలుబెట్టి, "మేరీజీలన్నీ ఒకటే. అన్నీ బేరాలు, కాంట్రాక్టులు, మోసాలు," అంది.

కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాం.

"సరే, సావాసమే మంచిదనుకుందాం. కానీ, సావాసగాళ్ళలో కూడా అభిప్రాయభేదాలు రావొచ్చుగా? అలా జరిగితే మీరేంజేస్తారు?" అన్నాను.

"సావాసాళ్ళందరూ ఏం జేస్తారో అదే చేస్తాం. మాట్లాట్టం మానేస్తాం. సుబ్బారావింకొక ఎపార్ట్మెంట్ చూసుకుంటాడు. ఉద్యోగం చూసుకొని నేను మరో వూరు పోతాను," ఎప్పుడూ ధైర్యంగా మాట్లాడే సుజాత గొంతు కొంచెం బొంగురుమంది.

"మళ్ళీ పెళ్ళి చేసుకుంటావా?"

"పెళ్ళి చేసుకోవటం సులభం. సావాసగాడు దొరకటమే కష్టం," అంది సుజాత. సుజాతా, సుబ్బారావు ఒకర్నొకరు చూసుకున్నారు. చిన్నగా నవ్వుకున్నారు.

సావాసంతో పనిలేని సహవాసం సులభం అంటుంది ఆమె. సావాసమే కష్టమట. నాకీది పూర్తిగా వొంటబట్టినట్టు లేదు. దీన్ని గురించి కొంచెం లోతుగా ఆలోచించాలి.

*విపుల, ఆగస్టు 1999*



# జీతగాళ్ళు

భోజనాలయింతర్వాత ఇంటి ముందు మంచాల మీద కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు రంగారావూ, అతన్ని చూట్టాని కొచ్చిన స్నేహితులూ.

ఆ సంగతి తెలిసి చేతిలో కర్ర పట్టుకొని అడుగులో అడుగేసుకుంటూ మెల్లగా వచ్చాడు రత్తయ్య.

ఆయన్ని చూసి, ఎదురు వెళ్ళి, "ఏం చిన్నాన్నా. పిల్లోణ్ణి రేపు మీ ఇంటికే పంపించే వాణ్ణిగా. ఇంత దూరం శ్రమపడి రాకపోతే ఏంబోయింది?" అని పలకరించాడు రంగారావు తండ్రి సుబ్బయ్య. చేయిపట్టి వాళ్ళు కూర్చున్న మంచం దగ్గరకు తీసుకొచ్చాడు.



ఆయన్ని చూసి లేచి నిలబడ్డాడు రంగారావు.

"రా తాతా, బాగున్నావా?" అన్నాడు ప్రేమతో పలకరిస్తూ.

"ఇటు కూర్చో," అని, మంచం మీద తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

కాసేపు తేరిపారా చూశాడు రత్తయ్య రంగారావుని.

"నువ్వొచ్చావని నిన్ననే తెలిసింది. ఒంట్లో అంత హుషారుగా లేక రాలా. నేను పైకి బోయేలోగా మళ్ళా కనబడతావో లేదో అనుకున్నా. కనపడ్డావు. బాగుంది," అన్నాడు రత్తయ్య రంగారావు చెయ్యి తన చేతిలోకి తీసుకొని ఆప్యాయంగా.

రంగారావు కూడా ఆ చేతిని నొక్కాడు అభిమానంగా.

"మరయ్యా, అమెరికా మీద బాంబులేశారంట గదా! అది నువ్వుండే కాడా? ఇంకా దూరం గానా?" అని అడిగాడు.

"నాకూ అక్కడికీ చాలా దూరం తాతా. నాకేం ప్రమాదం లేదు," అన్నాడు రంగారావు.

"మంచిదయ్యా. మరి ఇద్దం ఇంకా సాగుతూనే ఉందా? అయిపోయిందా?"

"లేదు తాతా. ఇప్పుడు యుద్ధం లేదూ, ఏమీ లేదు. అంతా బాగానే ఉంది."

"అయితే యిప్పుడేమీ బయం లేదన్నమాట. పోయిన సంవత్సరం ఇక్కడ శానా బయంగా సెప్పుకున్నారయ్యా అక్కడి సంగతులు. నువ్వెట్టా వుండావోనని బయం బుట్టింది నాకు," అన్నాడు రత్తయ్య.

"యిప్పుడేం భయం లేదులే తాతా. అంతా బాగానే వుంది," అన్నాడు రంగారావు, తాత చెయ్యి నిమురుతూ.

"అయితే అయ్యా, నువ్వేంది అక్కడే వుండిపోతావా? మళ్ళా కొన్నాళ్ళకి మనదేశ వొత్తావా?"

"అక్కడే వుండాలనుకుంటున్నా తాతా. అందరూ అక్కడకు రావాలని చూస్తుంటే నేను తిరిగి ఇక్కడకు రావటమెందుకూ?"

"అవునులెయ్యా. ఇదుగో, నీ సేయితులందరూ రారూ అక్కడికి నువ్వు తీసకపోతానంటే," అంటూ మంచం మీదున్న రంగారావు క్లాస్‌మేట్ల వైపు చూసాడు రత్తయ్య నవ్వుతూ.

"వాళ్ళూ చూస్తూనే వున్నారు. అవకాశాలొస్తే ఎందుకు రారూ. ఈమధ్య కాస్త ఉద్యోగాలు రావటం కష్టంగానే ఉంది అక్కడ గూడా," అన్నాడు రంగారావు.

"మరయితే అయ్యా, పెళ్ళి చేసుకొని పోతావా ఈసారి?"

"చూద్దాం," అన్నాడు రంగారావు.

"సరే అయితే. మీరు కుర్రాళ్ళు మాట్లాడుకోండి. నేను మీ నాయనతో కాసేపు మాట్లాడి ఇంటికి బోతా," అని కొంచెం దూరంగా ఉన్న మంచం మీద కూర్చున్న సుబ్బయ్య దగ్గరకు నడిచాడు రత్తయ్య.

స్నేహితులు మళ్ళీ మాటల్లో పడ్డారు.



"రంగారావ్, నాలుగైదు నెలల్లో అక్కడ మళ్ళీ ఉద్యోగాలు దొరుకుతాయని చెప్పుకుంటున్నారిక్కడ. నిజమేనా?" అని అడిగాడు ఒక స్నేహితుడు.

"అవును వెంకటేష్, అట్లానే అనుకుంటున్నారు. కానీ ఏమవుతుందో ఎవరికి తెలుసూ? కొన్నాళ్ళు పోతేగాని ఎలా వుండేదీ తెలియదు," అన్నాడు రంగారావు.

"మీ కంపెనీలో పనికేం దెబ్బతగల్లేదా ఈ సెప్టెంబర్ పదకొండు వల్ల?" అని అడిగాడు మరొక స్నేహితుడు.

"మా ప్రాజెక్టులు ఎక్కువగా టెలిఫోన్ కంపెనీలవి. కమ్యూనికేషన్ కంపెనీల మీద పెద్ద ఎఫెక్ట్ లేదనే చెప్పాలి."

కాసేపు వాళ్ళకేం మాట్లాడాలో అర్థం కాలేదు. వెంకటేష్ రంగారావు వేసుకున్న టీషర్టు వేపే కాసేపు పరికించి చూసి అడిగాడు -

"రంగారావ్! నువ్వు ఇక్కడున్నప్పుడెప్పుడూ ఇండియా జండా ఉన్న టీషర్టులు వేసుకున్నట్టు గుర్తు లేదు నాకు. మరి ఇప్పుడు అమెరికా జండా ఉన్న టీషర్టు వేసుకున్నావు. అమెరికాలో ఇలాంటి టీషర్టులు వేసుకోవటం ఎక్కువా? లేక వేసుకోవాలా?"

"కొందరు వేసుకుంటారు. ఈమధ్య ఇలాంటివి వేసుకోవటం ఎక్కువయినట్లే ఉంది," అన్నాడు రంగారావు కొంచెం ఇబ్బందిగా నవ్వుతూ.

"నేను మామూలుగా ఇలాంటి టీషర్టులు వేసుకోను. ఈమధ్యే వేసుకుంటున్నాను. మా ఆఫీసులో గ్రూపులీడర్ వేసుకోమని సలహా ఇచ్చాడు. ఇది ఆయనే ఫ్రీగా ఇచ్చాడు గూడా," అన్నాడు రంగారావు టీషర్టు మీద జెండాను చూసుకుంటూ.

"అంటే ఆఫీసులో అందరూ ఇలాంటివే వేసుకుంటారా? యూనిఫారంలాగా," అన్నాడు వెంకటేష్.

"అదేంలేదు. మాకు యూనిఫారాలు లేవు. ఆఫీసుకి మామూలుగా షర్ట్ వేసుకుపోతాం. షర్ట్ మీద మా కంపెనీ లోగో ఉంటుంది. కాని శుక్రవారంనాడు ఆఫీసుకి టీషర్ట్ వేసుకొనిపోవచ్చు. నేను మామూలుగా ఏదో పోలో షర్టు వేసుకొని పోతుండేవాణ్ణి. సెప్టెంబర్ పదకొండు తర్వాత అక్కడక్కడా ఇండియా వాళ్ళను బజార్లలో తిట్టటం, కొన్నిచోట్ల కొట్టటం కూడా జరిగింది. అమెరికా వాళ్ళకు తెలియక మనవాళ్ళను మిడిలీస్ట్ వాళ్ళనుకున్నారు. కొన్నాళ్ళు మాకు భయంగానే ఉండింది. సెప్టెంబర్ పదకొండు తర్వాత ఒకరోజు మా గ్రూప్‌లీడర్ - ఆయనా తెలుగువాడే - మా అందర్నీ కాన్ఫరెన్స్ రూమ్‌కి పిలిచి ఒక లెక్చరిచ్చాడు. అబ్బాయిలూ, ప్రస్తుతం పరిస్థితులు బాగా లేవు. అక్కడక్కడా మనవాళ్ళ మీద గూడా అత్యాచారాలు జరుగుతున్న విషయం మీ అందరికీ తెలిసిందే. మీరు జాగ్రత్తగా ఉండటం మంచిది. మీ అభిప్రాయాలెలా ఉన్నా ప్రస్తుతం అందరం అమెరికాను సపోర్ట్ చెయ్యటం అవసరం. ఆఫీసుకొచ్చేటప్పుడూ, అలా షాపింగుకూ సినిమాలకూ వెళ్ళేటప్పుడూ అమెరికన్ ఫ్లాగ్ ఉన్న టీషర్టులు వేసుకోండి. చొక్కాల మీద వేసుకునే ఫ్లాగ్ పిన్నులు కొనుక్కోండి. అమెరికా పోలసీలకు

వ్యతిరేకంగా ఎక్కడా మాట్లాడబాకండి అని సలహా ఇచ్చాడు. మాకందరికీ తలా ఒక టీషర్ట్ ఇచ్చాడు కంపెనీ తరఫున. నాకు ఇచ్చింది ఇదీ," అని టీ షర్ట్ వెనుక వున్న కథ చెప్పాడు రంగారావు.

"అంటే అక్కడుండదలిస్తే అమెరికాని సపోర్ట్ చెయ్యాలి. లేకపోతే ఒళ్ళు సుద్ధం చేసి వీసా పీకేసి ఇంటికి పంపిస్తారంటావు?" అన్నాడు వెంకటేష్.

"మరి మా దేశంలో ఉద్యోగం కావాలని ఏడ్చేవాళ్ళు మమ్మల్ని సపోర్ట్ చెయ్యాల్సిందే అంటే తప్పేముంది అందులో?" అన్నాడు రంగారావు.

"నిజమేననుకో. మరి మా దేశం స్వతంత్ర దేశం. ఎవరికి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు మాట్లాడొచ్చు అని చెప్పుకుంటుంటారుగా అమెరికా వాళ్ళు."

"మామూలు పరిస్థితుల్లో అది నిజమే. ప్రస్తుతం పరిస్థితులు బాగా లేవు," అన్నాడు రంగారావు.

"మరి అమెరికావాళ్ళు మనోళ్ళను సమానంగా చూస్తారా? లేక నల్లోళ్ళను చూసినట్టు చూస్తారా?" అన్నాడు వెంకటేష్.

"సమానంగానే చూస్తారు. అసలు ఇంకొక విషయం చెప్పాలి నీకు. అమెరికాలో నల్లోళ్ళకీ తెల్లోళ్ళకీ అంత పెద్ద తేడా లేదు. అప్పుడెప్పుడో ఉండేది నిజమే. ఇప్పుడు అంతా మెరిట్‌కే ఇంపార్టెన్స్," అన్నాడు రంగారావు కొంచెం విసుగ్గా.

ఆ మాటలు కాస్త ఎడంగా ఉన్న రత్తయ్యకు కుతూహలం కలిగించాయి.

"అబ్బాయ్. మీ మాటలు నా చెవిని పడతానే ఉండయ్. ఇంటుంటే నాకు మీ తాత రంగయ్య గుర్తుకొచ్చాడు. అసలు నీకు మీ తాత గుర్తేనా?" అని అడుగుతూ సుబ్బయ్య దగ్గర నుంచి లేచి రంగారావు కూర్చున్న మంచం దగ్గరకొచ్చాడు రత్తయ్య.

"మా తాత... ఆయన గురించి నాకెక్కడ తెలుస్తుంది? నేను పుట్టకముందే పోయాడుగా," అన్నాడు రంగారావు.

"పోయాడులే... అందుకేగా ఆయన పేరు నీకు పెట్టి రంగయ్యని రంగారావు చేశారు."

"ఆయనెందుకు జ్ఞాపకమొచ్చాడు నీకిప్పుడూ?"

"అదొక పెద్ద కతలే."

"ఏం కతా," అని అడిగాడు వెంకటేష్.

"ఇంటానంటే సెబుతా. ఇప్పుడు మన రంగారావు అమెరికా బోలా? అట్టాగే రంగయ్యా, నేనూ పడమటి నుంచి ఈ ఊరు జీతానికుండటానికొచ్చాం."

"అంటే మీది ఈ ఊరుగాదా మొదట్నించీ?"

"కాదు, కాదు. వీళ్ళ తాతా, నేనూ మేం గొర్రెపాటోళ్ళం. మా ఊరు ఇక్కడికి ఐదు మైళ్ళుంటది పడమటగా. పోవటానికి రావటానికి రోడ్డూ అదీ లేదు. అప్పుడూ లేదు. ఇప్పుడూ లేదు. ఆ ప్రాంతం అంతా యెర్రనేలై బొత్తిగా పంటలు పండేయిగాదు. యెంత కష్టపడి వొళ్ళు గుల్ల జేసుకున్నా తిండి గింజలగ్గూడా కష్టంగా ఉండేది. అందుకే ఎగసాయం నేర్చిన కుర్రోళ్ళు ఇట్టాటి తూర్పుటూళ్ళల్లో జీతాల





కుండటానికొచ్చేవోళ్ళు. ఈ సదువుకున్న కుర్రోళ్ళు, మీలాంటోళ్ళు, అమెరికా బోవటంలా? అట్టాగే. రంగయ్యకి ఈ ఊరొచ్చేటప్పటికి పదేనో పదారో ఉండేయి. రంగయ్యొచ్చినాక నాలుగేళ్ళకు గామాల నేనొచ్చా. కొన్నాళ్ళిక్కడుండాక రంగయ్యకి ఈ ఊరు బాగా అలవాటయిపోయింది. పదేళ్ళు జీతానికుండి ఏదో సంపాయిచ్చుకోని ఊరికిబోదాంలే అనుకోని వొచ్చినోడు, మళ్ళా ఆ యెర్రమట్టిలోకేం బోతాంలే అనుకున్నాడు. కూడబెట్టిన జీతం డబ్బుల్తో రొండెద్దుల్ని కొని అరగ్గట్టాడు బాడిక్కి. రొండు మూడేళ్ళయింతర్వాత రొండెకరాలు పొలం గొన్నాడు. ఇదుగో ఇప్పుడు వీళ్ళుంటున్న ఇల్లు గట్టాడు. ఇక్కడకొచ్చి బాగుపడ్డాం గదా అని ఈ ఊరి మీద ఈగని గూడా వాల్నిచ్చేవోడు గాదు. ఇందాక అబ్బాయి రంగారావు అమెరికాను ఎనకేసుకొత్తంటే వాళ్ళ తాత గేపకమొచ్చాడు నాకు."

"అంటే ఈ ఊరికీ ఇంకొక ఊరికీ తగాదా వొస్తే ఈ ఊరిని బాగా సపోర్ట్ చేసేవాడా ఆయన?" అడిగాడు వెంకటేష్.

"అట్టా గాదులే. ఈ వూళ్ళో అప్పుడప్పుడూ రాజకీయాల మీద తగువులొచ్చి తలకాయలు బగలగొట్టుకునేదాకా వొస్తుండేది. అప్పుడు గూడా రంగయ్య ఈ వూరిని పొగడతా ఉండేవాడు. మన పడమటూళ్ళల్లో రాజకీయాలంటే యేంటో గూడా తెలిసి చావకపోయె జనానికీ అనేవోడు."

"మరి తాతకు రాజకీయాలంటే చాలా ఇష్టమా?" అని అడిగాడు రంగారావు.

"రంగయ్యకి రాజకీయాల మీద అసలు సూపే లేదు. కానీ మా అందరికీ, అంటే పడమటి ఊళ్ళ నుంచొచ్చి ఇక్కడ జీతాలకుంటున్న నాలాంటోళ్ళకి ఇరవైమందికి, రంగయ్యే పెద్దదిక్కుగా ఉంటుండేవోడు. అది ఈ ఊరివాళ్ళకు నచ్చలా."

"అంటే? ఎందుకనీ? దీనివెనకేదో కథ ఉన్నట్లుందే?" అని అడిగాడు వెంకటేష్ కాస్త ముందుకు కూర్చుంటూ మంచం పట్టె మీద.

"పడమటోళ్ళంటే కాస్త చిన్నచూపుగానే ఉంటుండేది ఈ వూళ్ళో. రంగయ్యేమో ఇక్కడ నిలదొక్కుకున్నాంగదా, మనంగూడా ఈ వూరి వాళ్ళతో సమానమే అనుకుంటుండేవాడు. కాకపోతే ఆ కూరగాయలమ్మి కేసుతో తన సోటేంటో బాగా తెలిసొచ్చింది రంగయ్యకి."

"ఆ కేసేంటో కాస్త చెప్పు తాతా," అడిగాడు వెంకటేష్.

"మా వూరి నుంచి ఒకామె వొస్తుండేది కూరగాయలమ్ముకోవటానికి. ఇటొచ్చినప్పుడల్లా మా ఇళ్ళ కాణ్ణించి మంచీ చెడ్డా తెలుసుకోని వస్తుండేది. ఆమె గుండా యిళ్ళ కాడ సంగతులు తెలుస్తుండేయి మాకు. వొచ్చినప్పుడల్లా రంగయ్యగారింట్లోనే, ఇక్కడే, ఒక ముద్ద తిని పోతుండేది. ఒకసారి కూరగాయల బేరం కాడనే ఆ బజార్లో కరణం సీతారామయ్య పెళ్ళానికీ, ఈ కూరగాయలమ్మికీ ఏదో తగాదా వొచ్చింది. పెద్దపెద్ద మాటలే అనుకున్నారంట. ఆ తర్వాత రొండు రోజులకి కరణంగారి పడమటి పొలాన పొగతోటలో యెవురో పొగమొక్కలు పీకేశారు. కూరగాయలమ్మి మొగుడే పీకేశాడని కరణంగారి మడుసులన్నారు. ఇక ఈ ఊళ్ళో కూరగాలమ్ముకోవటానికొస్తే తంతావన్నారంట. దాని మొగుడేమో పొలాన ఎక్కడో రంగయ్య గనపడితే, ఆ పొగమొక్కలకీ తనకీ ఏమీ సంబంధం లేదని మొరబెట్టుకున్నాడంట.




రంగయ్యేమో వూళ్ళో యెక్కడో అన్నాడంట పొగమొక్కలెవురు బీకారో గాని, దానికీ కూరగాయలమ్మికీ ఏమీ సంబంధం లేదని. యిక అక్కడే వొచ్చింది యిబ్బంది."

"ఏం జరిగింది తర్వాత?" అడిగారు అందరూ.

"ఒకనాడు సీతారామయ్యగారి మనుమడొచ్చి ఇదుగో మేం ఇట్టాగే కూర్చోనుంటే, 'రంగయ్యని పిల్చుకోని రమ్మంటున్నాడు మా తాత' అని చెప్పిపోయాడు. 'ఏంటో కనుక్కుందాంరా రత్తయ్యా' అని నన్నూ తోడుగా రమ్మంటే మేమిద్దరం కలిసిపోయాం కరణంగారింటికి."

'రాండి, రాండి రంగయ్యా. బాగున్నావా?' అంటా పలకరిచ్చాడు కరణం.

'ఏదో మీ దయ,' అన్నాడు రంగయ్య మాటవరసకి.

'ఇంకా మా దయ ఎక్కడ జచ్చిందిలే. నువ్వు పెద్దమడిసివైపోయావుగా ఇప్పుడు. ఇంకా మా దయతో ఏం అవసరం నీకు?' అన్నాడు కరణం.

'అదేంటి అట్టంటున్నారు?' అన్నాడు గాబరా పడిపోయి రంగయ్య.

'ఏం లేదులే. రా కూర్చో. మాట్టాడుకుందాం,' అని మంచం మీద కూర్చోబెట్టి, మా యిద్దరికీ మంచినీళ్ళిప్పించి, మళ్ళీ మొదలుబెట్టాడు కరణం.

'రంగయ్యా, నువ్వు మా వూరొచ్చి పదేనేళ్ళో యేమో అవతంది గదూ? కష్టపడ్డావు. బాగుపడ్డావు. సుకంగా వుంటున్నావు. అట్లాగే పోనియ్యరాదూ? మంచిచెడ్డా తెలిసినోడివి. నిజమే. అయినా తప్పెవురుదో రైటెవరుదో తీరుపు జెప్పటానికి మా వూళ్ళో పెద్దమడుసులుండారుగా. ఆ యిసయాలు వాళ్ళకే వొదిలేస్తే పోలా?' అని సలా యిచ్చాడు.

తర్వాత ఎవురూ యేమీ మాట్టాళ్ళా. కొంచెంసేపుండి మేం వొచ్చేశాం. తిరిగి ఇంటికొచ్చేటప్పుడు రంగయ్య ఒక్కమాట గూడా మాట్టాళ్ళా. ఇంటికొచ్చాక ఇక్కడే అరుగుమీద కూసోని - 'రత్తయ్యా, యెర్రనేల బాగుజేసుకోని పండిచ్చుకోవటం చేతయితే మనం మనూళ్ళోనే ఉండిపోయేవాళ్ళంగదూ?' అన్నాడు. నేనేమీ మాట్టాళ్ళా. ఊరికే తలూపా.

'ఎవరి పొలం వాళ్ళు బాగు జేసుకోవాలిగాని ఎదిటివాడి పొలం బాగుంది గదా అని అక్కడ చాకిరి జేస్తే జీతగాళ్ళం అవుతాంగాని ఆసాములమవతామా?' అన్నాడు మళ్ళా.

'ఆ మాటలు నాకు బాగా గుర్తు. ఆ తర్వాత రంగయ్య ఇక కోలుకోలా. నాలుగైదేళ్ళల్లో పోయాడు. ఏదో గుండెజబ్బు అన్నారు. అంత చిన్నవయసులో ఎందుకు పోయాడోగాని ఆ రోజు తర్వాత మాత్రం రంగయ్యలో పెద్ద మార్పొచ్చింది. తన పనేంటో తప్ప యెవుర్నీ పట్టిచ్చుకోలా. తలొంచుకొనే తిరిగాడు చివరిదాకా," అని ముగించాడు రత్తయ్య బొంగురుబోతున్న గొంతుతో.

*ప్రజాతంత్ర, 2002*



# ప్రగతి ప్రభ

పాతాళరాజ్యం ఒక పెద్ద సంపన్నమైన దేశం. దాన్ని ఇరవై అయిదు సంవత్సరాలు పాలించాడు పాతాళ మహారాజు. ఆయన అధికారానికి తిరుగుండేదికాదు. పొరుగు దేశాల రాజులు స్నేహంగా, అనుకూలంగా ఉండేవారు. లేదా ధిక్కరించి చావు తెచ్చుకునేవారు. వారి రాజ్యాలు పాతాళ రాజ్యంలో భాగాలయ్యేవి. సైనిక బలంలో పాతాళ రాజ్యానికి సరిపడగల దేశం మరొకటి లేదు అది అప్పటి విషయం.



పాతాళ మహారాజు స్వర్గవాసులై నాలుగు సంవత్సరాలవుతుంది. ప్రస్తుతం సింహాసనం మీద ఉన్నది వారి ఏకైక పుత్రుడు శ్రీరాజు. వారికి రాజ్యపాలన మీద అంత శ్రద్ధ లేదు. పైగా ఎనిమిది మంది రాణులు. వారితో రోజుకు ఇరవై నాలుగు గంటలు సరిపోవటం లేదు. ఇక సింహాసనం సంగతేం పడుతుంది? ఇదీ ఇప్పటి పరిస్థితి.

కాని మంత్రిగా ఉండి పాతాళ మహారాజుకి అతి చాకచక్యంగా సేవలు చేసిన భట్టుమూర్తి ప్రస్తుతం శ్రీరాజుకు అదే పదవిలో ఉండి సేవలు చేస్తున్నాడు. నిజానికి రాజ్యపాలన నడుపుకొస్తుంది ఆయనే. ఆయనకు శ్రీరాజు అంటే అమితమైన ప్రేమాభిమానాలు. కారణం రాజుగారి భార్యల్లో ఒకతె తన కూతురు కావటం కావచ్చు.

ఒకరోజు శ్రీరాజును కలిశాడు భట్టుమూర్తి.

ఉభయకుశలోపరి తర్వాత, “మహామంత్రి. మీరేదో విచారంలో మునిగి ఉన్నట్లు కనిపిస్తున్నారు. ఏమిటీ విశేషాలు?” అని అడిగాడు శ్రీరాజు.

“మహాప్రభూ! రెండు సంవత్సరాల క్రితం మనకు పడమటి సరిహద్దుల్లో ఉన్న సపైన దేశంలో తిరుగుబాటు జరిగిన విషయం మీకు తెలిసిందే.”

“అవును మహామంత్రీ. అప్పుడు మీరు సైన్యాన్ని పంపించి సపైన దేశ మహారాజుకు అండగా నిలిచి ఆ తిరుగుబాటు జరిపిన ద్రోహులను హతమార్చారుగదా.”

“అవును మహారాజా! కాని ఆ తిరుగుబాటు పూర్తిగా హతమైనట్లు లేదు. ఆనాటి విత్తనాలు కొన్ని ఇప్పుడు మొలకెత్తుతున్నట్టున్నాయి. ప్రజారాజ్యం కావాలంటూ సపైన మహారాజుని తొలగించడానికి కొందరు ప్రయత్నిస్తున్నట్టు మన గూఢచారుల ద్వారా తెలుస్తోంది.”

“ప్రజారాజ్యం అంటే ఏమిటీ మహామంత్రీ?”

“కొందరు పొగరుబోతు నాయకులకు రాజ్యం చెయ్యాలనే కోరిక ఉంది మహాప్రభూ. రాజవంశాన్ని హతం చేసి తామే రాజ్యం చెయ్యాలని వారి కోరిక. ప్రజలు తమనే సమర్థిస్తున్నారని ప్రచారం చేస్తున్నారు. ప్రజల ఇష్టానుసారం రాజ్యానికొస్తాం గాబట్టి మేము చెయ్యబోయే పరిపాలన ప్రజారాజ్యం అవుతుంది అంటున్నారు.”

“ఎంత అహంకారం! మరి సపైన మహారాజుకి సహాయంగా మన సైన్యాన్ని పంపించక పోయారా? ఇలాంటి దుష్టులను నామరూపాలు లేకుండా హతమార్చాలి.”

“ఇదివరకు ఒకసారి సైన్యాన్ని పంపించి సపైన మహారాజుని ఆదుకున్నాం. దానికి చాలా ఖర్చయింది. మళ్ళా సైన్యాన్ని పంపించాలంటే, ఖర్చు గురించి ఆలోచించక తప్పదు.”

“నిజమే మహామంత్రీ. మరి వేరే మార్గం ఏదైనా ఆలోచించారా?”

“మీరు అనుమతిస్తే మహాప్రభూ, పొరుగుదేశంలో ప్రజారాజ్యం వస్తే మనకు మంచిది అనిపిస్తుంది.”





“ఆశ్చర్యంగా ఉందే. అదెలాగో వివరించడం మహామంత్రీ.”

“మహాప్రభూ! మీ తండ్రిగారి హయాంలో సపైన మహారాజు మనకు లొంగి ఉండేవాడు. కాని, వారు స్వర్గవాసులయిన తర్వాత మనం అతడికి చేసిన సహాయం కూడా మర్చిపోయి, అప్పుడప్పుడు మనకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాడు. అతన్ని దారిలోకి తీసుకురావాలంటే యుద్ధం చేసి ఓడించాలి. లేక మరొక విధంగా లొంగదియ్యాలి. యుద్ధంతో అవసరం లేకుండా అతణ్ణి లొంగదీసే అవకాశాన్ని మనకు అందిస్తుంది ఈ ప్రజారాజ్యం.”

“అదెలా మహామంత్రీ?”

“ప్రజారాజ్యం తీసుకురావాలని ప్రయత్నం చేస్తున్నవాళ్ళలో ఐదారుగురు ప్రముఖులున్నట్లు మన గూఢాచారుల ద్వారా తెలుస్తుంది మహాప్రభూ. వీళ్ళలో ఎవడో ఒకడు చివరకు నెగ్గుతాడు. ఆ నెగ్గే వాడెవడో మనమే నిర్ణయిస్తే వాడు మన చెప్పుచేతల్లో పడి ఉంటాడు.”

“అదెలా సాధ్యం మహామంత్రీ. ప్రజలకు ఇష్టమైనవాడే రాజ్యాధిపతి అవుతాడన్నారుగా ఇంతకు ముందు?”

“అవును ప్రభూ. ప్రజలు ఎవరి వెనుక నిలబడితే వాడే అధికారానికొస్తాడు. కాని ఎవడు ఎక్కువగా మేలు చేస్తాడో వాణ్ణే గదా ప్రజలు సమర్థించేది. మనం ఈ నాయకుల్లో ఒకడికి ధనసహాయం అందించామంటే వాడు ప్రజలకు తిండి బట్టలు పంచిపెట్టి వారి అభిమానాన్ని పొందుతాడు. రాజ్యానికొస్తాడు. మన చెప్పుచేతల్లో ఉంటాడు.”

“యుద్ధం చేసి సపైన దేశాన్ని లొంగదియ్యటం కంటే ఇది తక్కువ ఖర్చుతో జరుగుతుందంటారా మహామంత్రీ?”

“నా అంచనా అదే మహాప్రభూ.”

“మనం వారి దేశంలో జోక్యం చేసుకుంటుంటే చూస్తూ ఊరుకుంటాడా సపైన మహారాజు?”

“అతడి పరిస్థితి ఇప్పుడు బాగాలేదు మహాప్రభూ. ఈ తిరుగుబాటు వల్ల చాలా దీనమైన స్థితిలో ఉన్నాడు.”

“అలా అయితే యుద్ధంలో సులభంగా ఓడిపోయేవాడేమో?”

“నిజమే మహాప్రభూ. కానీ ఎంత బలహీనుడితో యుద్ధం చేసినా మనం కూడా కొంత నష్టపడతాం. కొందరు సైనికులు చచ్చిపోతారు. వారి కుటుంబాలను మనం పోషించాల్సి వస్తుంది. ఇదంతా చాలా వ్యయంతో కూడిన పని. ఈ ప్రజారాజ్యాన్ని సమర్థించటంలో మనకు నష్టం వచ్చే అవకాశమే లేదు.”

“అయితే మంచిదే మహామంత్రీ. అలాగే కానివ్వండి.”





## 2

కొన్నాళ్ళు సపైన రాజ్యంలో తిరుగుబాటు చేస్తున్న వారందరికీ కొద్దో గొప్పో ఆర్థిక సహాయం అందించాడు భట్టు. సపైన మహారాజు నామమాత్రంగా రాజ్యం చేస్తూ, పరిపాలనను ప్రజలు నిర్ణయించిన వాడి చేతికే అప్పగించటానికి ఒప్పుకున్నాడు. ప్రతి ప్రజా నాయకుడూ భట్టు దగ్గరకు దూతలను పంపించాడు మరింత సహాయం కావాలనీ, తను నెగ్గితే భట్టుగారి సహాయం మర్చిపోననీ. వీళ్ళల్లో ఒక్కడిని ఎంపిక చేసుకునే సమయం వచ్చింది భట్టుకు. తెలివితేటలు గలవాడు, తప్పకుండా ప్రజల అభిమానం కొనగలిగినవాడు, ప్రభుత్వానికి వచ్చిన తర్వాత మాట మార్చకుండా తన చెప్పుచేతల్లో ఉంటాడన్న నమ్మకం ఉన్నవాడు అయిన ఒకడిని ఎంపికచేసుకున్నాడు భట్టు. అతణ్ణి గెలిపించాడు.

సపైన రాజ్యం ఇప్పుడు భట్టుగారి తోలుబొమ్మ పరిపాలనలో ఉంది.

సపైన రాజ్యమేగాదు, ప్రజారాజ్యంలో ఉన్న కిటుకులు క్షుణ్ణంగా అధ్యయనం చేసిన భట్టు పొరుగు దేశాలన్నిట్లోనూ ప్రజారాజ్యం కావాలనే తిరుగుబాట్లను సృష్టించాడు. ప్రతి దేశంలోనూ ఒక నాయకుణ్ణి బాగా మేపాడు. ప్రజలు తన తోలుబొమ్మనే సమర్థించేలా చెయ్యటం ఎలాగో భట్టుమూర్తికి బాగా తెలుసు. దానికి ఎంత ఖర్చు అవుతుందో, ఆ ఖర్చు పాతాళదేశం భరించినందువల్ల కలిగే లాభం ఏమిటో జాగ్రత్తగా ఆలోచించాడు.

రెండు మూడు సంవత్సరాల్లో పాతాళ దేశపు ఇరుగు పొరుగు రాజ్యాలన్నిట్లోనూ ప్రజారాజ్యం వచ్చేసింది. అన్ని దేశాల్లోనూ భట్టుగారి తోలుబొమ్మలు అధికారానికొచ్చారు.

ఇదంతా ఎంతో గూఢంగా చెయ్యటానికి ప్రయత్నించినా, ప్రజారాజ్యాల పెంపు వెనుక ఉన్న హస్తం భట్టుగారిది అని అన్ని దేశాలలో అందరికీ తెలిసిపోయింది. దానివల్ల వచ్చిన నష్టం లేకపోగా, పాతాళదేశ పరపతి పెరిగింది. దాని అధికారానికి ఇప్పుడు తిరుగులేదు. రాజ్యాలు పోగొట్టుకున్న ఇరుగు పొరుగు రాజవంశీయులందరూ శ్రీరాజును అల్లుడుగా చేసుకోవాలని తాపత్రయపడుతున్నారు. శ్రీరాజుగారి భార్యల సంఖ్య ఇప్పుడు ఇరవైకి పైగా పెరిగింది.

## 3

పాతాళ దేశానికి దక్షిణంగా రెండు మూడు దేశాల తర్వాత మిరపదేశం అనే ఒక దేశం ఉంది. అక్కడ కూడా భట్టుగారి తోలుబొమ్మ ఒకడు ఐదు సంవత్సరాలుగా అధికారంలో ఉన్నాడు. ఈసారి ఎన్నికలలో కూడా తనే నెగ్గుతాననే నమ్మకంతో ఉన్నాడు. కాని మిరపదేశంలో మరొక నాయకుడికి ఒక కొత్త ఆలోచన వచ్చింది. ఈ ప్రజారాజ్యాల్లో ఎక్కడా ప్రజల అధికారం చలామణిలో ఉన్నట్లు లేదే! దానికి కారణం ఏంటీ? అని సుదీర్ఘంగా ఆలోచించాడు. కారణం గ్రహించాడు. ప్రజలు తిండి గింజలకో, బట్టలకో, డబ్బుకో అమ్ముడుబోతున్నారు. అవి ఎవడు అందిస్తే వాడిని ఎన్నికల్లో సమర్థిస్తున్నారు. ఆ గెలిచినవాడు మళ్ళా ఎన్నికల దాకా వీళ్ళ ముఖం చూట్టం లేదు. అదీ వాస్తవం. కాని రేపటి అవసరాలు



తీరని వాళ్ళ మీద వీళ్ళకి దూరపు చూపు లేదని కోపగిస్తే ప్రయోజనం ఏముంటుంది? ప్రజల విషయంలోనేగాదు, నాయకుల విషయం చూసినా, అందరూ ఆ పాతాళ దేశానికి ఎందుకు బానిసలవు తున్నట్లు? దీనికి కూడా సమాధానం ఈ నాయకుడు సులభంగానే గ్రహించాడు. ప్రజల్లో గుర్తింపు రావాలంటే ఏదో విధంగా తన గురించి ప్రచారం చేసుకోవాల్సిందే ప్రతి నాయకుడూ. దీనికి చాలా డబ్బు కావాలి. ఆ డబ్బు పాతాళదేశం వాళ్ళు ప్రజారాజ్య స్థాపన అనే నెపం మీద సరఫరా చేస్తున్నట్టు అందరికీ తెలిసిన విషయమే. అందువల్ల ఈ నాయకులందరూ పాతాళదేశానికి తొత్తులు కావటం జరుగుతుంది.

మిరపదేశం నాయకుడు, అతని పేరు సలవదొర. అతడు ఒక యోచన చేశాడు. తన దేశంలో ఎన్నికలకు సంవత్సరం ముందుగానే మిత్రబృందాన్ని పోగు చేశాడు. ఒక్కొక్కణ్ణి ఒక్కొక్క గ్రామానికి పంపి, ఊరికొక సహాయక బృందాన్ని తయారుచేశాడు. ఎన్నికల్లో ఎవ్వరూ అమ్ముడుపోవద్దు, అధికారాన్ని అమ్ముకోకుండా మన చేతుల్లోనే ఉంచుకుంటే, ఐదు సంవత్సరాల కొకసారి కాకుండా, ఐదు సంవత్సరాల పొడుగూతా ప్రజల ప్రగతికే అధికారాన్ని ఉపయోగించుకోవచ్చని ప్రచారం చేశాడు. చాలా తక్కువ ఖర్చుతో, ప్రజా బృందాల సహాయంతో ఎన్నికల ప్రచారం సాగించాడు. ప్రజలకు డబ్బివ్వటం పోయి, ప్రజలే అతని ప్రచారానికి సహాయంగా కొద్దికొద్దిగా వీలైనంత వరకే చిల్లర డబ్బులందించారు.

భట్టుగారికి ఈ విషయాలు గూఢచారుల ద్వారా తెలిశాయి. మిరపదేశాన్ని పాలిస్తున్న నాయకుడికి ఎంత కావాలంటే అంత సహాయం అందిస్తానని కబురు పంపాడు. ఎలాగైనా సలవదొరను పైకి రానివ్వగూడదని చెప్పమన్నాడు. ఈ ఎన్నికల్లో తన తోలుబొమ్మ గెలవటం తన పరువు ప్రతిష్ఠలు నిలుపుకోవటానికే కాదు, మిరపదేశంలో ఉన్న ఖనిజాలు పాతాళదేశ సైన్యానికి, దేశ అభివృద్ధికీ చాలా అవసరం. అందువల్ల ఖర్చుకు వెనుకాడకుండా మిరపదేశంలో కాసుల వాన కురిపించాడు భట్టు.

కాని విచిత్రాలు అప్పుడప్పుడూ జరుగుతుంటాయి గదా! మిరపదేశం ఎన్నికల్లో సలవదొర నెగ్గాడు. అదీ ఏదో కొద్దిలో గెలిచాడులే అనుకోవటానికి వీల్లేదు. నూటికి అరవైమంది ప్రజలు సలవదొరే తమ ప్రతినిధి అన్నారు. ఈ గెలుపుతో ప్రజలకు మతిపోయినట్లయింది. వీధుల్లో పడ్డారు. పాటలు పాడారు. గంతులు వేశారు. పండుగ చేసుకున్నారు. ఉప్పొంగిపోయారు. భట్టుగారి గూఢచారులు గమనిస్తూనే ఉన్నారు.

ఎన్నికల్లో గెలిచిన పదిరోజుల్లోనే సలవదొర తన ఎన్నికల వాగ్దానాల ప్రకారం మిరపదేశ భూగర్భ సంపదలన్నీ మిరపదేశ అభివృద్ధికి మాత్రమే ఉపయోగపడాలన్నాడు. ఖనిజాల ఎగుమతి దేశావసరాలు తీరిన తర్వాతే అన్నాడు. వీడికి తిక్కరేగిందని సమాచారం అందింది భట్టుకు.

## 4

“సార్వభౌమా! నమస్సులు,” నమస్కరించాడు భట్టు.

ప్రపంచాధికారాన్ని నెరుపుతున్నవాడికి తగినట్లుగా ఇప్పుడు శ్రీరాజు బిరుదు ‘సార్వభౌముడు’ అయ్యింది.

"స్వాగతం మహామంత్రీ. ఏదో విషయం గురించి వెంటనే సంప్రదించాలన్నారట. ఏమిటి విశేషం?"

"సార్వభౌమా! ప్రజారాజ్యం ప్రపంచం అంతటా విస్తరించింది. అందువల్ల ప్రతి దేశంలోనూ మనకు అనుకూలంగా ఉన్న వాళ్ళే అధికారంలో ఉన్నారు. కాని ప్రజారాజ్యం మచ్చలేని వ్యవస్థ కాదు. ఏదో ఒక సందర్భంలో అధమ జాతివాడో, బుద్ధిహీనుడో అధికారానికొచ్చే అవకాశం ఉంది. ఇప్పుడు మనకు దక్షిణంగా సుదూరంలో ఉన్న మిరపదేశంలో ఒక చపలచిత్తుడు ప్రజల అభిమానాన్ని చూరగొన్నాడు. మనకు అతి ముఖ్యమైన ఖనిజ వ్యాపారం చేస్తున్న మన దేశ వర్తకులను దేశం వదలి వెళ్ళిపొమ్మన్నాడు. మిరపదేశ అభివృద్ధికి మాత్రమే తమ ఖనిజ సంపదను ఉపయోగిస్తాడట. అతడిని రాజ్యం చెయ్యనిస్తే అలాంటివాళ్ళు ఇతర దేశాల్లో కూడా రాజ్యానికొచ్చే ప్రమాదం ఉంది."

"అలాగా! అలా జరగకూడదు. ఆ అధముణ్ణి తుడిచి పారేయండి. ప్రజారాజ్యపు మంచి పేరుకు ఎలాంటి కళంకం రాకుండా చెయ్యండి."

"మీ ఆజ్ఞ సార్వభౌమా. వెళ్ళొస్తాను," అని సెలవు తీసుకున్నాడు భట్టు.

## 5

పాతాళ దేశ సైన్యాన్ని ఉపయోగించకుండానే సలవదొర ప్రభుత్వాన్ని దించెయ్యాలని నిర్ణయించాడు భట్టు. మిగతా దేశాల్లో లాగానే మిరపదేశంలో కూడా పెద్ద పెద్ద పదవుల్లో ఉన్నవారిలో కొందరు భట్టు తొత్తులున్నారు. వారిలో ప్రముఖుడు సేనాపతి అగస్త్యుడు. అతనికి గూఢచారితో కబురు పంపించాడు భట్టు. సలవదొర వారంరోజులకు మించి బ్రతకగూడదన్నాడు. తన కోరికను వెంటనే తీరిస్తే ముందురోజుల్లో నిన్నే మిరపదేశానికి ప్రభువును చేస్తానని అభయమిచ్చాడు.

మరుసటి రోజే మిరపదేశ సైన్యం సలవదొర మీద తిరుగుబాటు ప్రకటించింది. ముఖ్య నగరంలో పరిపాలనకు సంబంధించిన భవనాలన్నింటినీ చుట్టుముట్టింది. సలవదొరను, అతని మంత్రివర్గాన్ని అందరినీ సజీవంగా తగలబెట్టింది. అగస్త్యుడు రాజ్యాధికారం చేపట్టాడు.

పూర్వం రాజును చంపగానే రాజ్యం చేజిక్కేది. మామూలుగా ప్రజా రాజ్యాల్లో కూడా అధికారంలో ఉన్న వర్గాన్ని ఓడిస్తే అధికారం దాసోహం అనేది. కాని మిరపదేశంలో ఒక చిక్కొచ్చింది. ప్రతి గ్రామంలోనూ సలవదొరను సమర్థించిన సన్నకారు ప్రజలు వీధుల్లో కొచ్చారు. పాతాళదేశ తొత్తుని అధికారానికి రానివ్వమన్నారు. మిన్ను ముట్టేట్టు నినాదాలు చేశారు. బహిరంగ సభలు జరిపారు. కానీ, ప్రజలు తమ గొంతులకున్న శక్తిని ఎక్కువగా అంచనా వేశారు. రెచ్చిపోయారు. ప్రజావాక్కుకి తిరుగు లేదనుకున్నారు. అగస్త్యుడి అధికార యజ్ఞంలో సమిధలయ్యారు.

భట్టు శాంతించాడు. సంతోషించాడు. తన పన్నెండు సంవత్సరాల పరిపాలనలో, అంటే పేరుకి శ్రీరాజు పాలనే అనుకోండి, అయినా ఈ పన్నెండు సంవత్సరాల్లో, తన సైన్యంతో పని లేకుండా ఒక దేశాన్ని అదుపులోకి తీసుకురాగలిగింది ఇదే మొదటిసారి. మీసం దువ్వాడు భట్టు.



కానీ, ఆ సంతోషం ఎక్కువకాలం అనుభవించలేకపోయాడు. గూఢచారులు పొరుగుదేశాల నుంచి చెడు వార్తలు మోసుకొచ్చారు. ప్రతి దేశంలోనూ పాతాళదేశానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరుగుతున్నాయి. పాతాళదేశం నరబలి కోరే రాక్షసి అనీ, ఇతర దేశాలన్నిటినీ తన గుప్పెట్లో పెట్టుకోవాలని చూస్తుందనీ, అవసరమైతే ఏ దేశాన్నయినా నాశనం చెయ్యటానికి వెనుకాడదనీ, ఎంతమందినైనా హత్య చెయ్యటానికి తయారుగా ఉందని - ఇలా దేశదేశాల ప్రజలు బహిరంగంగా విమర్శిస్తున్నారు.

కుక్కలెంత మొరిగినా తొందరగానే అలసిపోతాయిగదా! వాటిని పట్టించుకోవాల్సిన అవసరం లేదు. కానీ, ఈసారి మరొక దేశంలో ఇలాంటి పరిస్థితే వస్తే, ఇంతకన్నా సులభంగా ఆ దేశాన్ని లొంగదీసే విధానం కావాలి. తీవ్రంగా ఆలోచించాడు భట్టు.

## 6

"సార్వభౌమా, నమస్సులు"

"రాండి, మహామంత్రీ, కూర్చోండి. ఏమిటీ విశేషాలు?"

"సార్వభౌమా, మనం మిరపదేశాన్ని లొంగదీసే ప్రయత్నంలో వారి సైన్యం చాలామందిని చంపింది. అందువల్ల, అది మనం ప్రేరేపించిన ఘాతుకమేననీ, మనం ఏ దేశాన్నీ స్వతంత్రంగా బతకనివ్వమనీ, ఇతర దేశాలను లొంగదియ్యటంలో ఎంతమందినైనా హతమార్చటానికి వెనుకాడమనీ చాలా దేశాల్లో చెప్పుకుంటున్నారు. పొరుగుదేశాలను మన ఆధీనంలోకి తీసుకురావటానికి మరొక మార్గం వెతకాలి, సార్వభౌమా."

"దీన్ని గురించి మీరు తప్పక ఏదో మార్గం ఆలోచించే ఉంటారు. చెప్పండి మీ ఉద్దేశం ఏమిటో."

"సార్వభౌమా! మన దేశానికి పర్యటనలకూ, విశ్రాంతికీ వచ్చే పొరుగుదేశాల పాలకులూ, పౌరులూ మన దేశసంపదను, మన ప్రగతినీ చూసి ఆశ్చర్యపడుతుంటారు. మనక్కూడా ఇలాంటి సౌకర్యాలుంటే ఎంత బాగుంటుందీ అనుకుంటుంటారు. కాని వారి దేశాలు మనకంటే చాలా వెనుకబడి ఉండటంవల్ల, వారి కోరికలు కోరికలుగానే మిగిలిపోతాయి. ధనవంతులు కొందరు మనదేశ పర్యటనకు వచ్చినప్పుడు వీలైనన్ని వస్తువులు కొని తీసుకుపోతుంటారు. కాని అలా చెయ్యగలిగేది బహు కొద్దిమంది మాత్రమే. అలా ఏదో కొద్దిమందికే కాకుండా పై తరగతుల పౌరులకు రుణాలిచ్చి మనదేశం నుంచి విలాసవస్తువులను కొనుక్కోగలిగే అవకాశం కల్పిస్తే, మన పరిశ్రమల ఉత్పత్తీ, లాభాలూ పెరుగుతాయి. మన డబ్బు మనకే తిరిగి వస్తుంది. ఈ పొరుగు దేశాల వారు మనకు రుణపడి ఉంటారు."

"ఆలోచన చాలా బాగుంది మహామంత్రీ."

"తమ అనుగ్రహం, సార్వభౌమా. చిరకాలంలోనే మనదేశంలో తయారైన వస్తువులను వాడటం ప్రతిష్ఠా చిహ్నంగా మారుతుంది అన్ని దేశాల్లో. పై తరగతుల వారంతా మన వస్తువులు కావాలని ఎగబడతారు. మన వర్తకులు పొరుగుదేశాల్లో కొన్ని పరిశ్రమలు నెలకొల్పవచ్చు. నాలుగైదు సంవత్సరాల్లో

ప్రతి దేశంలోనూ ప్రముఖులంతా మన వస్తువుల మోజులోనూ, మన నాగరికత మోజులోనూ పడిపోతారు. ఇక వీరిలోంచే గదా ప్రజారాజ్యం చేసేవారు ఎన్నికయ్యేది. మన ఉపగ్రహాల్లో ఎవడు అధికారానికొచ్చినా మనకు లోబడే ఉంటాడు. ఇక యుద్ధాలు చేసే, చేయించే అవసరం ఉండదు."

"చాలా బాగుంది. మహామంత్రీ."

"మధ్య తరగతి వ్యక్తులకే గాకుండా, మనకు అనుకూలంగా ఉన్న దేశాల్లో నాయకులకు గూడా రుణాలిచ్చి, మనదేశం నుంచి యంత్రాలు కొనుక్కోవటానికీ, మన వర్తకులకు వాళ్ళ దేశాల్లో వ్యాపారాలు పెట్టుకునే సదుపాయాలు కల్పించటానికీ, మన దగ్గర యుద్ధ సామగ్రి కొనుక్కోవటానికీ, ఇలాంటి వాటికి వీలు కల్పించవచ్చు."

"నాకొక సందేహం మహామంత్రీ. మన వర్తకులు వాళ్ళ దేశాల్లో వ్యాపారాలు పెట్టుకోవటానికి ఆ దేశాల వాళ్ళెందుకు ఖర్చు పెడతారు? ఇతర దేశాల వర్తకులకు మనం అటువంటిదేదీ చెయ్యటం లేదుగదా? చేస్తున్నామా?"

"లేదు, సార్వభౌమా. కానీ మన వర్తకులూ, మన పరిశ్రమలూ లేకపోతే వెనుకబడి పోతామనే భ్రమ అన్ని దేశాల్లోనూ కల్పించాలి. ఆ తర్వాతే రుణాలివ్వాలి. మన వర్తకుల ఖర్చులు ఆ దేశాల వాళ్ళే పెట్టుకునేటట్టు చూడాలి. అలా పెట్టుకోవటమే ప్రగతి అనే భ్రమ కల్పించాలి. అప్పుడు మన వర్తకులకు ఎక్కువ లాభం వస్తుంది. మనకూ మేలు జరుగుతుంది."

"చాలా బాగుంది. కానీ మరొక సందేహం. యుద్ధ సామగ్రి ఇతర దేశాలవారికి అమ్మితే వాళ్ళు మన ఆయుధాలతో మనమీదకే యుద్ధానికొస్తే?"

"అలాంటి ప్రమాదం రాదు, సార్వభౌమా. మన సైన్యానికి పనికిరాని ఆయుధాలను మాత్రమే అమ్ముదాం. వాటితో మన మీద యుద్ధం చెయ్యలేరు. అదీగాక, ఈ పొరుగుదేశాల వారు చుట్టుపక్కల ఉన్న రాజ్యాలతో యుద్ధాలు చేస్తూ ఉంటేనే మనకు మంచిది. యుద్ధాలు దేశాలను బలహీనపరుస్తాయి. వాళ్ళు బలహీనులుగా ఉండటమే మనకు అనుకూలం."

"మీ ఆలోచనలు చాలా బాగున్నాయి, మహామంత్రీ. కానీ, ఒక్కొక్కసారి రుణం తీసుకున్నవాడు రుణం ఇచ్చినవాడి మీద అధికారం చెలాయిస్తాడంటారూ..."

"నిజమే, సార్వభౌమా. కాని వీళ్ళు రుణాలు తీసుకోవటం మన వస్తువులు కొనుక్కోవటానికే గాబట్టి వీళ్ళు మన చేతుల్లోనే ఉంటారు. పైగా మన వర్తకులు ఈ దేశాల్లో పెట్టే పరిశ్రమలు ఆ దేశాల వారికి జీవనోపాధి కల్పిస్తాయి. ఈ దేశాల ఆర్థికవ్యవస్థ మన వర్తకుల ఆధీనంలో ఉంటుంది. మనకు వ్యతిరేకంగా ఏ దేశమైనా ప్రవర్తిస్తే ఆ దేశంలో మన వర్తకుల పరిశ్రమలు వెంటనే మూతపడతాయి. వాటిల్లో పనిచేసే కార్మికులు ఆకలితో అలమటిస్తారు. రాజ్యాధికారులకు దిక్కు తెలియక అతి త్వరితంగా మీ దర్శనానికి వస్తారు, రక్షించమని వేడుకొంటారు. రుణాలు ఇచ్చినందువల్ల మనకు ఎలాంటి ఇబ్బందీ ఉండదు, సార్వభౌమా."





"చాలా బాగుంది మహామంత్రీ. కానీ, మరొక ప్రశ్న. ఇన్ని దేశాల్లో ఇంతమందికి రుణాలివ్వటం అంటే సులభంగా జరిగేది కాదు. ఈ పని అంతా ఒక పద్ధతిగా జరగాలంటే దీనికి ఒక పథకం ఉండాలి. గట్టి నియమాలుండాలి. ఒక సంస్థను స్థాపించి ఈ విషయాలన్నీ దాని ఆధీనంలో ఉంచితే బాగుంటుందేమో?"

భట్టు కళ్ళల్లో సంతోషం మెరిసింది. రాజుగారి తల్లో ఎక్కడో ఒక పెద్ద దీపమే వెలిగిందనిపించింది. తృప్తిగా చిరునవ్వుతో, "మీ ఆలోచన ఎంతో బాగుంది సార్వభౌమా, వెంటనే ఒక సంస్థను ఏర్పాటు చేయిస్తాను. దానికి పేరు కూడా మీరే సూచిస్తే..."

"పాతాళ దేశ రుణ సంస్థ - అంటే ఎలా ఉంటుంది?"

"చాలా బాగుంది సార్వభౌమా... కానీ..."

"కానీ?"

"ఈ సంస్థకు మనదేశంతో ప్రత్యక్ష సంబంధం ఉన్నట్లు బాహాటంగా చెప్పుకోకపోతేనే మంచిదని నాకు అనిపిస్తుంది సార్వభౌమా."

"బాగుంది. మరి ఊరికే రుణసంస్థ అందామంటారా?"

"రుణం తీసుకునేవాడికి అప్పు చేస్తున్నాననే భావన కలగకుండానే అప్పు చేసే సదుపాయం మనం కల్పించాలి. తనేదో ఘనకార్యం సాధించాడనే అభిప్రాయం కలిగేటట్లు చెయ్యాలి. రుణం తీసుకుంటున్న నాయకుడు తన దేశాన్ని ముందుకు తీసుకుపోతున్నానని అనుకునేట్లు చెయ్యాలి. దీన్ని మనసులో ఉంచుకొని ఈ సంస్థ పేరులో రుణం అన్న మాట లేకుండా చేస్తే బాగుంటుందని నా మనవి. ఈ సంస్థకు 'ప్రగతిప్రభ' అని పేరు పెట్టించమని నా ప్రార్థన."

"ఆహా! చాలా లోతుగా ఆలోచించారు మహామంత్రీ. చాలా బాగుంది. ప్రగతిప్రభ! చాలా బాగుంది."

"మీ అనుగ్రహం సార్వభౌమా."

## 7

ఆ తర్వాత వెంటనే పాతాళదేశంలాగా సంపన్నమైన దేశంగా మారాలంటే వాళ్ళు అనుసరించిన పరిపాలనా విధానాలను అమలు జరపాలనీ, వారి మార్గాన నడిస్తే అన్ని దేశాలు సంపన్నదేశాలుగా మారుతాయనీ ప్రచారం మొదలయింది. పాతాళ దేశ విధానాలేంటో చాలా దేశాల్లో ప్రజలకు తొందరగా అర్థంగాలేదు. ప్రజలు ఆలోచనల్లో మునిగి ఉండగా ప్రచారం రెండో ఘట్టానికి చేరింది. పాతాళదేశంలాగా సంపన్నవంతమైన దేశం కావాలంటే, వాళ్ళలాగానే వీధులు వెడల్పుగా చెయ్యాలనీ, పెద్ద పెద్ద అందమైన అధునాతనమైన భవనాలు నిర్మించాలనీ, వ్యవసాయం చేతుల్తో, జంతువుల్తో గాకుండా యంత్రాలతో చెయ్యాలనీ, అన్ని విషయాలలో పాతాళదేశాన్ని అనుకరించాలనీ, అప్పుడే అన్ని దేశాలు అభివృద్ధి చెందుతాయనీ ఉపదేశం జరిగింది.





మూడో దశలో తమ దేశాలను ప్రగతిపథంలోకి తీసుకుపోవాలని ప్రయత్నించేవారికి ప్రగతిప్రభ సహాయం చేస్తుందని, ప్రపంచంలో అన్ని దేశాలు ముందుకు రావాలని ప్రగతిప్రభ కోరుతుందనీ ప్రచారం మొదలయింది. ప్రపంచ దేశాల నాయకులు ప్రగతిప్రభ భవనం ముందు వినయంగా నుంచున్నారు. నిధుల్ని మూటలు మూటలుగా తెచ్చుకున్నారు. తమ తమ దేశాల్లో వీధులు వెడల్పు చేశారు. అందమైన భవనాలు నిర్మించారు. వ్యవసాయ యంత్రాలు కొన్నారు. డబ్బున్నవారూ, వస్తువులు కొనగలవారూ, తమ గృహాలను పాతాళదేశంలో ప్రజలు ఎలా ఉంచుకుంటారో అలాగే మార్చారు. మండిపోయే మార్చినెలలో యంత్రాలతో తమ ఇళ్ళను చల్లబడేట్లు చేసి పాతాళదేశంలో ధనవంతులు వేసుకునే జంతుచర్మాల దుస్తులు వేసుకున్నారు. ప్రపంచంలో అన్ని దేశాల్లో కొన్ని నగరాలు మాత్రం పాతాళ దేశ నగరాల్లా మారాయి. ఈ నగరవాసులు పాతాళదేశంలో లాగానే యాసతో మాట్లాడటం నేర్చుకున్నారు.

ఐదు సంవత్సరాలు గడిచాయి. మొదట రుణాలు తీసుకున్నవారికి తీర్చవలసిన సమయం వచ్చింది. పాపం ఏ దేశం దగ్గరా సరిపడేటంత డబ్బు లేదు. ప్రగతిప్రభ వారు మాత్రం ఇంటి మీదకొచ్చి కూర్చున్నారు. ఈ అప్పు తీర్చటమెలా? బాకీలు తీర్చటానికి మళ్ళా రుణాలు తీసుకున్నారు. ఈసారి మళ్ళా రుణం కావాలంటే, పొదుపుగా పరిపాలన చెయ్యటం నేర్చుకోవాలని పాఠం చెప్పారు ప్రగతిప్రభ వారు. బడుగు జీతగాళ్ళ జీతాలు తగ్గించాలన్నారు. బియ్యం ధర పెంచాలన్నారు. పాతాళదేశంలాగా ప్రగతిలోకి రావాలంటే కష్టమైన నిర్ణయాలు తీసుకోవాలన్నారు. నాయకులు ఒప్పుకున్నారు. మళ్ళా రుణాలు తెచ్చుకున్నారు.

మరొక ఐదు సంవత్సరాలు గడిచాయి. అప్పులు చేసి మసిపూసి మారేడుకాయ చేసిన ప్రగతి ప్రతిఫలాలను చూపటం మొదలుపెట్టింది. పాతాళదేశానికి కావలసిన ముడిసరుకు ఎగుమతి చేశారు కొందరు. పాతాళదేశంలో ఉద్యోగాలకు అనువైన చదువులు చదివారు కొందరు. పాతాళదేశం నుంచి విలాసవస్తువులు దిగుమతి చేసి తమ తమ దేశాల్లో అమ్మారు కొందరు. కానీ, చాలామందికి ఒంటి మీద గుడ్డలు కూడా పోయాయి. వ్యవసాయం మీద ఆధారపడే ప్రజలు చితికిపోయారు. ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. వాటిని అదుపులో పెట్టటం అంటే పాతాళదేశ వర్తకులతో తగువు తెచ్చుకున్నట్లే అవడంతో ఏ దేశమూ ఏమీ చెయ్యలేకపోయింది. బీదవాళ్ళను గురించి పట్టించుకునే వాళ్ళు లేకుండా పోయారు. అసలు వాళ్ళను మనుషుల్లాగా చూసే రోజులు పోయాయనిపించింది. పెరుగుతున్న ధరలకు బీదలు తిండిగింజలు కొనుక్కోలేకపోయారు. తెలివితేటలుంటే, కష్టపడి పనిచేస్తే, ఎందుకు కనుక్కోలేరు? కొనుక్కోలేనివారు సోమరిపోతులో, మానసిక రోగులో అయి ఉంటారనే ధోరణి మొదలైంది సంపన్నుల్లో. అలాంటి వాళ్ళు చచ్చిపోయినా పెద్ద నష్టం లేదు. ప్రగతిపథంలోకి పోవాలంటే అలాంటివాళ్ళను పట్టించుకోగూడదు. ప్రగతికి వాళ్ళను గుదిబండలు కానివ్వకూడదు. వాళ్ళ ఖర్మ వాళ్ళది అని అన్నారు.

శీఘ్రదేశంలో పరిస్థితి విషమించింది. ప్రజలు తిండికి లేక అలమటించారు. వీధుల్లో పడ్డారు. నినాదాలు చేశారు. ఇదేం ప్రజారాజ్యం అన్నారు. ప్రజారాజ్యాల్లో ప్రజలకు హక్కులు లేవా అన్నారు.



నాయకులు వాళ్ళను పట్టించుకోకుండా ఉండలేకపోయారు. చిన్న తరగతి ఉద్యోగుల జీతాలు పెంచారు. తిండి గింజలు అమ్మే వర్తకులను ధరలు తగ్గించమన్నారు. రెండు నెలలపాటు అద్దెలు మాఫీ చెయ్యాలన్నారు. వీటిని అమలు జరపటంలో అయ్యే ఖర్చులో కొంత ప్రభుత్వమే భరిస్తుందని హామీ ఇచ్చారు. ప్రజలు సంతోషించారు. చివరకు తమ మాటకు విలువ ఉందనుకున్నారు. తమ మాట రాజధాని దాకా వినపడిందని ఉబ్బిపోయారు. ప్రజారాజ్యం నిజంగా ప్రజారాజ్యమే అనుకున్నారు. కానీ ఈ ఖర్చులకు డబ్బులు కావాలి కదా? ఆ డబ్బు ఎక్కడ నుంచి వస్తుంది? శీఘ్రదేశ నాయకులు మళ్ళా ప్రగతిప్రభ దగ్గరికెళ్ళారు. ఈ పనికిమాలిన పనులకు మేము రుణాలివ్వమన్నారు వాళ్ళు. ఇలాంటి వాటికి డబ్బు ఖర్చు పెడితే వెనుకబడిన దేశంగా మిగిలిపోతారని భయపెట్టారు. ఈ మార్గం మార్చుకోకపోతే ముందు తీసుకున్న రుణం వెంటనే చెల్లించమన్నారు. ప్రస్తుతం పరిస్థితులు చాలా కఠినంగా ఉన్నాయనీ, అలా చెల్లించటం వీలుగాదనీ నాయకులు మొరపెట్టుకున్నారు. ప్రగతిప్రభ తొణకలేదు. నాయకులు తిరిగి శీఘ్రదేశం వచ్చేశారు.

కొద్దిరోజుల్లోనే దేశవ్యాప్తంగా చాలా వ్యాపారాలు మూతబడ్డాయి. నిరుద్యోగం ఉప్పెనలా ఎగిసింది. అంగట్లో వస్తువులు మాయం అయ్యాయి. ధరలు ఆకాశాన్నంటాయి. శీఘ్రదేశంలో ప్రశాంతత లేదనీ, వాతావరణం పరిశ్రమలకూ వర్తకానికీ అనుగుణంగా లేదనీ, చాలామంది వర్తకులు దేశం వదిలిపోయారు. వాతావరణం మెరుగుపడినప్పుడు తిరిగి వస్తామన్నారు. వారంరోజుల్లో శీఘ్రదేశ సంపద విలువ సగానికి సగమైపోయింది. మరో వారంలో అందులో సగమై చిన్నాభిన్నమైంది. రెండు వారాల్లో ప్రజా నాయకులు తిరిగి పాతాళదేశానికొచ్చారు. ప్రగతిప్రభకు మొక్కారు. తిండిగింజల ధరలు వర్తకులకే వదిలేస్తామన్నారు. చిన్న ఉద్యోగస్తుల జీతాలు తగ్గిస్తామన్నారు. అద్దెలు తీసుకోవటం, అద్దెల విలువ నిర్ణయించటం, భవనాల యజమానులకేగాని ప్రభుత్వానికి వాటితో ఎలాంటి సంబంధం లేదని ఒప్పుకున్నారు. అన్ని ఒప్పందాల మీదా సంతకాలు పెట్టిన తరువాత శీఘ్ర దేశం ప్రగతిపథంలోకి పోవటానికి మళ్ళా కొంత ధనం దొరికింది. దాంతో సంతోషంగా తిరిగి వెళ్ళిపోయారు నాయకులు.

## 8

"సార్వభౌమా, పది సంవత్సరాల క్రితం మీ అనుమతితో మొదలుపెట్టిన ప్రగతిప్రభ ఈనాడు ఫలితమిచ్చింది. మనల్ని ధిక్కరించి తన దోవన తను పోతానన్న శీఘ్ర దేశాన్ని మనం ఒక్క ఆయుధం ఉపయోగించకుండా లొంగదీశాం."

"అదెలా సాధ్యమయింది మహామంత్రీ?"

శీఘ్రదేశం గురించి అంతా వివరంగా చెప్పాడు భట్టు.

"కానీ మహామంత్రీ, ఈ సంతకాలు పెట్టింది నాయకులు గదా? ఆకలి అంటే ఏమిటో వారికి తెలియకపోవచ్చు. మరి ప్రజలు ఆకలితో అలమటిస్తుంటారేమో?"

"అవును సార్వభౌమా. కానీ బీదవాళ్ళు ఆకలితో చాలాకాలం బ్రతగ్గలరు. మన అనుగ్రహం మీద బతికే వాళ్ళున్నారే వారు మాత్రం మన నీడ లేకుండా రెండురోజులు కూడా బ్రతకలేరు."

"చాలా బాగుంది మహామంత్రీ."

"ఇక మీ అధికారానికి ఎక్కడా ఎదురులేదు."

"మామగారూ!"

భట్టుకు ఒళ్ళు జలదరించింది.

శ్రీరాజు భట్టును ఎప్పుడూ 'మామగారూ' అని పిలవలేదు.

"సార్వభౌమా!"

"మామగారూ! నాకొక ఆలోచన కలిగింది. ప్రగతిప్రభ మన చేతుల్లో ఉన్నంతకాలం ఈ పరిపాలనా బాధ్యతలు మనకెందుకు? పాతాళదేశాన్ని కూడా ప్రజారాజ్యం చేస్తే పోదూ? మన చేయూత లేకుండా ఎవడూ అధికారంలోకి రాలేడుగదా? ఆ అధికారంలోకి వచ్చే వాళ్ళకే ఈ సైన్యాన్ని మేపే బాధ్యత వదిలేస్తే మనకు ఖర్చు ఎంతో తగ్గుతుంది. ఆ ఖర్చు ప్రజలే భరిస్తారు. ప్రగతిప్రభ మన చేతుల్లో ఉన్నంత కాలం ఈ బాధ్యతలను మనం భరించటం అనవసరమేమో?"

మంత్రిగారి ముఖం వికసించింది. రాజుగారి తల్లో ఒకేసారి వెయ్యి దీపాలు వెలిగినట్లనిపించింది!

ఆహా! ఇక వీడు బాగుపడతాడనుకున్నాడు భట్టు.

"మీరన్నది నిజం సార్వభౌమా. ప్రగతిప్రభ మన చేతుల్లో ఉన్నంతకాలం, ప్రజారాజ్యం ఉన్నంతకాలం మీ అధికారానికి తిరుగులేదు. ప్రగతిప్రభ వర్ధిల్లుగాక."

"ప్రగతిప్రభ వర్ధిల్లుగాక!"

"ప్రజారాజ్యం వర్ధిల్లుగాక!"

"ప్రజారాజ్యం వర్ధిల్లుగాక!"

*ఆంధ్రజ్యోతి, జనవరి 2004*



# గట్టు తెగిన చెరువు

పది గంటలప్పుడు ఫోన్ మోగింది.

"హల్లో."

"హల్లో, నేను డిటెక్టివ్ స్పెర్లింగ్‌ని. డిట్రాయిట్ ఈస్ట్ ప్రిసింక్ట్ నుంచి మాట్లాడుతున్నాను. మిస్టర్ వెంకట్రావు ఉన్నారా?"

"నేనే వెంకట్రావుని. మీకేంగావాలి?" పోలీసువాడు నన్నెందుకు పిలుస్తున్నాడా అని కొంచెం కంగారుపడుతూ అడిగాను.

"ఇక్కడ స్టేషన్‌కు ఒకామెను తీసుకొచ్చారు. ఆమెకు సరిగ్గా ఇంగ్లీషు రాదు. ఇండియా మనిషి. తెలుగు మాట్లాడుతుందట. మాకు ఆమె మాటలు అనువాదం చేసిపెట్టే మనిషి కావాలి. మీరు తెలుగు మాట్లాడతారని తెలిసింది. మీ సహాయం అడుగుదామని పిలుస్తున్నాను."



నా పేరూ, ఫోన్ నంబరూ నీకెక్కడ దొరికాయని అడుగుదామనిపించిందిగాని అడగలా.

'ఎప్పుడు రావాలి?' అని అడిగితే, 'ఎంత తొందరగా రాగలిగితే అంత మంచి'దన్నాడు. 'సరే వస్తా'నన్నాను. స్టేషన్‌కు రావడానికి డైరెక్షన్లు అడిగి రాసుకొని ఫోన్ పెట్టేశాను.

స్నానం అదీ ముగించి తయారై స్టేషన్‌కు చేరేసరికి ఒంటిగంటైంది. సహాయం చెయ్యడానికొచ్చినందుకు థాంక్స్ చెప్పాడు స్పెర్లింగ్. స్టేషన్ లోపలికి తీసుకెళ్ళి నన్నక్కడ కూర్చోబెట్టి, ఆమెను తీసుకొస్తానని వెళ్ళాడు.

అయిదు నిమిషాల తరువాత ఆ తెలుగామెతో సహా వచ్చాడు. అలాంటి మనిషిని నేనెప్పుడూ చూళ్ళేదు. ఒక చిన్నసైజు రాక్షసిలా ఉంది. తల వెంట్రుకలు చిందరవందరగా ఉన్నై. ముఖం వాచి ఉంది. ఎర్రబడ్డ కళ్ళు. నన్ను చూడగానే తల వంచుకొని పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది.

"వీళ్ళింట్లో ఏదో గొడవ జరుగుతుంటే పక్కింటివాళ్ళు ఫోన్ చేశారు ఈ ఉదయం. ఇద్దరు పోలీసులు వీళ్ళింటికి వెళ్ళారు. వాళ్ళెళ్ళేసరికే ఈమె భర్తను కత్తితో పొడిచి చంపేసింది. అతన్ని పోస్టుమార్టం కోసం హాస్పిటల్‌కి తీసుకెళ్ళి, ఈమెను ఇక్కడికి తీసుకొచ్చారు," అని జరిగిన విషయం క్లుప్తంగా చెప్పాడు స్పెర్లింగ్.

మళ్ళా సంభాషణ మొదలుపెడుతూ, "అసలేం జరిగిందో తెలుసుకోవాలి. కానీ ఆ విషయాలు అడిగే ముందు ఈమెకు ఉన్న హక్కుల గురించి చెప్పాలి. ఒక హత్య చేసిందనే నేరం మీద మేము ఈమె మీద కేసు పెడుతున్నాము. ఈమె మాకు చెప్పే వివరాలు ఈ కేసులో మేము వాడుకోవచ్చు. మాకేమీ చెప్పదల్చుకోకపోతే అది ఆమె ఇష్టం. ఆమెకు ఆర్థిక స్తోమత ఉంటే ఎవర్నయినా లాయర్ని పెట్టుకోవచ్చు. లేకపోతే ప్రభుత్వమే ఒక లాయర్నిస్తుంది. ఈ విషయాలు ముందామెకు చెప్పండి," అన్నాడు స్పెర్లింగ్.

ఆమెతో ఎలా మాట్లాడడం మొదలుపెట్టాలో అర్థంగాలా నాకు. "మీ పేరూ?" అన్నాను.

మళ్ళా పెద్దగా ఏడ్వడం మొదలుపెట్టింది. భర్త శవం దగ్గర కూర్చొని ఏడుస్తూ బంధువులెవరన్నా కనపడగానే ఇంకా పెద్దగా ఏడ్చే ఆడవాళ్ళు జ్ఞాపకం వచ్చారు. ఈ ఊరుగాని ఊళ్ళో ఇంకొక తెలుగువాడు బంధువులాగా కనపడతాడు గాబోలు. కొంచెం తేరుకున్న తరువాత తలవంచుకునే, 'శారద' అంది. ఇన్‌స్పెక్టర్ చెప్పిన విషయాలు ఆమెకు చెప్పాను. ఆమె ఏమీ జవాబు చెప్పలేదు. లాయర్ దొరికిందాకా పోలీసులకేమీ చెప్పకుండా ఉండడమే ఆమెకు మంచిదని నాకు తెలిసినా, ఆమెకా విషయం చెప్పాలో, చెప్పకూడదో నాకర్థం కాలా.

"డిటెక్టివ్ మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగాలట, జవాబు చెప్తారా?" అని అడిగాను. తలూపిందామె ఏడుస్తూనే.

ఏడుస్తూ ఏడుస్తూ చెప్పిన వివరాలివి. ఉదయం లేచి, తాను తయారై, వంటగదిలోకెళ్ళి సాంబారు చేసి, దోసెలు పోసిందట ఆమె. అతను నిద్రలేచి తయారై వంటగదిలో ఉన్న చిన్న బ్రేక్‌ఫాస్ట్ టేబుల్ దగ్గర కూర్చొన్నాడట. రెండు దోసెలు ప్లేటులో పెట్టి, చిన్న గిన్నెలో సాంబారు పోసి, రెండూ



అతని ముందు టేబుల్ మీద పెట్టి, మంచినీళ్ళు తెచ్చి పెట్టిందట ఆమె. అతను తింటుండగా ఆమె కాఫీ మెషిన్‌లో కాఫీపొడి వేసి, నీళ్ళు పోసింది. ఇంకొక దోసె పోస్తుండగా, 'అల్లం పచ్చడి తీసుకురా' అన్నాడట అతను. భయపడుతూ 'అల్లం పచ్చడి లేదండీ, రేపు చేస్తాను' అందిట ఆమె. 'రేపటిదాకా ఇక్కడే కూర్చోమంటావా?' అని మంచినీళ్ళ గ్లాసు ఆమెవైపు విసిరాడట. అదొచ్చి తలకు తగలడం, తన ముందున్న కూరగాయల కత్తి తీసుకొని వెళ్ళి అతని మీదపడి అర్థంలేని ఆవేశంలో పొడవడం క్షణంలో జరిగిపోయాయట.

అదంతా గుర్తుకొచ్చి మళ్ళా పెద్దగా ఏడవడం మొదలుపెడుతుందేమోననుకున్నా. కానీ, మొదటిసారిగా తలెత్తి నావైపు చూసింది. చూస్తుంది నావైపే అయినా నన్ను కాదు. ఎక్కడో నా వెనుక చాలా దూరాన ఉన్న దృశ్యాన్ని చూస్తున్నట్లు కనిపించింది. ఆమెకు ఇరవై అయిదు సంవత్సరాలుండవచ్చు. అయినా, అల్లంపచ్చడి కోసం కొట్టుకోవడమేమిటి? మనిషిని చంపడమేమిటి? వీళ్ళేం తెలుగువాళ్ళు? అనుకున్నాను.

స్పెర్లింగ్‌కు ఇంకా కొన్ని వివరాలు కావాలి. "ఇంతకుముందెప్పుడన్నా వీళ్ళు తగవులాడుకున్నారా?" అని అడమన్నాడు. అడిగాను. ఆమె మళ్ళీ తలవంచుకుంది. సన్నగా ఏడుస్తుంది. కొంచెంసేపైం తరువాత తగువులాట రోజూ జరిగేదేనని, జుట్టు పట్టుకొని లాగడం, ఈడవడం, గోడకేసి కొట్టడం ఇవన్నీ మామూలేనని చెప్పింది. పెళ్ళయి రెండున్నరేళ్ళయిందట. అమెరికా వచ్చింతరువాత మొదటి కొన్నిరోజులు బాగానే ఉన్నాడట. తరువాత మొదలైందట హింస.

అప్పటికే దాదాపు రెండయింది. స్పెర్లింగ్‌కు తనకు కావాల్సిన సమాచారమంతా దొరికినట్లుంది. ఆమెను తన గదికి తీసుకెళ్ళి వదిలేసొచ్చి, నా సహాయానికి కృతజ్ఞతలు చెప్పాడు. సరేనని నేను బయలుదేరుతుండగా,

"క్షమించాలి, ఈమె ఏం తింటుందో తెలియదు. ఉదయం నుంచి మంచినీళ్ళు కూడా తాగలేదు! మీకు తెలుసా ఏం తింటుందో?" అనడిగాడు.

అప్పుడనిపించింది. పాపం శాకాహారేమోనని. అలా అనుకుంటుండగానే మళ్ళీ 'హత్య చేసిన మనిషి మీద జాలి పడడమేంటి' అనిపించింది. "ఏమో, నాకు తెలియదు," అన్నాను.

ఇంటికెళ్ళి ఈ కథంతా శ్రీమతితో చెప్తే, "పాపం మనలాగే వెజిటేరియనేమో. జైల్లో ఏమి తిండి పెడతారో ఏమో? మనల్ని అన్నం, కూర తీసుకెళ్ళి ఇవ్వనిస్తారేమో కనుక్కోండి," అంది. ఏమో అడుగుదామని ఫోన్ చేస్తే, వాళ్ళకేం అభ్యంతరం లేదన్నాడు స్పెర్లింగ్. మరుసటిరోజు భోజనం ఇచ్చి ఆమెను చూసొచ్చాం. మళ్ళీ చాలా ఏడ్చింది. భోజనం తెచ్చి పెట్టినందుకు చేతులెత్తి నమస్కారం చేసింది తలవంచుకునే. ఆమె శాకాహారనీ, ఏం తింటుందో, ఏం తినదో వివరంగా చెప్పాం స్పెర్లింగ్‌కు. అతను మంచివాడు లాగుంది. అన్నీ వివరంగా పుస్తకంలో రాసుకున్నాడు.

రెండురోజుల తరువాత శారదను చూడ్డానికి మళ్ళా పోలీస్‌స్టేషన్‌కెళ్ళాను. కొంచెం తేరుకున్నట్లుంది. అయినా, నన్ను చూడగానే ఏడవడం మొదలుపెట్టింది. ఏం చెప్పాలో తెలియక అలాగే కొంచెంసేపు కూర్చున్నాను. నాలుగైదు నిమిషాల తరువాత తనే మాట్లాడడం మొదలుపెట్టింది.

"ఈమధ్యే మా అమ్మ పోయింది. నాన్న ఒక్కడే ఉన్నాడు. ఉత్తరం రాసి నా బతుకు గురించి ఎలా చెప్పాలో తెలియడంలేదు. నా మీద దయ ఉంచి మా నాన్నకు ఉత్తరం రాసి పెట్టండి," అని ఈసారి భోరున చాలా పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది.

కొంచెంసేపు అలాగే వింటూ కూర్చున్నానేగాని, ఏమ్మాట్లాడాలో, ఎలా ఓదార్చాలో నాకంతుబట్ట లేదు. చివరికి, "మీ నాన్నగారికి నేను రాస్తాన్లెండి," అన్నాను.

ఆయన పేరూ, అడ్రసూ చెప్పింది. పెద్దగుంట శేషగిరిరావు గారిది నెల్లూరు దగ్గర ఒక చిన్న ఊరు, పెద్దగుంట. ఆయనకు శారద తప్ప ఇతర సంతానం లేరు. ఆ ఊళ్ళో చిన్న రైతు శేషగిరిరావు గారు. మరుసటిరోజే ఉత్తరం రాస్తానని చెప్పి ఇంటికొచ్చాను.

మరుసటివారం శారదను పోలీస్‌స్టేషన్ నుంచి డిట్రాయిట్‌లో కౌంటీ జైలుకు మార్చారు. మొదటిసారిగా జడ్జి ముందు జరిగిన విచారణలో ప్రభుత్వం ఇచ్చిన లాయర్ శారద తప్పు చేయలేదనీ, తన ప్రాణం కాపాడుకోవడానికే ఆమె భర్త మీద తిరగబడిందనీ వాదించాడు.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాత్రం "ఈ అమ్మాయి హత్య చేసింది. భర్త ఈమెను కొట్టినట్టు ఏమీ ఆధారాలు లేవు. కేసు మీద విచారణ జరుగుతున్నంత కాలం ఈమె జైల్లోనే ఉండడం మంచిది," అన్నాడు. జడ్జి ఒప్పుకున్నాడు.

జైలుకెళ్ళి ఆమెను చూడడం నాకు వారంరోజుల దాకా వీలుగాలేదు. మరుసటి ఆదివారం చూడ్డానికెళ్ళినప్పుడు కొంచెం తగ్గిపోయినట్లు కనిపించింది. కానీ, కళ్ళలో అంతకు ముందున్న దైన్యం లేదు. ముఖంలో విచారం కూడా లేదు. తన పరిస్థితి అర్థం అయిందో లేదో అనుకున్నాను. 'జైలు ఆహారం ఎలా ఉంది?' అని అడిగితే, ఫరవాలేదనీ, జైలు అధికారులు తనను దయగా, శ్రద్ధగానే చూసుకుంటున్నారనీ అంది.

తన కేసు గురించి నా అభిప్రాయం అడిగింది. చెప్పడం కష్టం అన్నాను. ఇంకా కొన్నాళ్ళలో కేసు విచారణ మొదలవుతుంది. పన్నెండుమంది జ్యూరీగా ఎన్నుకోబడతారు. మీరు ఆత్మరక్షణ ప్రయత్నంలో భర్తను చంపారని మీ లాయర్ వాళ్ళను నమ్మించగలిగితే నాలుగైదేళ్ళలో మీరు జైలు నుంచి బయటపడతారు. కానీ, బాగా ఆలోచించే, చంపెయ్యాలనే ఉద్దేశంతోనే కత్తితో పొడిచారని అనుకుంటే మాత్రం జ్యూరీ మీకు యావజ్జీవం జైల్లో ఉండేటట్లు శిక్ష వెయ్యొచ్చు," అని చెప్పాను.

ఆమె ముఖంలో ఎలాంటి భావోద్రేకం కనిపించలేదు. మూడేళ్ళయినా, ముప్ఫై ఏళ్ళయినా ఒకటేనా? ఆమె జీవితం గురించి అడగాలనీ, తెలుసుకోవాలనీ ఉందిగానీ అడిగితే బాగుండదేమోనని ఊరుకున్నాను.

"పోయిన రెండేళ్ళ నరకం తరువాత, ఈ రెండువారాలు ఎంత నిర్మలంగా, శాంతంగా గడిచాయో," అంది అకస్మాత్తుగా.

ఇదేం మనిషి. జైలు శాంతంగా ఉంటుందా? బహుశా అతను నిజంగానే రాక్షసుడేనేమో? లేకపోతే అతను పోయిన తరువాత జైలే నయం అనుకుంటుందా?



"అతను మిమ్మల్ని చాలా హింసలు పెట్టాడా," అన్నాను మరేం అడగాలో తెలియక.

"పెళ్ళయింతర్వాత దాదాపు నెలరోజులు బాగానే చూసుకున్నారు," అంటూ మొదలుపెట్టి ఆమె చెప్పిన కథ ఇదీ.

* * *

శారద తల్లిదండ్రులకు ఒక్కతే కూతురు. అన్నదమ్ములు లేరు. మాధవరావు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. పెళ్ళి చేసుకుందామని అమెరికా నుంచి ఇండియా వెళ్ళి, శారదను చూసి వారంరోజుల్లో పెళ్ళి చేయించుకొని, పెళ్ళి జరిగిన తరువాత మూడోరోజే తిరిగి డిట్రాయిట్ వచ్చాడు. తరువాత కొద్దిరోజుల్లోనే శారదకు వీసా వచ్చింది. మద్రాస్ నుంచి బయల్దేరి సింగపూర్ మీదుగా అమెరికా వచ్చింది శారద. వచ్చినప్పట్నించీ ఇక్కడే డిట్రాయిట్‌లో ఒక ఎపార్ట్‌మెంట్లో ఉంటున్నారు.

మాధవరావు బాగా కష్టపడి పనిచేసేవాడు. పొద్దుటే ఎనిమిది గంటలకు పనికెళ్ళి రాత్రి ఏడు ఎనిమిది గంటలకొచ్చేవాడు. అతనిది విజయవాడ దగ్గర చిన్న ఊరు. తనకంటే చిన్న వయసు తోబుట్టువులున్నారు. వాళ్ళకు పెళ్ళిళ్ళు చేయించే బాధ్యత అతని మీద ఉండడం వల్ల డబ్బు ఖర్చు పెట్టే విషయంలో చాలా జాగ్రత్తగా ఉండేవాడు. అప్పుడప్పుడూ ఊరికి డబ్బు పంపించేవాడు.

శనివారాలూ, ఆదివారాలూ కూడా కనీసం సగం రోజైనా పనికెళ్తుండేవాడు మాధవరావు. అందువల్ల వాళ్ళకు బయటి ప్రపంచంతో పెద్దగా సంబంధం ఉండేది కాదు. అపార్ట్‌మెంట్ వదలి బైటికెళ్ళడం కూరగాయలు, వస్తువులూ తెచ్చుకోడానికెళ్ళినప్పుడే. ఆమెకు అర్థం కాకపోయినా టీవీ చూస్తూ కూర్చుండేది. అతనికి పని కెళ్ళినప్పుడు ఇండియాలో ఉన్నట్లే ఉండేదట. ఆఫీసులో చాలామంది ఇండియావాళ్ళేనట. అందులో సగంమంది తెలుగువాళ్ళేట. ఎప్పుడన్నా ఆఫీసు స్నేహితులు భోజనానికి పిలిచేవాళ్ళు. వాళ్ళను వీళ్ళు తిరిగి పిలిచేవాళ్ళు.

శారద అమెరికాకొచ్చిన నెలరోజుల్లోనే మాధవరావుకి ఉద్యోగం పోయింది. అతనికి పిచ్చెక్కినట్లయింది. చాలాచోట్ల ఉద్యోగ ప్రయత్నాలు చేశాడు. తను కూడా ఏదైనా చిన్న ఉద్యోగం చేస్తానంది శారద. కానీ, ఇంగ్లీష్ రాకపోవడం, కారు నడపడం చేతగాకపోవడం వల్ల తానేం చెయ్యలేకపోయింది.

దున్నపోతులా తిని కూర్చోకుండా ఏదైనా ఉద్యోగం చేస్తే ఏడాదికి ముప్ఫై వేలన్నా వచ్చేవని ఎత్తిపొడుస్తుండేవాడు మాధవరావు.

"మరి అన్నీ తెలిసుండి కూడా నన్నెందుకు చేసుకున్నారు. ఇక్కడే బాగా సంపాయించే అమ్మాయిని చేసుకోకపోయారా," అని శారద అంటే –

"ఇక్కడి అమ్మాయిలు ఇష్టం వచ్చిన వాళ్ళందరితోనూ పడుకుంటారు. ఫ్రెష్‌గా ఉన్న అమ్మాయి కావాలని నిన్ను చేసుకున్నాను," అన్నాడు మాధవరావు.

అతనికి ఇష్టం వచ్చినప్పుడల్లా ఆమెని నెట్టడం, జుట్టు లాగడం ఆరోజుల్లోనే మొదలైంది. ఎందుకలా చేస్తున్నారంటే తమాషాకేలే అనేవాడు. నొప్పి పుడుతుందని చెప్పినా వినేవాడు కాదు. పగలేకాక రాత్రిపూట కూడా అతని ప్రవర్తన ఇబ్బందిపెట్టేది శారదకు. వీడియోలు తెచ్చి, వాటిల్లో

ఆడవాళ్ళు చేసినట్లు శారదను చెయ్యమనేవాడు. అతను తృప్తిపడి నిద్రపోయింతరువాతనే ఆమెకు స్వేచ్ఛ. మళ్ళా ఉదయమే మొదలయ్యేది బానిసత్వం.

అదృష్టవశాత్తు తొందరలోనే అతనికి మళ్ళా ఉద్యోగం దొరికింది. కానీ, ప్రవర్తన మాత్రం మారలేదు. అతను ఆఫీసులో ఉన్నంతసేపూ మాత్రం ఇంట్లో భయం లేకుండా ఉండేది శారద.

ఆర్నెల్ల క్రితం ఈ బాధలన్నీ తొలిగిపోయే అవకాశం దొరికిందామెకు. తల్లికి బాగాలేదని, చూడాలని అంటుందనీ టెలిగ్రామ్ వచ్చింది శారదకు. పోయి రమ్మన్నాడు మాధవరావు. తిరిగి రాకూడదనే ఉద్దేశంతోనే ఇండియా వెళ్ళింది శారద.

తల్లి సుభద్రమ్మకు చాలాకాలంగా రక్తపోటు జబ్బు. అప్పుడప్పుడూ ఆరోగ్యం బాగా క్షీణించి చచ్చిపోతుందేమోననుకున్నారు.

ఇప్పుడు కూడా అలాగే అయి ఉంటుందనీ, తల్లికి బాగా లేకపోవడం తనకు ఈ నరకం నుంచి బయటపడే అవకాశం కల్పించినందుకు సంతోషిస్తూ ఇండియా వెళ్ళింది శారద.

కానీ, ఆమె ఇంటికి చేరేసరికే సుభద్రమ్మ పోయింది. దాంతో శారదకు మనసు విప్పి మాట్లాడుకునే వాళ్ళెవరూ లేకుండా పోయారు. తండ్రికి మరో దిక్కు లేకపోవడం వల్ల అక్కడే ఉండి పోదామనుకుంది శారద. కానీ, ఆయన సమ్మతించలేదు. తనకోసం కూతురి జీవితం చెడడం ఆయన కిష్టంలేదు. పోనీ నిజం చెబితే? తిరిగి అమెరికా పోయే ఆలోచన లేదని చెబితే? సుభద్రమ్మ పోయిన దిగులుతో అసలే చితికిపోయిన ఆయన్ను ఇంకా బాధపెట్టలేక, తన జీవితం గురించి ఆయనకు చెప్పలేకపోయింది.

ఇక ఈ జీవితం ఇలాగే సాగిపోవాలి కాబోలు అనుకుంటూ తిరిగొచ్చింది శారద.

అర్థంలేని జీవితం. భయం నిండిన జీవితం. బానిస జీవితం. ఎందుకూ ఈ జీవితం?

ఇండియా నుంచి తిరిగొచ్చిన శారదకు మాధవరావు ప్రవర్తనలో ఏమీ మార్పు కనిపించలేదు. తిట్టడాలూ, కొట్టడాలూ మామూలే. అన్నీ భరిస్తూ వచ్చింది. మరేం చేస్తుంది? ఆరోజు మాత్రం... తనకు తెలియకుండానే ఏదో గట్టు తెగిన చెరువులా ఉద్రేకం పెల్లుబికింది.

తలవంచుకుని కథంతా చెప్పింతరువాత తలెత్తి నావైపు చూసి నవ్వింది శారద. ఆమె నవ్వులో బాధ లేదు. సంతోషం లేదు. దిగుల్లేదు. శాంతం, నిర్మలత్వం. అంతే.

అప్పటికే చాలా ఆలస్యం అయింది. మళ్ళీ వస్తానని చెప్పి లేచాను.

"మీకు చదువుకోవడానికేమైనా కావాలంటే తెచ్చి పెడతాను," అన్నాను.

"జైలు జీవితం మీద ఏమైనా పుస్తకాలుంటాయా?" అనడిగింది శారద.

"ఏమో? మీరే రాయాలి అలాంటి పుస్తకమొకటి," అన్నాను.

నిండుగా నవ్విందామె.

*ముక్కూ మొహం తెలియనివారికి కూతుళ్ళనిచ్చి పెళ్ళిళ్ళు చేసి, అమెరికా పంపించి చేతులు కడుక్కొనే తల్లిదండ్రులకు అంకితం.*

*ఇండియా టుడే, జూన్ 2000*
*తెలుగుకథ 2000, కథ 2000*



# వెలుతురు

వారంరోజులుగా పడుతున్న సన్నటివాన ఆగిపోయినట్లుంది. ఉదయాన్నే వెచ్చటి వెలుతురు వస్తుంది కిటికీలోంచి. ఆది వారమే గదా ఆలస్యంగా లేద్దాంలే అనుకున్న కేటీ ఉత్సాహంగా లేచి కిటికీ దగ్గర కెళ్ళి చూసింది. ఆకాశంలో ఒక్క మబ్బు కూడా లేదు. వాటితో యుద్ధం చేసి తరిమేశాను అన్నట్లు నవ్వుతున్నాడు సూర్యుడు.

కాలకృత్యాలు తీర్చుకుని కాఫీ తాగుతూ న్యూస్‌పేపర్ తిరగేసింది కేటీ. అలవాటు ప్రకారం వార్తల సెక్షన్ వదిలేసి హోంటౌన్ ప్రైడ్ సెక్షన్‌తో మొదలెట్టింది.



అన్నీ మామూలు కథలే. ఒక హైస్కూలు అమ్మాయి ఆఫ్ఘనిస్థాన్ పిల్లల కోసం డ్రెస్సులు పోగు చేస్తుంది. ప్రకృతి చిత్రాలు గీసే ఒకతనికి మంచి గుర్తింపు వచ్చింది. అతని చిత్రాలు ఈమధ్య డిట్రాయట్ ఆర్ట్స్ మ్యూజియంలో ప్రదర్శించబడ్డాయి. సాయంత్రం చాలామంది షికార్లకెళ్ళటానికి సైకిళ్ళు తొక్కటానికి వాడే బాట పొడుగునా అక్కడక్కడా చెత్తాచెదారం పడుందని, దాన్నంతా తీసేసి అందంగా ఆకర్షణీయంగా చెయ్యాలని ప్రయత్నం చేస్తున్నాడు ఒకతను. ఆ సెక్షన్ కింద పెట్టేసి వార్తల సెక్షన్ తీసుకుంది కేటీ. పేజీలు తిరగేస్తూ ఐదో పేజీలో ఉన్న చిన్న కథనంలో బ్లూంఫీల్డు నివాసి శ్రీరాంపటేల్ అనే అబ్బాయి కొలంబియాలో చదువు తున్నాడు, మెడికల్ కాలేజీలో సీటు రాకపోవటంతో తల్లిదండ్రులను నిరాశపరచినందుకు సిగ్గు పడుతూ ఇక బ్రతకటం వృధా అని ఆత్మహత్య చేసుకున్నాడు అని వుంది. ఫోటోను మళ్ళా జాగ్రత్తగా చూసింది కెటీ. ఫోటో కిరణ్‌దే. కాకపోతే ఈ పటేల్ అబ్బాయి కూడా కిరణ్‌లాగానే ఉంటాడేమో? అయినా కిరణ్ ఆత్మహత్య చేసుకునే రకం కాదు. పైగా ఇప్పుడు కొలంబియా వదిలేసి ఓక్‌లాండ్‌లో చదువుతున్నాడుగా.

కాఫీ చప్పరిస్తూ కిరణ్ గురించి ఆలోచిస్తూ కూర్చుంది కేటీ. కిరణ్‌తో పరిచయం అయ్యి దాదాపు మూడు సంవత్సరాలు దాటింది. పరిచయం కావటం కూడా తమాషాగా జరిగింది. ఆరోజు తను వాళ్ళింటికి ఫోను చేసింది.

"హలో."

"హలో. నా పేరు కాథరిన్ జెఫర్స్. కైరన్‌బేబూ ఉన్నారా?"

"రాంగ్ నంబర్," అని ఠపీమని ఫోన్ పెట్టేశాడు ఒక మగ గొంతు.

నోట్‌బుక్‌లో నంబర్ మరొకసారి జాగ్రత్తగా చూసుకొని మళ్ళీ ఫోన్ చేసింది కేటీ.

"హలో," మళ్ళీ అదే గొంతు.

"క్షమించాలి. నేను తప్పు నంబర్ డయల్ చేస్తున్నానేమో. కైరన్‌బేబూది ఈ నంబర్ అనుకొని..."

"బేబూ గీబు ఇక్కడెవడూ లేడు. మావాడి పేరు కిరణ్‌బాబు. కి...రణ్...బా...బు," అన్నాడు ఆ గొంతు.

"క్షమించండి. నాకు ఆ పేరు ఎలా పలకాలో తెలియక అలా అన్నాను. కి...రణ్ బా...బు... ఇప్పుడు సరిగ్గా పలికానా?"

"ఫరవాలేదు. అసలు నువ్వెవరూ? మావాడితో నీకేం పని?"

"నా పేరు కేటీ జెఫర్స్. కిరణ్‌కి ఫోన్ చెయ్యటానికి రెండు కారణాలు. మావాడు కూడా బ్లూమ్‌ఫీల్డ్ హైస్కూల్‌లో చదివాడు. మొన్న బుధవారం నాడు స్కూల్ కాన్సర్టుకి వెళ్ళాను. అక్కడ కిరణ్ వయొలిన్ వాయిస్తే విన్నాను. వివాల్డి కన్సెర్టో అద్భుతంగా వాయించాడు. హైస్కూలు స్టూడెంటు అంత బాగా వాయించటం నేనెప్పుడూ వినలేదు. కాన్సర్ట్ అయింతర్వాత మ్యూజిక్ టీచర్ గ్లోరియాతో మాట్లాడాను. కిరణ్ చాలా మంచి స్టూడెంటనీ, స్ట్రింగ్ ఇన్‌స్ట్రుమెంట్స్‌లో నేషనల్ ఆర్కెస్ట్రా అవార్డు



కూడా వచ్చిందని చెప్పింది. కిరణ్‌కు అభినందనలు చెబుదామని ఫోన్ చేశాను. ఫోన్ చెయ్యటానికి ఇంకొక కారణం కూడా ఉంది. మీరు క్రానికల్ చదువుతారా?"

"క్రానికల్ అంటే అది లోకల్ పేపరే గదా? డ్రైవ్‌వే మీద వేసిపోతుంటారు. తీసి నేను చెత్తలో పారేస్తుంటాను."

చెంప మీద ఛెళ్ మనిపించినట్లయింది కేటీకి. "నేను ఆ పేపర్‌లో అప్పుడప్పుడూ ఫ్రీలాన్సర్‌గా చిన్న చిన్న కథలు రాస్తుంటాను. కథలంటే... కథలు గాదు. ఇతర దేశాల నుంచి వచ్చి ఈ వూళ్ళో స్థిరపడి కొద్దికాలంలోనే ఏదో ఒక రంగంలో మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నవారి గురించి ఒక కాలం రాస్తుంటాను. మీ కిరణ్ గురించి రాద్దామని ఉంది. ఇంటర్వ్యూ చెయ్యటానికి వీలువుతుందేమో అడుగుదామని ఫోన్ చేశాను."

"అలాగా, థాంక్స్." చాలా సున్నితంగా మారిందా గొంతు.

"ఈరోజు వీలైతే బాగుంటుంది. ఇంటర్వ్యూ ఒక అరగంటా, గంటసేపు పడుతుంది. తర్వాత రెండు మూడు ఫోటోలు తీస్తాను. ఈరోజు ఇంటర్వ్యూ అయితే వచ్చే ఆదివారం పేపర్లో వస్తుంది కథ."

"అలాగా. కానీ మిస్ జెఫర్స్, ఈరోజు వీలయ్యేట్లు లేదే. ఆదివారం కదా, ఇంకొక అరగంటలో మేమందరం దేవాలయాని కెళ్ళాలి. తిరిగొచ్చేసరికి దాదాపు ఒంటిగంటవుతుంది. మళ్ళీ మూడు గంటలకు మేము లారెన్స్‌టెక్ ఆడిటోరియమ్ కెళ్ళాలి. అక్కడ ఒక సంగీత కచేరీ ఏర్పాటు చేయిస్తున్నాను నేను. కిరణ్ కూడా రావాలి అక్కడికి. అందువల్ల ఈరోజు చాలా బిజీగా వుంటుంది మరి."

"ఫరవాలేదు. ఈరోజు వీలుగాకపోతే వచ్చే ఆదివారం ఇంటర్వ్యూ చేస్తాను. మీరు ప్రతి ఆదివారం దేవాలయానికెళ్తారా?"

"అవును. దేవాలయం కార్యకర్తల కమిటీకి నేనే ప్రెసిడెంటుని."

"అలాగా. కంగ్రాచులేషన్స్. నాకు చాలాకాలంగా హిందూ దేవాలయం చూడాలని ఉంది. మరి వచ్చే ఆదివారం దేవాలయం దగ్గిరే కిరణ్‌ని ఇంటర్వ్యూ చేస్తాను, మీకేమీ అభ్యంతరం లేకపోతే."

"అయ్యో, దానికి అభ్యంతరం ఏముంటుంది. కాకపోతే మీరు దేవాలయం దగ్గిరికి వస్తానంటే వచ్చే ఆదివారం దాకా ఎందుకూ, ఈరోజే రావచ్చు."

"దట్ విల్ బి నైస్. మీరు వెళ్ళేది బ్లూమ్‌ఫీల్డ్‌లో ఉన్న దేవాలయానికేనా?"

"అవును. ఎక్కడుందో మీకు తెలుసా? డిరెక్షన్స్ ఇవ్వమంటారా?"

"లేదు, నాకు తెలుసు."

"అయితే మీరు అక్కడకొచ్చింతర్వాత శరత్‌బాబుని చూపించమని ఎవరినైనా అడగండి. నా దగ్గరకు తీసుకు వస్తారు."

* * *

కేటీకి ఆరోజే కిరణ్‌తో పరిచయమయింది దేవాలయంలో. అతన్ని ఇంతకుముందే చూసి ఉండటం వల్ల సులభంగానే గుర్తు పట్టింది కేటీ. అంతేగాక దేవాలయానికొచ్చిన టీనేజర్స్ అందరూ చాలా కాజువల్‌గా డ్రెస్ చేసుకోనుంటే కిరణ్ మాత్రం సూటు వేసుకొచ్చాడు. అక్కడ తెల్లవాళ్ళెంకెవరూ లేకపోబట్టేనేమో కేటీని వెంటనే గుర్తుపట్టి నేరుగా ఆమె దగ్గరకొచ్చి పరిచయం చేసుకున్నాడు కిరణ్. అతనడిగిన మొదటి ప్రశ్న, ఫోటో తియ్యటానికి ఈ సూటు వేసుకోవాల్సిందేనా అని. ఆ అబ్బాయి పడుతున్న ఇబ్బంది చూసి నవ్వొచ్చింది కేటీకి. ఫరవాలేదు కోటూ, టై తీసెయ్యొచ్చని చెప్పింది. ముడుచుకుపోయి ఉన్న అతని ముఖం వెంటనే విప్పారింది. థాంక్యూ అన్నాడు.

దేవాలయంలో దాదాపు రెండొందలమంది దాకా వున్నారు. ఎక్కడా కూర్చోని మాట్లాడటానికి చోటు దొరకలేదు. విగ్రహాలున్న పెద్ద హాలులో పూజలు జరుగుతున్నాయి. పక్కనే మరొక పెద్ద హాలులో చాలామంది పిల్లలు, అన్ని వయసుల వాళ్ళూ వున్నారు. ఆదివారం ఉదయం నుంచి మధ్యాహ్నం దాకా ఇక్కడ పిల్లలకు భారతీయ భాషలు, సంగీతం, నృత్యం, లెఖ్ఖలు, సైన్సు నేర్పుతారనీ, అంతేగాక పరీక్షలు రాయటంలో కోచింగ్ ఇస్తారనీ చెప్పాడు కిరణ్. దేవాలయానికి కొంచెం దూరంగా లాన్‌లో కూర్చొని మాట్లాడుకున్నారు కేటీ, కిరణ్.

కిరణ్ తల్లిదండ్రులకు సంగీతం, నృత్యం అంటే చాలా ఇష్టం అని చెప్పాడు కిరణ్. ఆరో ఏటనే కిరణ్‌కి వయొలిన్ నేర్పించటం మొదలుపెట్టారు. వయొలిన్ మాష్టారు వాళ్ళ ఇంటికి దగ్గరలోనే ఉండేవాడు. మొదట వయొలిన్ నేర్చుకోవటం తనకు ఇష్టంగా వుండేది కాదనీ, కొన్నాళ్ళు పోయిం తర్వాత వయొలిన్ మీద ఎందుకో చాలా ఇష్టం పెరిగిందనీ చెప్పాడు కిరణ్. మొదట నేర్చుకున్నది భారతీయ శాస్త్రీయ సంగీతమే అయినా మిడిల్ స్కూల్లో చేరిన తర్వాత ఒక టీచర్ ప్రోత్సాహంతో ప్రైవేట్ ట్యూటర్ దగ్గర వెస్టర్న్ మ్యూజిక్ నేర్చుకున్నాడు. స్కూలు కాన్సర్టుల్లో వెస్టర్న్ మ్యూజిక్ వాయించినా, తను ఎక్కువగా వాయించేది భారతీయ శాస్త్రీయ సంగీతమేనని చెప్పాడు కిరణ్.

"ఎందువల్ల? నీకు భారతీయ శాస్త్రీయ సంగీతం అంటే ఎక్కువ ఇష్టమా? లేక వాయించే అవకాశాలు ఎక్కువగా ఉండటం వల్లనా?"

"నిజంగా నాకు భారతీయ శాస్త్రీయ సంగీతం అంటేనే ఎక్కువ ఇష్టం. వయొలిన్ వాయిస్తుంటే వింటున్నవారి ముఖాల్లో సంతోషం కనిపిస్తుంటుంది. కొందరు తలలూపుతుంటారు. కొందరు తాళం వేస్తుంటారు. నాతోపాటు వాళ్ళు కూడా ఆ సంగీతంలో కలసిపోయినట్లుంటుంది. వెస్టర్న్ మ్యూజిక్ వాయించేటప్పుడు అలాంటి అనుభూతి కలగలేదు. సంగీతం వినేవారు గౌరవంగా, భక్తిగా కూర్చుంటారు. వారికి సంగీతం అంటే ఇష్టం అని తెలుస్తుంది. కాని భారతీయ శ్రోతల్లాగా వీరు సంగీతంలో కలిసిపోయి నట్లు కనిపించరు. అందుకే నాకు ఇండియన్ ప్రోగ్రాముల్లో వాయించడమే ఇష్టం."

"ప్రోగ్రాములంటే? కాన్సర్టులా?"

"కాదు. ఇక్కడ తెలుగువాళ్ళు, అంటే మాలాగా ఇండియాలో తెలుగుభాష మాట్లాడే ప్రాంతం నుంచి వచ్చి డిట్రాయట్ పరిసరాల్లో వుంటున్నవారు, అందరూ కలిసి పండుగలకు జరుపుకునే



ఉత్సవాలు. వీటిలో నేను అప్పుడప్పుడూ వయొలిన్ వాయించాను. ఇతర నగరాల్లో వుంటున్న తెలుగు వారు జరుపుకునే కార్యక్రమాల్లో కూడా కొన్నిసార్లు వాయించాను. క్లీవ్‌లాండులో ప్రతి సంవత్సరం త్యాగరాజు అనే సంగీత విద్వాంసుడి జన్మదినోత్సవాలు జరుపుతారు. ఆ సందర్భంగా ఒకటి రెండుసార్లు వాయించాను."

"బాగుంది. మరి హైస్కూలయింతర్వాత ఏం చెయ్యదల్చుకున్నావు?"

అప్పటిదాకా సులభంగా మాట్లాడిన కిరణ్ వెంటనే జవాబు చెప్పలేకపోయాడు. కొంచెంసేపు ఆలోచించి, "మా నాన్న మెడికల్ స్కూల్లో చేరమంటున్నాడు. నాకు సంగీతంతోనే ఉండిపోవాలని వుంది," అన్నాడు.

తర్వాత కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయారిద్దరు.

"మిస్ జెఫర్స్, మీకు పిల్లలున్నారా?" అడిగాడు కిరణ్.

"నాకు ఒక్క కొడుకున్నాడు. టామ్. వాడూ బ్లూమ్‌ఫీల్డ్ హైస్కూల్లో చదివాడు. హైస్కూల్లో వుండగా పియానో వాయించేవాడు. కానీ నువ్వు వయొలిన్ వాయించినంత బాగా వాడికి పియానో వచ్చేది కాదు."

"ఇప్పుడేం చేస్తున్నాడు?"

"వాడికి సోషల్‌వర్క్ అంటే యిష్టం. యిప్పుడు ఓక్‌లాండ్ యూనివర్శిటీలో బియ్యే చదువుతున్నాడు."

ఇంతలో ఒక చిన్న కుర్రవాడు వాళ్ళ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాడు. వాళ్ళకు పాఠం చెప్పటానికి రావాల్సిన మ్యూజిక్ టీచర్‌కు ఏదో కారు ట్రబులొచ్చిందట. కిరణ్ ఖాళీగా వుంటే అతన్ని క్లాస్ తీసుకోమని అడగమన్నాడట. తొందరగా రెండు ఫోటోలు తీసి కిరణ్‌ని పంపేసింది కేటీ.

* * *

ఆ ఇంటర్వ్యూ అయిన పదిరోజుల తర్వాత కేటీకి ఫోన్ చేశాడు శరత్‌బాబు. ఆదివారం హోం టౌన్ ప్రైడ్ సెక్షన్‌లో కిరణ్ మీద వచ్చిన కథ చదివి కొందరు మిత్రులు తనకు ఫోన్ చేసి అభినందనలు తెలిపారని చెప్పాడు. ఆరోజు దేవాలయం దగ్గర కొచ్చినప్పుడు ఆయనను కలవకుండానే వెళ్ళిపోయి నందుకు క్షమాపణలు చెప్పుకుంది కేటీ. వీలు చూసుకొని తమ ఇంటికి భోజనానికి రమ్మని అడిగి, మళ్ళా ఫోన్ చేస్తానని చెప్పాడు శరత్‌బాబు.

రెండు మూడు నెల్ల తర్వాత శరత్‌బాబు పిల్చాడు మళ్ళా. కిరణ్‌కి ఒక కాంపిటీషన్లో ఇంస్ట్రుమెంటల్ సంగీతంలో ప్రథమ బహుమతి వచ్చిందనీ, సెలిబ్రేట్ చెయ్యటానికి శనివారంనాడు వాళ్ళింటికి లంచ్‌కి రమ్మని ఆహ్వానించాడు.

శరత్‌బాబుది పెద్ద ఇల్లు. ఐదు బెడ్‌రూంలు. అన్ని గదుల్లోనూ ఖరీదైన ఫర్నిచర్ వుంది. లివింగ్‌రూమ్‌లో ఒక గోడ మీద మూడు చిత్రపటాలున్నాయి. అవి సంగీత విద్వాంసుల చిత్రాలనీ, వందల సంవత్సరాల క్రితం వీరు గొప్ప సంగీతం రాశారనీ చెప్పాడు శరత్‌బాబు. మరోవైపు గోడ మీద

నృత్యం చేస్తున్న రాతిబొమ్మల ఫోటోలున్నాయి. అవి ఇండియాలో ఒక దేవాలయం మీద వున్న బొమ్మలని చెప్పింది శరత్‌బాబు భార్య.

"ఇవి మీరు తీసిన ఫోటోలేనా?"

"అబ్బే లేదు, వీటిని ఇండియాలో కొన్నాం."

"మీకు నృత్యం, సంగీతం అంటే చాలా ఇష్టం లాగుంది."

"అవును."

"మీరు కూడా ఏదైనా ఇంస్ట్రుమెంట్ వాయిస్తారా?"

"నేనా?... లేదు. నాకు సంగీతం గురించి ఏమీ తెలవదు."

"నేనూ అంతే. ఇండియాలో మాది ఒక చిన్న పల్లెటూరు. అక్కడ సంగీతం నేర్చుకునే అవకాశాలే లేవు," అన్నాడు శరత్‌బాబు.

"అలా అయితే మీకు సంగీతం మీద, నృత్యం మీదా ఇంత అభిమానానికి కారణం?"

"మా సంస్కృతిలో ముఖ్యమైన భాగాలు శాస్త్రీయ సంగీతమూ, నృత్యం. ఇవి మా పిల్లలు నేర్చుకోవాలని మా పట్టుదల. మా యింటి దగ్గరే ఒక వయొలిన్ నేర్పించే అతనున్నాడు. అతని దగ్గర నేర్చుకున్నాడు కిరణ్. ఇక డాన్స్ అంటారా, దేవాలయం దగ్గరే డాన్స్ క్లాసులు మొదలుపెట్టాం. మీకు చెప్పానో లేదో మా అమ్మాయి శిల్ప, కిరణ్ కంటే రెండేళ్ళు చిన్నది, ఇప్పుడు సెలవలకి ఇండియా వెళ్ళింది. శిల్ప దేవాలయంలోనే డాన్స్ నేర్చుకోవటం మొదలుపెట్టింది. ఇప్పుడు ఒక టీచర్ దగ్గర ప్రైవేటుగా నేర్చుకుంటుంది."

"మీకు సంగీతం, నృత్యం తెలియకపోయినా మీ పిల్లలకు ఇంత శ్రద్ధగా నేర్పించటం చాలా గొప్ప విశేషం."

"థాంక్స్."

వాళ్ళు మాటల్లో వుండగానే కిరణ్ లివింగ్‌రూంలో కొచ్చాడు. కాంపిటీషన్‌లో ప్రథమ బహుమతి తెచ్చుకున్నందుకు అభినందించింది కేటీ.

"కిరణ్! ఏ కాంపిటీషన్‌కు పోయినా గెలుస్తున్నావు లాగుంది. తర్వాత ఏం చెయ్యదల్చు కున్నావు?"

"గెల్చినా గెలవకపోయినా అంతమంది ముందు వాయించడం చాలా ఎక్సైటింగ్‌గా ఉంటుంది నాకు..."

"కిరణ్‌కి వయొలిన్ బాగా వచ్చింది. ఇన్నాళ్ళూ వయొలిన్, చదువూ రెంటితో కష్టపడుతూ వచ్చాడు. ఇక ముందు చదువు మీద కాన్సెంట్రేట్ చెయ్యాలి. వచ్చే సంవత్సరం సీనియర్ ఇయర్ కదా! ఆ ఫోర్ పాయింట్ ఓ నిలబెట్టుకోకపోతే రేపు మెడికల్ స్కూల్లో ఎడ్మిషన్ రావటం కష్టం అవు తుంది." అతని నిర్ణయం ప్రకటించాడు శరత్‌బాబు.

"ఎక్కడ చదవాలనుకుంటున్నావు కిరణ్?"



"యాక్సిలరేటెడ్ ప్రోగ్రాంలో ఎక్కడ దొరికితే అక్కడ," అని జవాబిచ్చాడు శరత్‌బాబు. కిరణ్ ముభావంగా ఉండిపోయాడు.

* * *

దాదాపు రెండు సంవత్సరాల తర్వాత కిరణ్ మళ్ళా కనిపించాడు కేటీకి.

"కిరణ్! నేను గుర్తున్నానా?' అని అడిగింది కేటీ, ఒక టేబుల్ దగ్గర ఒంటరిగా కూర్చొని శాండ్‌విచ్ నవులుతున్న యువకుణ్ణుద్దేసించి.

లంచ్ ట్రే పట్టుకొని నిలబడ్డ ఆమెను చూసి, "మీరా, మిస్ జెఫర్స్. మీరు గుర్తుండకపోవట మేమిటి. రండి, కూర్చోండి." పక్కనున్న కుర్చీ చూపించాడు కిరణ్. "మీరు ఇక్కడ..."

"టాం ఇక్కడే చదువుతున్నాడు. అప్పుడప్పుడూ వస్తుంటాను వాడితో లంచ్‌కి. ఇప్పుడే రావాలి వాడు. పన్నెండున్నరకి కలుస్తానన్నాడు. కాని నిన్నెప్పుడూ చూళ్ళేదే ఇక్కడ. నువ్వు న్యూయార్క్‌లో యాక్సిలరేటెడ్ మెడికల్ ప్రోగ్రాంలో ఉన్నావనుకున్నాను."

"అదొక పెద్ద కథలెండి. మెడిసిన్‌లో నాకు ఎడ్మిషన్ రాలేదు. పోయిన సంవత్సరం కొలంబియా లో ప్రీమెడ్‌లో చేరాను. ఈ సెమెస్టర్ ప్రారంభంలో ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాను."

"అలాగా! ఇక్కడ కూడా మంచి ప్రీ మెడ్ ప్రోగ్రాం వుందని విన్నాను. ఇక్కడ చదివినవాళ్ళు చాలామంది మెడికల్ కాలేజీల్లో సీట్లు సంపాదించుకుంటారుట."

"నిజమేననుకోండి. కాని నేనిప్పుడు ప్రీమెడ్‌లో లేను. మ్యూజిక్ మేజర్ నాది."

"అలానా?" కొలంబియా అంత పేరున్న కాలేజీలో ప్రీ మెడ్ వదిలేసి ఓక్‌లాండ్ యూనివర్సిటీలో సంగీతంలో మేజర్ చెయ్యటానికొచ్చాడంటే తప్పకుండా తల్లిదండ్రులతో ఘర్షణ పడి వుంటాడు. కాని ఎలాగ అడగటం?

"మా నాన్న సంగతి మీకు తెలిసిందేగదా! ప్రీ మెడ్ మానుకుంటే కాలేజీ ఖర్చులకూ తనకూ ఏమీ సంబంధం లేదన్నాడు. సరేనని నేనే స్టూడెంట్ లోన్ తీసుకున్నాను. న్యూయార్క్‌లో చదివితే బాగుండేది. అక్కడ అవకాశాలు ఎక్కువగా వుండేవి. కాని ఖర్చులు కూడా చాలా ఎక్కువ. ట్యూషన్ మరీ ఎక్కువ. అందువల్ల ఇక్కడికొచ్చాను. అదీగాక నాకు మ్యూజిక్ టీచర్‌గా పని చెయ్యాలని కోరిక వుంది. ఇక్కడ మంచి మ్యూజిక్ ప్రోగ్రాం వుంది. డిగ్రీతోపాటు మ్యూజిక్‌లో టీచర్ సర్టిఫికేషన్ కూడా చేస్తున్నాను. మిషిగన్‌లో ఉద్యోగం కావాలంటే ఇక్కడే సర్టిఫికేషన్ చెయ్యటం బాగుంటుందని ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాను."

"బాగుంది కిరణ్. నీకు మొదటి నుంచీ సంగీతం అంటే ఇష్టం అని నాకు తెలుసు. నువ్వు మంచి టీచర్‌వవుతావు."

"థాంక్స్."

"మీవాళ్ళ గురించి విచారించకు. ఇప్పుడు నిరుత్సాహపడినా, తర్వాత బాగానే వుంటారు. వాళ్ళు కోరేది నువ్వు సుఖంగా, సంతోషంగా వుండాలనే కదా!"

"సుఖం, సంతోషం. ఆ మాటలకు అర్థం కూడా తెలియదు మా నాన్నకు. ఎవరన్నా మీవాడేం చేస్తున్నాడని అడిగితే సంగీతం చదువుతున్నాడని చెప్పటం ఆయనకు నామోషీ. మావాడు ప్రి మెడ్ చదువుతున్నాడనో, లేక నేరుగా మెడికల్ కాలేజీలో చేరాడనో చెప్పుకోవటం గొప్పగా వుంటుంది ఆయనకు."

"బయటివాళ్ళకు చెప్పటమే కాదులే కిరణ్. తల్లిదండ్రులకు నీ భవిష్యత్తు మీద ఆశలూ, ఆలోచనలూ వుంటాయి గదా! డాక్టరువయితే నీకు భవిష్యత్తులో ఎలాంటి ఆర్థికమైన ఇబ్బందులూ వుండవని వాళ్ళ ఆశ. నీ అభిరుచులు మంచివి కావని వాళ్ళ అభిప్రాయం కాకపోవచ్చు. కాని సంగీతంలో మేజర్ చేసినవారిని మెడిసిన్ చేసినవారితో పోలిస్తే ఎవరి భవిష్యత్తు బాగుంటుందో నువ్వు ఆలోచించ గలవు కదా!"

"మిస్ జెఫర్స్..."

"కేటీ అంటే చాలు."

"సరే. కేటీ! చదవటం ఎప్పుడూ డబ్బులు సంపాదించటం కోసమేనా? దానికి ఇంకొక గమ్యం లేదా?"

"అబ్బే, లేదని కాదు. తల్లిదండ్రులకు మొదట కనిపించేది భవిష్యత్తులో నీ ఆర్థిక స్థితి. సంగీతం టీచర్‌గా నువ్వు మీ నాన్న కట్టించినంత పెద్ద ఇల్లు కట్టించలేవుగదా! ఇలాంటివి తల్లి దండ్రులాలోచించేది. గౌరవం విషయంలో కూడ డాక్టరుకున్నంత గౌరవం సమాజంలో సంగీత విద్వాంసులకూ, టీచర్లకూ లేదుగదా?"

"డబ్బు విషయంలో మీరన్నది నిజమే. కాని గౌరవం విషయంలో మాత్రం నా అనుభవం వేరు. ఇండియా నుంచి ప్రతి సంవత్సరం సంగీతం పాడేవారు, వయొలిన్, శాక్సొఫోన్, వీణలాంటి ఇన్‌స్ట్రుమెంట్స్ వాయించేవారు వస్తుంటారు. మామూలుగా వాళ్ళు డిట్రాయట్ వచ్చినప్పుడు మా ఇంట్లోనే వుంటారు. వాళ్ళ ప్రోగ్రాములు ఏర్పాటు చేసేది మా నాన్నే. వాళ్ళని ఎంతో గౌరవంగా చూస్తాడు. వీళ్ళల్లో కొందరికి వంగి కాళ్ళు తాకి నమస్కారం చెయ్యటం కూడా చూశాను. ఆయన ఏ డాక్టరునూ అంతగా గౌరవించటం నేను ఎప్పుడూ చూళ్ళేదు. అందుకే నాకు ఆయన అర్థంగాడు. ఒకవైపు సంగీతం మీద అమితమైన గౌరవం, భక్తి. నా దగ్గరకొచ్చేసరికి అదొక పనికిమాలిన వృత్తి. మీరే చెప్పండి ఆయన్నెలా అర్థం చేసుకోవాలో."

"సంగీతం పనికిమాలిన వృత్తి అన్నారా మీ నాన్నగారు?"

"అవును. సంగీతంలో బియ్యే చదివితే తిండికి ఏం చేస్తావు అన్నాడు. అలాంటి పనికిమాలిన చదువు చదువుతానంటే ట్యూషన్‌కు నామీద ఆధారపడొద్దు అన్నాడు కూడా. సరే అన్నాను. ఇంతమంది సంగీతం నేర్పుతున్న వాళ్ళున్నారు. థియేటర్లలో, ఒపెరాల్లో, సినిమాల్లో, స్కూళ్ళల్లో, కాలేజీల్లో, ఆర్కెస్ట్రాల్లో... సంగీతానికి ఎన్నో అవకాశాలున్నాయి. సంగీతం లేనిచోటే లేదుగదా! మరి సంగీతం పనికిమాలినదెలా అవుతుంది? మా నాన్నకు కొంచెం స్కిట్సోఫ్రినియా వుందనుకుంటాను..."



"హాయ్ మామ్! రావటం ఆలస్యమయింది. సారీ," అంటూ వచ్చాడు టామ్.

"ఫరవాలేదు. టామ్, నీకు కిరణ్‌ని పరిచయం చేస్తాను. కిరణ్ కూడా బ్లూమ్‌ఫీల్డ్ హైస్కూల్లో చదివాడు. నువ్వెప్పుడన్నా చూశావో లేదో. నీకు రెండు మూడు సంవత్సరాలు జూనియర్. కిరణ్, వీడు మావాడు టామ్. ఇక్కడే కౌన్సెలింగ్‌లో మాస్టర్స్ చేస్తున్నాడు."

టామ్, కిరణ్ చేతులు కలిపారు.

"కిరణ్ ఈ సెమిస్టర్ ఇక్కడే చేరాడు. మ్యూజిక్ మేజర్. పోయిన సంవత్సరం కొలంబియాలో ప్రీమెడ్ చేశాడు."

"అలానా, మరి నీకెలా తెలుసు."

"రెండుమూడేళ్ళ క్రితం ఒకసారి గ్లోరియా, అదే మీ మ్యూజిక్ టీచర్ గ్లోరియా, స్కూల్లో ఒక కాన్సర్ట్‌కి రమ్మంటే వెళ్ళాను. ఆరోజు కాన్సర్ట్‌లో కిరణ్ వయొలిన్ వాయించాడు. చాలా బాగా వాయించాడు. కిరణ్‌కి వయొలిన్‌లో నేషనల్ ఆర్కెస్ట్రా అవార్డు కూడా వచ్చింది. ఆరోజుల్లో నేను అప్పుడప్పుడు మన వూరి పేపర్ క్రానికల్‌లో ఫ్రీలాన్సర్‌గా ఒక కాలం రాసేదాన్ని కదా. కిరణ్ గురించి ఒకసారి రాశాను."

"అలాగా. వెరీ గుడ్."

"నాకు క్లాసుంది. వెళ్ళాలి. మళ్ళా ఎప్పుడైనా వచ్చినప్పుడు టామ్‌నే కాదు, నన్ను కూడా గుర్తుంచుకోండి," అని కిరణ్ లేచాడు.

"తప్పకుండా. సెలవల్లో టామ్ ఇంటికొస్తుంటాడు. వాడితో నువ్వు కూడా రావచ్చు. వయొలిన్ తీసుకొని రా..."

థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు కిరణ్.

టామ్‌కి కిరణ్ గురించి అంతా చెప్పింది కేటీ.

* * *

న్యూస్‌పేపర్ టేబుల్ మీద పడేసి వంటగదికి చేరింది కేటీ. వీకెండ్‌కి ఇంటికొచ్చినప్పుడల్లా ఆకలీ ఆకలీ అంటూ నిద్రలేస్తాడు టామ్. వాడు లేచేసరికి ఏదన్నా చేసిపెడితే తప్ప బ్రతకనివ్వడు. తొందరగా లసాన్యా చెయ్యటం మొదలుపెట్టింది కేటీ.

పదకొండు గంటలకు నిద్ర లేచి, "మామ్, నాకు చచ్చిపోయేటంత ఆకలేస్తుంది," అంటూ నేరుగా వంటగదిలోకొచ్చాడు టామ్.

"అదేంటిరా లేవగానే తిండి. కాస్త పళ్ళు తోముకొని రారాదూ?"

"తిన్న తర్వాత ఎలాగూ తోముకోవాల్సిందేగా, మామ్. రెండుసార్లెందుకు. తిన్నాక తోము కుంటాగా. మంచి వాసనొస్తుంది, ఏం చేస్తున్నావు?" అంటూ స్టౌ దగ్గరకొచ్చాడు.

"లసాన్యా చేస్తున్నాను నీకిష్టమని. సరేగాని పేపర్లో ఐదోపేజీలో ఒక ఫోటో వుంది. చూసి ఎవరిదో చెప్పు."

చూశాడు టామ్. ఫోటో కిరణ్‌ది లాగుంది. ఫోటో కింద బ్లూమ్‌ఫీల్డ్ యువకుడు ఆత్మహత్య చేసుకున్నాడని వుంది. విషయం జాగ్రత్తగా చదివాడు టామ్. "మామ్, ఇతనెవరోగాని ఫోటో మాత్రం కిరణ్‌ది లాగుంది. ఎవరో పటేల్ అంట."

"నేనూ అలానే అనుకున్నాను. ఫోటో అచ్చం కిరణ్‌దిలాగానే వుంది. ఒక్క క్షణంపాటు మూడు నాలుగేళ్ళ క్రితం నేను తీసిన ఫోటోనే అనుకున్నాను. ఆత్మహత్య చేసుకున్న అబ్బాయి పేరు శ్రీరాం పటేల్ అని వుంది. కిరణ్ ఆత్మహత్య చేసుకుంటాడని నేనూ అనుకోలేదు. అయినా అబ్బాయికీ వాళ్ళ వాళ్ళకీ సంబంధాలు సరిగ్గా లేవు కదా! నాకు కొంచెం భయమేసింది. కిరణ్ నంబర్ నా దగ్గర లేక వాళ్ళ ఇంటి నంబర్ ఉంటే ఊరికే పిలిచినట్లు పిలిచి, బాగున్నారా, కిరణ్ ఎలా వున్నాడు అని అడిగాను."

"ఏమన్నారు?"

"కిరణ్ కొలంబియాలో మెడిసిన్ చదువుతున్నాడని చెప్పాడు శరత్‌బాబు, కిరణ్ వాళ్ళ నాన్న."

"లేదు, తప్పించుకొని పారిపోయాడు. ప్రస్తుతం సుఖంగా బతుకుతున్నాడని చెప్పక పోయావా?" అన్నాడు టామ్ అసహనంగా.

*ఈమాట, నవంబర్ 2002*



# మళ్ళా నాలుగేళ్ళకి

ఇంట్లోకొస్తుండగానే ఫోన్ మోగింది.

"హలో."

"రాబర్ట్?"

"సారీ, రాంగ్ నంబర్," అని నేను ఫోన్ పెట్టెయ్యబోతుండగానే,

"బేల మరాయా?" అని అడిగాడతను.

పరిస్థితి అర్థం అయింది నాకు.

"ఏదో లిస్టులోంచి ఒక్కొక్కరినీ పిలుస్తున్నారు కదూ?" అని అడిగాను.

అతను పట్టుబడిపోయిన దొంగలాగా, "అవును. బేలమరాయా మీరేనా?" అని అడిగాడు.

అవునన్నాను.



"నా పేరు రిచర్డ్ ష్రైబర్. మువ్ ఆన్ వారి తరపున పిలుస్తున్నాను, ఎన్నికల సందర్భంగా. కెర్రీ వైపున ప్రచారం చెయ్యటానికి ఒప్పుకున్న వారి లిస్టులో మీ పేరుంది. ఈరోజేమైనా మీకు తీరిగ్గా ఉంటుందేమో కనుక్కుందామని పిల్చాను."

ఇవాళో రేపో ఈ పిలుపు వస్తుందని నేను అనుకుంటూనే ఉన్నాను. ఎన్నికలింకా ఐదురోజుల్లోనే. ఇప్పుడు సహాయం చెయ్యకపోతే ఇంకెప్పుడు చేస్తాను.

"నేనిప్పుడే ఆఫీసు నుంచి ఇంటికొచ్చాను. ఒక గంట తర్వాత అయితే తీరిగ్గానే ఉంటాను. సరేనా?" అని అడిగాను.

"పర్‌ఫెక్ట్," అన్నాడతను.

"మనం ఏం చెయ్యాలి?" అని అడిగాను.

"అదే. ఇంటింటికీ పోయి కెర్రీకి ఓటు వెయ్యాలనుకుంటున్న వారందరినీ తప్పకుండా ఓటు వెయ్యమని బ్రతిమాలటం, మంగళవారం నాడు పోలింగు స్టేషను కెళ్ళటానికి ఏమైనా సహాయం కావాలా అని అడగటం. అదీ మన పని," అన్నాడతను.

"అలాగే చేద్దాం, నేను వస్తాను," అన్నాను. అతను వాళ్ళ ఇంటి చిరునామా ఇచ్చాడు. వెస్ట్ బ్లూంఫీల్డ్ వాడే. మా ఇంటికి దగ్గరే. ఒక మైలు కంటే దూరం ఉండదు.

నేను స్నానం చేసి, భోజనం ముగించి, వాళ్ళింటికి చేరేసరికి దాదాపు ఆరున్నరయింది. ఆకురాలే కాలం కావటం వల్ల అప్పటికే కొంచెం చీకటి పడింది. నాకోసం చూస్తూ వాళ్ళ గరాజ్ ముందు నుంచోనున్నాడు రిచర్డ్. నా వయసువాడే. నా కంటే కొంచెం పొట్టిగా, లావుగా ఉన్నాడు. కారును డ్రైవ్ వేలో పెట్టి అతనితో చెయ్యి కలిపాను. "రిచర్డ్, నా పేరు బేల మరాయా కాదు, బలరామయ్య. మనం కలిసి పని చెయ్యాలంటే నువ్వు నన్ను సరిగ్గా పేరుపెట్టి పిలవటం నేర్చుకోవాలి," అన్నాను నవ్వుతూ. అతనూ నవ్వేశాడు. రెండు మూడు ప్రయత్నాల్లో బాగానే బలరామయ్య అని పిలవటం నేర్చుకున్నాడు. అంత తొందరగా నేర్చుకోవటం ఆశ్చర్యంగా ఉందే అంటే తనకొక కంప్యూటర్ కంపెనీ ఉందనీ, దాన్లో పనిచేస్తున్న వాళ్ళలో కొందరు భారతీయులున్నారనీ, ఇలాంటి పేర్లు పలకటం అలవాటయిందనీ చెప్పాడు రిచర్డ్. అతనితో నా పరిచయం అలా మొదలయింది.

మేం చెయ్యబోతున్న పని గురించి కొంచెం వివరంగా చెప్పాడు రిచర్డ్. ప్రతి ప్రీసింక్ట్‌లో డెమోక్రటిక్ పార్టీ సభ్యులుగా ఉంటూ దాదాపు పది సంవత్సరాలకు పైగా ఎన్నికల్లో అసలు ఓటెయ్యని వారు చాలామంది ఉన్నారట. అలాంటి వారి పేర్లూ, చిరునామాలు ప్రీసింక్టువారీగా సేకరించారు మువ్ ఆన్ వాళ్ళు. మా పదమూడో ప్రీసింక్టులో ఈ ప్రాంతంలో ఉన్న వారి జాబితా రిచర్డ్ దగ్గరుంది. చంకలో ఉన్న నోట్‌పాడ్ తీసి ఫ్లాష్‌లైట్ వెలుతురులో లిస్టు చూయించాడు రిచర్డ్. లిస్టులో ఉన్న కొందరు ఇళ్ళు మారి ఉండవచ్చు. మిగిలినవారిలో కొందరైనా కెర్రీకి ఓటెయ్యాలని అనుకునే వారుంటారు. కానీ, వీళ్ళకు ఉత్సాహం తక్కువ. ఏ చిన్న అవాంతరం వచ్చినా, పోలింగు స్టేషనుకెళ్ళరు. ఈ



గుంపులో కొందరినైనా మంగళవారం నాడు పోలింగు స్టేషనుకు రప్పించగలిగితే మనం మిషిగన్‌లో కెర్రీని గెలిపించినట్లే. ప్రతి ఓటూ విలువైందని వీళ్ళకు మనం నచ్చజెప్పాలి - ఉత్సాహంగా, ఉద్వేగంతో మాట్లాడాడు రిచర్డ్.

నాకూ ఉత్సాహంగానే ఉందిగాని, కొన్ని రోజులుగా నన్నొక అనుమానం పీడిస్తుంది. మువ్ ఆన్ వాళ్ళు మీటింగుకి రమ్మని పిల్చినప్పుడు నేనూ వెళ్ళాను. అక్కడ ఒకతను మా అందరితో మాట్లాడుతూ ఎలక్షన్ సందర్భంగా చెయ్యాల్సిన పనుల గురించి వివరంగా చెప్పాడు. కొందరు పోస్టులో ఉత్తరాలు పంపించటానికి, మరికొందరు ఫోన్లు చెయ్యటానికి ఒప్పుకున్నారు. నాకు ఆ పన్లు అంతగా ఇష్టంలేక దాటేశాను. ఇంటింటికీ వెళ్ళి ఓటర్లతో మాట్లాడ్డానికి కొందరు వాలంటీర్లు కావాలన్నాడతను. ఎందుకోమరి నాకు ఆ పని చెయ్యటం బాగుంటుందనిపించింది. నా పేరు రాసుకోమన్నాను. తర్వాత వేరుగా మా గ్రూపుతో మాట్లాడుతున్నప్పుడు మాలో ఒకామె అతన్నొక ప్రశ్నవేసింది- "ఇంటింటికీ తిరగటం కన్నా, వాళ్ళతో ఫోన్ చేసి మాట్లాడితే తక్కువ కాలంలో ఎక్కువమందితో మాట్లాడొచ్చుగదా?" అని. దానికతను తడుంకోకుండా వెంటనే, "ఈ విషయం మీద చాలా పరిశోధన జరిగింది. ఎదురుగా నుంచోని మాట్లాడే మనిషితో ఏర్పడే అనుబంధం ఫోన్లో మాట్లాడేవాడితో ఏర్పడదు. అదీగాక ఫోన్ చేస్తున్నవాడు పొరుగింటి సాటి అమెరికా వాడో, లేక బెంగుళూరు నుంచి ఫోన్ చేస్తున్న కూలోడో ఎలా తెలుస్తుంది?" అని తిరుగు ప్రశ్న వేశాడు. ఆమెకు ఆ సమాధానం నచ్చినట్లుంది. తల పైకీ కిందికీ ఊపింది. నాకు మాత్రం నా అస్తిత్వం ఏమిటో అర్థం కాలేదు. నేను సాటివాడినా? కాదా? ఎవరింటికైనా వెళ్ళి తలుపుతట్టి ఎన్నికల గురించి మాట్లాడితే నన్ను పొరుగువాడిలాగా చూస్తారా? లేక కూలికి ఎన్నికల ప్రచారం చేస్తున్నవాడిలాగా చూస్తారా? నిజానికి జీతాలు తీసుకుని ఎన్నికల పని చేసేవాళ్ళు చాలామందున్నారు. అసలు ఈ మువ్ ఆన్ వాళ్ళు కూడా అలాంటివాళ్ళే గదా? కానీ వీళ్ళేదో ఆదర్శవంతులైనట్లూ, ఇండియావాళ్ళు మాత్రం ఎవడు డబ్బులిస్తే వాడికి కూలిచేసే వాళ్ళైనట్లూ మాట్లాడుతున్నాడీడు. నేను ఈ ఆలోచనల్లో ఉండగా, నా పక్కనున్నతను అతని భుజం తట్టి, మన గ్రూపులో కూడా ఒక ఇండియా అతనున్నాడు, అలా మాట్లాడటం సమంజసంగా లేదు అని అతన్ని మందలించాడు. అతను నావైపు ఒకసారి ఇబ్బందిగా చూసి మళ్ళా మాట్లాట్టం మొదలెట్టాడు. ఆ తర్వాత వాళ్ళు మాట్లాడుకుంటుందేదీ నాకు వినపళ్ళేదు. నా ఆలోచనల్లో నేనుండిపోయాను. కెర్రీకి సహాయం చెయ్యాలి. కాని నేనొక్కణ్ణే ఎవరింటికీ పోవటం అంత మంచిదికాదేమో. ఎవరితోనైనా కలిసి పనిచెయ్యాలి. అలాంటి అవకాశం దొరికితే చెయ్యటం లేకపోతే మానుకోవటం - అదీ ఆనాటి నా నిర్ణయం.

విషయం అంతా చెప్పి, "నువ్వు కలిసి తిరుగుదాం అన్నావు కాబట్టి వచ్చాను, అయినా నన్ను చూసి కెర్రీకి ఓటెయ్యాలనుకుంటున్నవాళ్ళు గూడా మనసు మార్చుకుంటారేమో?" అన్నాను.

రిచర్డ్ రెండు క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. నిదానంగా తూచినట్లు మాట్లాడుతూ, "అవును, చాలామందికి ఇక్కడ ఉద్యోగాలు పోతున్నాయని కోపంగా ఉంది. అవి ఇండియా పోతున్నాయని

ఇండియా వాళ్ళ మీద కోపం చూపిస్తున్నారు. కాని, ఆ తీసుకెళ్తున్న కంపెనీలను ఏమీ చెయ్యలేకపోతున్నారు. అదీగాక ఈ ఔట్‌సోర్సింగ్‌కి వ్యతిరేకంగా మాట్లాడుతుంది కెర్రీనే, బుష్ కాదుగదా? ప్రస్తుతానికి ఒక పనిచేద్దాం. మనం తలుపు తట్టినప్పుడు, తలుపు తీసినవాళ్ళతో నేను మాట్లాడ్డం మొదలుపెడతాను. పరిస్థితిని బట్టి, వీళ్ళలో కొందరు ప్రవాసులు కూడా ఉంటారుగదా, నువ్వా మాట్లాడొచ్చు," అన్నాడు. సరే అలాగే చేద్దాం, పోదాం పదమన్నాను.

మొదట వాళ్ళ పక్క వీధితోనే మొదలుపెట్టాం. ఫ్లాష్‌లైటు వెలుతురులో లిస్టులో ఉన్న మొదటి ఇంటి నంబరూ, ఇంటివారి పేర్లు గుర్తు పెట్టుకుని, ఇళ్ళ ముందు పోస్టు డబ్బాల మీద ఉన్న నంబర్లు చూసుకుంటూ ఆ ఇంటికొచ్చి తలుపు తట్టాం. ఒక ముప్పై యేళ్ళతను తలుపు తీశాడు. బనీనూ, పైజామా వేసుకుని ఉన్నాడు, కుడిచేతిలో పెన్సిలుంది.

"గుడీవెనింగ్," అన్నాం మేం.

"ఏం కావాలి మీకు? ఎవరు మీరు?" అని అడిగాడతను, దురుసుగా.

"మేం మీ పక్కవీధి వాళ్ళమే, ఎన్నికల సందర్భంగా వచ్చాం," అని మొదలుపెట్టాడు రిచర్డ్.

"సారీ, నాకిప్పుడు టైమ్ లేదు," అంటూ ఢాంన తలుపు మూసేసాడతను.

గుడ్లు తేలేశాడు రిచర్డ్. "ఆరంభమే అశుభంగా ఉందే," అన్నాడు.

అమెరికాలో పుట్టి పెరిగిన తెల్లవాడిక్కూడా శుభం, అశుభం లాంటి నమ్మకాలుంటాయని నాకిది వరకు తెలియక ఆశ్చర్యపడ్డాను.

ఫ్లాష్‌లైటు వెలుతురులో రెండో ఇంటి నంబరూ వాళ్ళ పేర్లూ చూసుకున్నాం. పోస్టుడబ్బా మీద నంబరు చూసి ఆ ఇంటి తలుపు తట్టాం. జవాబు లేదు. కొంచెంసేపు ఆగి మళ్ళా తట్టాం. ఇక ఎవరూ తలుపు తీసేట్టులేదులే అనుకుంటుండగానే ఒక యువతి తలుపు తీసింది. ఆమె చెయ్యి పట్టుకుని ఒక నాలుగైదేళ్ళ అమ్మాయి కూడా ప్రత్యక్షమయింది.

"గుడీవెనింగ్," అన్నాం మేం, ఆమె చిరునవ్వుతో సమాధానం చెప్పింది.

"మేం పక్కవీధి వాళ్ళమే, ఎన్నికల సందర్భంగా వచ్చాం," అని మామూలు దండకం చదివి, "మీ పేరు సూజీనే కదూ?" అని అడిగాడు రిచర్డ్.

"కాదు," అంది ఆమె.

కాని, తన పేరేంటో చెప్పలేదు. కొన్ని ఇళ్ళ దగ్గర ఇలాగే జరగొచ్చని మాకు ముందుగానే తెలిసినా, వెంటనే ఆమెతో సంభాషణ ఎలా పొడిగించాలో మేము ముందుగా ఆలోచించలేదు.

రెండు క్షణాలు తటపటాయించి, "మీరు మంగళవారంనాడు ఓటు వేస్తున్నారా?" అని అడిగితే, "లేదు, మేము ఈ ఊరు ఈ మధ్యే వచ్చాం, ఇంకా ఇక్కడ రెజిస్టరు చేసుకోలేదు," అంది.

"రెజిస్టరు చెయ్యనివాళ్ళు కూడా ముప్పై రోజులు ఈ ఊళ్ళో ఉన్న వారు ఓటు వెయ్యొచ్చు. మీకు ఆ ఏర్పాటు మేం చేస్తాం, మీరు ఓటు వేస్తారా?" అని అడిగాడు రిచర్డ్. ఆమె అయిష్టంగా ముఖం పెట్టింది.



"సరే, ఫరవాలేదులెండి," అని మేము గుడ్‌నైట్ చెప్పి వచ్చేసాం.

మూడో ఇంటి అతని పేరు కూడా మా లిస్టులో ఉన్న పేరు కాదు. అయితే అతనికి ఎన్నికల మీద ఆసక్తి ఉంది. కాని, ఓటు ఎవరికెయ్యాలో మాత్రం ఇంకా నిర్ణయించుకోలేకపోతున్నానన్నాడు. ఇలాంటి వాళ్ళకి కొంచెం బుర్రతక్కువేమోనని నా అనుమానం. నువ్వేటువైపో తెలియకపోవటం ఏంటీ? ఇరాక్ యుద్ధం మీద ఇతనికి ఒక అభిప్రాయం లేదా? అసలు ఇరాక్ సంగతి తెలుసో లేదో మహానుభావుడికి. వీడికొక ఉపన్యాసం ఇవ్వాలని ఉబలాటంగా ఉన్నా, ఎవరితోనూ వాదనకు దిగొద్దని మువ్ ఆన్ వాళ్ళు చెప్పటం గుర్తొచ్చి నేను నోరు మూసుకుని రిచర్డ్‌నే మాట్లాడనిచ్చాను. తను మేం కెర్రీ సపోర్టర్లమనీ, మీకేమి అభ్యంతరం లేకపోతే కెర్రీ గురించి, డెమోక్రటిక్ పార్టీ ప్లాట్‌ఫార్మ్ గురించీ కొన్ని కరపత్రాలిచ్చి పోతామని అడిగాడు. సరే ఇవ్వండి అన్నాడతను.

నాలుగో ఇంటి దగ్గర తలుపు తీసిన ఆమె ఓటు వెయ్యబోతున్నానంది. కాని, ఎవరికి వేస్తారో చెప్తారా అంటే అది నా స్వవిషయం కదా అంది. అలా చెప్పను అన్నవారిని అలాగే వదిలెయ్యటం మంచిదని మువ్ ఆన్ వారి సలహా. ఒకవేళ మేము అలాంటివాళ్ళతో వాదనకు దిగితే, వాళ్ళు మనకు ఓటు వెయ్యకపోగా, బుష్‌కే వేద్దామని గట్టిగా నిర్ణయించుకునే ప్రమాదం ఉంది.

ఆ తర్వాత నాలుగైదు ఇళ్ళ వాళ్ళు అలాగే ఓటు వేస్తాంగాని, ఎవరికి వేస్తామో చెప్పం అన్నారు. అప్పటికే దాదాపు ఏడున్నర అయింది. అంతవరకూ మాకు ఒక్క కెర్రీ ఓటరు కూడా దొరకలేదు. అసలు మనం చేస్తున్న పని వృథా ఏమో అనిపించింది నాకు.

రిచర్డ్ కూడా అంత ఉత్సాహంగా ఉన్నట్లు లేదు. బాతాఖానీకి దిగాడు. నా ఉద్యోగం గురించి అడిగాడు. ఈ దేశంలో ఎన్నాళ్ళ నుంచి ఉంటున్నావని అడిగాడు.

"నా దగ్గర పనిచేసే ఇండియా వాళ్ళలో ఎక్కువమందికి బుష్ అంటే ఇష్టంలాగుంది, మరి నీకెందుకు బుష్ అంటే వ్యతిరేకత?" అని అడిగాడు.

"కెర్రీ అంటే ఎందుకు ఇష్టం అని అడగలేదేం?" నేను తిరుగు ప్రశ్న వేశాను.

నవ్వేశాడు. "నాకు తెలిసిన కెర్రీ వైపు వాళ్ళందరూ బుష్ అంటే గిట్టని వాళ్ళే, కెర్రీ మీద వల్లమాలిన అభిమానం ఉన్నవాళ్ళు కాదు. నువ్వు కూడా ఆ బాపతే అనుకున్నా," అన్నాడు.

"నిజమే. నేను ఆ బాపతే. బుష్ చేస్తున్న పని ఒక్కటీ నాకు నచ్చదు. ముఖ్యంగా, ఏదో ఒక సాకుతో ఇతర దేశాల మీద యుద్ధానికి దిగటం పరమ అనాగరికం అని నా అభిప్రాయం," అన్నాను. బుష్‌గాడిని ఇంకా తిట్టాలని ఉత్సాహంగా ఉందిగాని, ఇంతలో తర్వాతి ఇంటికి వచ్చాం.

తలుపు తీసిన ఆమెకు దాదాపు యాభైయేళ్ళుండవచ్చు. ఆమెతో బాటు రెండు కుక్కలు కూడా ప్రత్యక్షమయ్యాయి. మామూలుగానే ఎన్నికల సందర్భంగా వచ్చామనీ, మీరు ఓటు వెయ్యబోతున్నారా? ఎవరికి వెయ్యాలనుకుంటున్నారు అని అడిగాడు రిచర్డ్.

"ఇద్దరూ ఇద్దరే దరిద్రులు. కాస్త బుర్ర ఉన్నవాడెవడన్నా నిలబడితే ఓటు వేద్దామని చూస్తుంటే అది ఈసారి కూడా జరగలేదు. ఇక ఏం చేస్తాం. ఈ గాడిదల్లోనే ఒకడికి వెయ్యాలిగదా? కెర్రీకి వేద్దాం అనుకుంటున్నాను," అంది ఆమె.

ఆమె ఉత్సాహంగా కెర్రీని సపోర్ట్ చెయ్యకపోయినా, ఆహా, మనకసలు ఒక ఓటంటూ దొరికింది కదా అని మేమెంతో సంతోషించాం. ఆమెతో ఇద్దరం చేతులు కలిపాం. మంగళవారంనాడు పోలింగు స్టేషనుకెళ్ళటానికి ఏమన్నా సహాయం కావాలా అని అడిగాం. లేదు, ఏమీ అవసరం లేదందామె. మీ ఫోన్ నంబరు ఇస్తారా, మంగళవారం నాడు పిల్చి ఓటు వేసారో లేదో కనుక్కుంటాం అని అడిగాం. ఆమె ఫోన్ నంబరు ఇచ్చింది.

మాకు కొంచెం ప్రాణం వచ్చినట్లయింది. ఉత్సాహంగా నడవటం మొదలుపెట్టాం. కాని, తొమ్మిది గంటలదాకా తిరిగినా మాకు మళ్ళా కెర్రీ సపోర్టరెవరూ దొరకలేదు. కెర్రీ సపోర్టరేగాదు, బుష్ సపోర్టరు కూడా ఎవరూ తారసపడలేదు. ఎక్కువగా తప్పుడు చిరునామాలూ, ఎవరికి ఓటేస్తామో చెప్పం అనేవారూ, అంతా చేసి మూడు గంటల పాటు తిరిగితే మాకు దొరికింది ఒక్క ఓటే.

తొమ్మిది దాటింతర్వాత ఎవరింటికీ పోవటం అంత బాగుండదని ఇక ఈరోజుకి ఆపుదాం అనుకున్నాం. రేపు మళ్ళీ తీరికుంటుందా నీకు అని అడిగాడు రిచర్డ్. అతనికి నాతో సహా మొత్తం ఆరుగురు వాలంటీర్లున్నారట. ఆదివారంలోగా అందరం కలిసి ఒక వెయ్యి ఇళ్ళకు వెళ్ళాలట. "అది జరిగే పనేనా?" అంటే, "జరిగినంత వరకే జరుగుతుంది, ఎన్ని ఇళ్ళకెళ్ళగలిగితే అన్నిటికెళ్దాం, కెర్రీ ఒక్క ఓటుతో గెల్చినా గెల్చినట్లే గదా," అన్నాడు. అతని పట్టుదల నాకు సంతోషం కలిగించింది. "ఆఫీసు నుంచి కొంచెం పెందలాడి వచ్చేసావంటే మనం ఐదు గంటలప్పుడు మొదలుపెట్టి నాలుగు గంటలపాటు తిరగొచ్చు," అన్నాడురిచర్డ్. అలాగేనన్నాను.

ఆరోజు శుక్రవారం. ఉదయం వానతో మొదలయింది. సాయంత్రం దాకా వాన పడిందంటే ఇక మా కార్యక్రమం చెడిపోతుందేమోనని భయపడ్డాను. కానీ, మధ్యాహ్నానికి వాన ఆగిపోయింది. సూర్యుడు బయటికొచ్చాడు. మంచి ఎండ. నాలుగు గంటలకు బయట చాలా బాగుంది. ఆకురాలు కాలంలో ఇలాంటి అందమైన రోజుల్లో ఆఫీసు వదిలేసి ఎక్కడన్నా పార్కులో తిరగాలనిపిస్తుంది. ఈరోజు ఎలాగూ ఇంటింటికీ తిరగాలి గదా అని నాలుగు గంటలకు ఆఫీసు పని ముగించుకుని ఉత్సాహంగా ఇంటికి బయలుదేరాను.

ఈరోజు మాకు మా ప్రీసింక్ట్‌లోదే ఒకపక్క ఊరి లిస్ట్ ఇచ్చారు మువ్ ఆన్ వాళ్ళు. అది తీసుకుని రిచర్డ్డూ నేనూ ఐదు గంటలకు ఓట్ల యాత్ర మొదలెట్టాం.

మొదటి వీధి చాలా అందంగా ఉంది. వీధి మొత్తంలో పదీ పన్నెండు ఇళ్ళున్నాయేమో. పెద్ద పెద్ద ఇళ్ళు. ప్రతి ఇంటి చుట్టూ దాదాపు రెండెకరాల అందమైన లానూ, పూలమొక్కలూ. ఒక్కో ఇల్లు రోడ్డుకి దాదాపు ముప్ఫై నలభై గజాల దూరంలో ఉంది. ఈ వీధిలో డెమోక్రాట్లుంటారని నాకు నమ్మకం లేదన్నాడు రిచర్డ్.

అదీగాక మా లిస్టులో ఉన్న మొదటి ఇంటి ముందు ఎత్తయిన జెండా కట్టే స్తంభం, దాని మీద ఎగురుతున్న పెద్ద జెండా. అది చూడగానే, వీడు తప్పకుండా రిపబ్లికనే అయ్యుంటాడన్నాడు



రిచర్డ్. ఈ ఇంటికి పోవాలంటావా? అన్నట్లు నావైపు చూశాడు. జెండా డెమోక్రాట్లుకూడా కట్టొచ్చుగా, చూద్దాం, అన్నాను.

మెల్లిగా, గౌరవంగా తలుపు తట్టాం. కొంచెంసేపు వినయంగా చేతులు కట్టుకు నిల్చున్నాం. జవాబు లేదు. మళ్ళా తలుపు కొట్టాం. రెండు నిముషాలాగాం.

"ఏమో? వీళ్ళు ఇంట్లో ఆవైపు ఉన్నారేమో? ఇంత పెద్ద ఇంట్లో ఆవైపు నుంచి ఈవైపుకు రావాలంటే కొంచెంసేపు పట్టదూ?" అన్నాను సమాధానపడుతూ.

"అవును, ఈవైపేదన్నా జరిగితే వీళ్ళకు రేపు ఉదయం టీవీ వార్తల్లోగానీ తెలియదు," అని జోకాడు రిచర్డ్.

మరో రెండు నిముషాలుండి ఇక లాభంలేదులే అని సాగిపోయాం.

"ఇలా ఎక్కడో ఒక ఇల్లు ఉన్నచోట ఎవరితోనన్నా మాట్లాడే అవకాశం దొరికితే ఎగిరి గంతేస్తారేమో అనుకున్నాను. వీళ్ళేమో తలుపులు కూడా తియ్యటం లేదు, అదేం జబ్బో? ఇలాంటి చోట నైనేతే అసలు ఉండలేను," అన్నాడు రిచర్డ్ చాలా గంభీరంగా.

వరుసగా మొదటి నాలుగు ఇళ్ళ దగ్గరా ఇలాగే ఎవ్వరూ తలుపు తియ్యలేదు. రిచర్డ్‌కి కోపం కొద్దికొద్దిగా పెరుగుతూ వస్తుంది. "ఈ నాలుగు ఇళ్ళకోసం ఇప్పటికే అరమైలు నడిచినట్లున్నాము. ఇలా మనం కాలం వృథా చేసుకుంటూ పోతే ఎలా? ఏదైనా అపార్ట్‌మెంట్ కాంప్లెక్సుకెళ్ళినట్లయితే ఒక గంటలో ఇరవైమందితోనైనా మాట్లాడుండేవాళ్ళం. ఇలాంటి డబ్బున్న వాళ్ళుండే వీధుల్లో, మనకు చూట్టానికైనా మనుషులు కనబడని చోట తిరిగి ఏం ప్రయోజనం?" వాపోయాడు రిచర్డ్.

మువ్ ఆన్ వాళ్ళ ఆఫీసుకి ఫోన్ చేసాడు రిచర్డ్. మా ప్రీసింక్టులో ఇంకొక ప్రాంతానిదేదైనా లిస్టుందా అని అడిగాడు. ఒక అరగంటలో వస్తే ఇంకొక ప్రాంతం లిస్టు తయారుగా ఉంచుతాం అన్నారు వాళ్ళు.

దాదాపు ఆరున్నరకు కొత్త లిస్టుతో మరో వీధిలోకి చేరాం. అప్పటికే చీకటి పడింది. ఫ్లాష్‌లైటు వెలుతురులో మొదటి ఇంటి నంబరూ, ఇంటివారి పేర్లూ చూసుకుని పోస్టుబాక్సుల మీద నంబర్లు చూసుకుంటూ నడవసాగాము. ఈ వీధి నిన్న మేము తిరిగిన వీధిలాగే ఉంది. రోడ్డు మీద బాగా ఆకులు పడున్నాయి. ఇళ్ళ ముందు పార్కు చేసిన కార్లున్నాయి. కొందరి ఇళ్ళ ముందు హాలోవీనుకి సంబంధించిన దయ్యాలూ, భూతాలూ, ఎముకలగూళ్ళూ ఉన్నయ్. చెక్కిన గుమ్మడి కాయల్లో వెలిగించిన దీపాలు అక్కడక్కడా కనిపించాయి. ఇక్కడ తలుపు తట్టిన ప్రతిచోటా ఎవరో ఒకరు తలుపు తీశారు. కానీ, ఫలితం మొదటి రోజులాగే ఉంది. ఎవరికి ఓటు వేస్తున్నారో చెప్పటానికి ఒక్కరు కూడా ఒప్పుకోలేదు. మొదటిరోజు కనీసం ఒక్కరైనా దొరికారు. ఈరోజు నాలుగుగంటల తిరుగుడులో ఒక్క కెర్రీ ఓటరు కూడా దొరకలేదు.

ఇదేదో అర్థం కావటంలేదు అన్నాడు రిచర్డ్. ప్రతిరోజు ఉదయం తొమ్మిదిన్నరకు మువ్ ఆన్ వాళ్ళ ఆఫీసులో మీటింగు జరుగుతుందట. క్రితం రోజు ఎన్ని ఇళ్ళకెళ్ళారో, ఎంతమంది కెర్రీ ఓటర్లు

దొరికారో అని ప్రతి ప్రీసింక్టు నుంచీ రిపోర్టులొస్తాయట. అదేంటో మరి మిగతావాళ్ళందరికీ ప్రతిరోజూ నలభై యాభై మంది కెర్రీ ఓటర్లు దొరుకుతున్నారట. మరి మన పరిస్థితి ఎందుకిలా ఉంది? ఈ రెండు రోజుల్లో మేం దాదాపు అరవై డెబ్భై ఇళ్ళకెళ్ళాం. ఒక్క కెర్రీ సపోర్టరే దొరికింది. ఇందులో మనం చేస్తున్న తప్పేదో ఉందని మా ఇద్దరికీ మొదట అనుమానం, తర్వాత నమ్మకం కుదిరింది.

మరుసటిరోజు శనివారం. ఉదయం చక్కగా ఎండ కాస్తుంది. మా దొడ్లో చెట్ల మీద ఒక్క ఆకు కూడా లేదు. నిన్నటి వానకూ, రాత్రి వచ్చిన గాలికీ చెట్ల మీద ఆకులన్నీ రాలిపోయాయిలాగుంది. ఎర్రటి, పసుపుపచ్చటి ఆకులతో లానంతా దుప్పటికప్పినట్లుంది. ఈరోజు మధ్యాహ్నం రెండు గంటలకు కలుద్దాం అన్నాడు రిచర్డ్. సరే నిన్న పెందలాడే ఆఫీసు నుంచి వచ్చేశానుగదా ఈరోజెళ్ళి కొంచెంసేపు పనిచేసుకోనొద్దాం అని ఆఫీసుకి బయలుదేరాను.

మా ఆఫీసు బిల్డింగు నిర్మానుష్యంగా ఉంది. నాలుగో అంతస్తులో మా సెక్షన్లో ఒక్క సహోద్యోగి మాత్రం ఉన్నాడు. "ఏంటీ ఇలా వచ్చావీరోజు?" అని అడిగాడు.

"అదే, కెర్రీ ప్రచారం మీద నిన్న కొంచెం పెందలాడే ఇంటికెళ్ళానుగదా, ఈరోజు ఆ పని కాస్త పూర్తి చేసుకెళ్దామని వచ్చాను," అన్నాను.

అతని భార్య కూడా డెమోక్రాటే. ఆమె కూడా మూడు నాలుగు రోజులుగా కెర్రీ ఓటర్ల కోసం ఇంటింటికీ తిరుగుతుందట. "నాక్కొంచెం భయంగానే ఉంది, జెన్నీకి బుష్ అంటే బొత్తిగా గిట్టదు. ఆమె కారు బంపరు మీద ఒక కార్టూనుంది. ఎంప్టీ వార్‌హెడ్ అని రాసుంటుంది. దాని పక్కనే కాళీగా ఉన్న బుష్ తల ఉంటుంది. బుష్ సపోర్టరుకెవడికైనా కోపం వచ్చి కారు అద్దాలు పగలగొడతాడేమోనని నా భయం. పైగా ప్రచారానికెళ్ళినప్పుడల్లా ఒక టీ షర్టేసుకుని పోతుంది. దాని మీద బుష్‌ని చేతిలో బాంబున్న కోతిలా చూపించే బొమ్మొకటుంది. ఏదో ఒక ఇంటి దగ్గర బుష్ సపోర్టరుకెవడికో కోపం వస్తుంది. ఈమెను తన్నినా తన్నొచ్చు, అదీ నా భయం," అన్నాడతను.

ఎక్కడో తల్లో ఒక దీపం వెలిగినట్లయింది నాకు. అదీ సంగతి! మేం చేస్తున్న తప్పు అదే!

ఆఫీసు నుంచి ఇంటికెళ్తూ మువ్ ఆన్ వాళ్ళ ఆఫీసు దగ్గర ఆగి రెండు పెద్ద కెర్రీ బటన్లు తీసుకున్నాను. రెండు గంటలకు రిచర్డ్‌ని కలిసినప్పుడు ఒకటి అతనికిచ్చాను. ఒకటి నా చొక్కా జేబుకు పైగా, ఎదుటివాడికి బాగా కనపడేటట్టుగా పెట్టుకున్నాను. రిచర్డుకి నేను చెప్పకుండానే అర్థమయింది విషయం.

ఆరోజు మేం సాయంత్రం ఐదు గంటలదాకా తిరిగాం. ఈసారి మేం ఎన్నికల సందర్భంగా వచ్చాం అనటం కాకుండా, మేం కెర్రీ సపోర్టర్లం, అని మొదలుపెట్టాం. వెంటనే జవాబుగా, 'నేనూ కెర్రీ సపోర్టర్నే!' అనో, 'సారీ, నేను బుష్ సపోర్టర్ని,' అనో జవాబు వచ్చేది.

ఆరోజు మేం కలిసిన వాళ్ళల్లో సగంమందైనా కెర్రీ సపోర్టర్లయి ఉంటారు. బుష్ సపోర్టర్నని ఎవరైనా అంటే థాంక్యూ అని నమస్కారం పెట్టి మా దోవన మేం పోయాం. కెర్రీ సపోర్టర్నని చెప్పిన



వాళ్ళతో కొంచెంసేపు మాట్లాడి, మాకు ఇష్టమైన బుష్ జోకులు కొన్ని గుర్తు తెచ్చుకుని, మా సంతోషం పంచుకుని, మంగళవారం నాడు ఏదైనా సహాయం కావాలా అని అడిగి, వాళ్ళ ఫోన్ నంబరు రాసుకుని, సెలవు తీసుకున్నాం.

ఐదు గంటలకు మా తిరుగుడు ముగించి, రిచర్డ్ ఇంటికి చేరాం. రేపెన్ని గంటలకు కలుద్దాం? అని అడిగాడతను. రేపు నేను న్యూయార్కెళ్ళాలి, అందువల్ల ఇక ఈ ప్రచారానికి నేను రాలేనని చెప్పాను. రిచర్డ్ నిరాశపడ్డాడు. నీతో కలిసి పని చెయ్యటం చాలా బాగుండింది అన్నాడు. ఇంట్లోకి రమ్మని పిల్చి, కాస్త కాఫీ అయినా ఇస్తాడేమోననుకున్నాను. కారులోంచి దిగుతూ, ఓకే, మరి మళ్ళా నాలుగేళ్ళకి కలుద్దాం, బై, అని ఇంట్లోకి వెళ్ళిపోయాడు రిచర్డ్.

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 27 మార్చి 2005*




నా కథలకు పుస్తక రూపం ఇచ్చిన మిత్రుడు
వాసిరెడ్డి నవీన్ గారికి,

ఈ కథలను ప్రచురించిన
విపుల, ఇండియాటుడే
ప్రజాతంత్ర, ఈమాట
ఆంధ్రజ్యోతి, భూమిక
సంపాదకులకు

కృతజ్ఞతలు...



నా మొదటి కథకు రెండు వారాల సెలవు అని పేరు పెట్టి, దానిని విపులలో ప్రచురించారు శ్రీ చలసాని ప్రసాదరావుగారు.

'ఎప్పుడో ఒకసారి కథొకటి రాస్తే కుదరదు, ఎప్పుడూ రాస్తూండాలి.' అని ప్రోత్సాహం అందజేస్తూ ఎన్నో ఉత్తరాలు రాశారు.

'ఏంటీ, ఈమధ్య ఏమీ రాసినట్టులేదే. ఉషా గారు ముడిసరుకేమీ తీసుకురావటం లేదా?' అని అడుగుతుండేవారు.

*ఈ పుస్తకం చూసి ఆయన*
*ఎంత సంతోషించేవారో!*

ఇవీ కథలు...



## GATTU TEGINA CHERUVU

**Short Stories by Ari Sitaramayya**

*Ari Sitaramayya was born and brought up in Timmanapalem, a village in Prakasam district, A.P. He had his education in Ongole, Chirala and Lucknow. Trained as a biochemist, he works currently as a professor of biomedical sciences at Oakland University, Michigan, USA.*

తెలుగువారి ఉమ్మడి కుటుంబవ్యవస్థ ఇంచుమించు చరమదశలో ఉందని చెప్పుకోవచ్చు. ఉమ్మడి కుటుంబ వ్యవస్థకు దూరమవుతున్న ప్రస్తుత యువ దంపతుల మధ్య సంబంధాలెలా ఉండాలి? ఇదొక పెద్ద ప్రశ్న కాదనిపించినా, మరుగునపడుతున్న వ్యవస్థలో సరైన సమాధానాలు దొరక్కా, కొత్త వ్యవస్థతో పూర్తి అవగాహన లేకా కొత్త కాపురాలు ఎన్నో సమస్యలకు గురవుతున్నాయి. సమాన బాధ్యతలు నిర్వహిస్తున్న భార్యాభర్తల్లో కుటుంబ పెత్తనం ఎవరిది? యువకులు ఉమ్మడి కుటుంబాల్లోలానే యజమానులుగా ప్రవర్తిస్తున్నారు. పరస్పర గౌరవం, వ్యక్తిగతంగా ఎదిగే అవకాశం కాంక్షించే యువతులకు ఈ కుటుంబాల్లో ఊపిరి సలపడం లేదు. ఈ సంకలనంలోని కథల్లో ఎక్కువ భాగానికి నేపథ్యం ఇదే.

